# చతుర

సంపుటి : 7 జూలై 1984 సంచిక : 6

## ఈ నెల సమగ్ర నవల

ఆత్మగౌరవాన్ని నిలబెట్టుకోవటానికని పౌరుషంతో ఐశ్వర్యాన్ని త్యజించి బడిపంతులుగా అజ్ఞాత జీవితం గడిపిన తండ్రి....

తొందరపాటుతో దూరంచేసుకున్న బంధువుకోసం, అంతకు మించిన ఆత్మీయ మిత్రునికోసం మధనపడే మేనమామ...

పరోపకారార్థం జీవితాన్ని ఖర్చుచేసి స్వార్థరాహిత్యానికి ఉపమానంగా నిలచిన త్యాగమయి పిన్ని...

వీరిని ఒక్కచోట చేర్చాలనే ఆకాంక్షతో బయలుదేరిన అతని మనసును ఆక్రమించుకున్న అద్వితీయ సౌందర్యరాశి...




అలాంటి సంధ్యతో అతని తొలి పరిచయమే ఓ పోట్లాటగా ముగిసింది. మరి అది ప్రేమగా పరిణమించేదెపుడు? ఎలా??

"సంధ్యా! మన జీవితాల గురించి నీకు తెలియని వాస్తవాలు కొన్ని వున్నాయి. ఈరోజు నీకా కథ చెబుతాను" అంటూ అతను వివరించిన ఆ గాథ ఏమిటి?

## పోటీబంద్ల విజయలక్ష్మి

కలంనుంచి ఆధునిక కుటుంబ వ్యవస్థ కథావస్తువుగా సాగిన ఆసక్తికరమైన రచన 'సంధ్య' ఈ నెల చతుర సమగ్ర నవల!

ముఖచిత్రం : అనీస్

2వ, 3వ కవర్లు: సూరజ్ ఎన్. శర్మ

# రచయితలకు ఆహ్వానం

వైవిధ్యంగల ఇతివృత్తాలతో, ఆసక్తికరమైన రచనా సంవిధానంగల నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. ప్రచురించే ప్రతి నవలకు రు.1500/-, అత్యుత్తమ నవలకు రు. 2000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే!

'చతుర'లో బొమ్మలు, ఇతర శీర్షికలుకాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్కన నవల వ్రాత ప్రతిలో మొత్తంమీద 26 వేల పదాలకు తక్కువ కాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో ఒక పేజీలో ఎన్ని పదాలు వచ్చాయనేదానినిబట్టి మొత్తం నవలలోని పదాలను సుమారుగా లెక్క చూసుకోవచ్చును. ప్రస్తుతం వివిధ మాస పత్రికలు ప్రచురిస్తున్న 112 పేజీల నవలలు 'చతుర'లో 70 పేజీలు మాత్రమే అవుతాయి.

* పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలించబడతాయి.
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరంలేనివారే నవలలను పంపించగలరు.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.

**చతుర**

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ — 500 004.

# పెద్దవయసు భార్యలు



హిందువుల సంస్కృతిపై మనుధర్మశాస్త్ర ప్రభావం ఇప్పటికీ వుంది. ఆ శాస్త్రం నిర్దేశించిన వివాహ సూత్రాలలో, భార్యకంటే భర్త మూడురెట్లు పెద్దవాడై వుండాలనేది ఒకటి! అంటే పెళ్లి కూతురికి పధ్నాలుగేళ్లయితే, పెళ్లికొడుకు 42 ఏళ్లవాడై వుండాలి.

ప్రపంచారోగ్య సంస్థ సేకరించిన లెక్కల ప్రకారం భారతదేశంలో సగటు వివాహ వయసు చాలా తక్కువ. వివాహ సమయానికి యువతుల వయసు సగటున 14-15 ఏళ్లుకాగా, యువకుల వయసు ఇరవై. ఆవిధంగా చూస్తే వారి వయసుల మధ్య ఆరేళ్ల తేడానే వుంటుంది.

పాశ్చాత్యులలో ప్రసిద్ధులైన ఎందరో తమకంటే ఎంతో తక్కువ వయసు యువతులను వివాహమాడారు. పికాసో, ఒనాసిస్, ఫ్రాంక్ సినాట్రాలు కూతుళ్లగా చూడవలసినంత తక్కువ వయసు యువతులను పెళ్లాడినవారే! అలాగే యువకుల్ని ప్రేమించి వివాహ మాడిన వృద్ధురాళ్లూ వున్నారు. రాజకీయ, మతసంబంధమైన కారణాలవల్ల ఇదివరలో అలాంటి పెళ్లిళ్లు జరిగేవి. లెక్కలేనంత మందిని పెళ్లాడి, అనేకమంది భార్యలను చంపించినవాడిగా పేరు పొందిన 8వ హెన్రీ మొదటి భార్య స్పెయిన్‌కి చెందిన కేథరిన్ అతనికంటే ఆరేళ్లు పెద్దది. ఇంగ్లాండ్ రాణి మేరీ, తనకంటే 11 ఏళ్ల చిన్నవాడైన రెండవ ఫిలిప్ (స్పెయిన్)ని పెళ్లాడింది.

షేక్స్‌పియర్ కంటే అతని భార్య

# వనితా ప్రపంచం

యాన్నె హాథావే ఏడేళ్లు పెద్దది. నెపోలియన్ తనకంటే ఆరేళ్లు పెద్దదైన జోసఫిన్‌ని గాఢంగా ప్రేమించాడు. ప్రముఖ ఆంగ్లకవి రాబర్ట్ బ్రౌనింగ్ ఆరేళ్ల పెద్దదైన ఎలిజబెత్ బారెట్ అనే వికలాంగురాల్ని ఎంతగానో ప్రేమించి, పెళ్లి చేసుకుని చాలా ఆనందంగా జీవితం గడిపాడు కూడా! ప్రసిద్ధ నృత్యకారిణి ఐసాడోరా డంకన్ తనకంటే 17 ఏళ్లు చిన్నవాడైన ఓ రష్యన్ కవిని ప్రేమించి పెళ్లి చేసుకుంది. లేడీ ఛాటర్లీస్ లవర్ నవలను రచించిన డి. హెచ్. లారెన్స్ తనకంటే ఆరేళ్లు పెద్దదైన ఫ్రెడాని ప్రేమించి వివాహమాడాడు.

## సైకిల్ ఛాంపియన్

**1982**లో బాంగ్‌కాంక్‌లో జరిగిన 'ఆసియన్ సైక్లింగ్ ఛాంపియన్‌షిప్' పోటీలో మద్రాసులో నివసిస్తున్న సుకుమారి అనే యువతి పాల్గొంది.

సైకిల్ పందాలలో పాల్గొనాలన్న ఆసక్తి ఎలా కలిగిందనే ప్రశ్నకు "మా బావగారైన సుకుమారన్ నాకు దీనిలో శిక్షణ ఇచ్చారు. సైకిల్ తొక్కే యువతులు తక్కువమంది వుంటారు కాబట్టి నేను ఈ రంగాన్ని ఎన్నుకున్నాను. గత 6 ఏళ్ళుగా సైకిల్ తొక్కడం ప్రాక్టీస్‌చేస్తున్నాను" అని చెబుతోంది ఆమె.

ఆమె సైకిల్ మిగతా సైకిళ్లకి భిన్నంగా కనబడటమేకాక బరువుకూడా చాలా తక్కువుంటుంది. సాధారణంగా సైకిళ్లు 12 కిలోగ్రాముల బరువుంటే సుకుమారి దగ్గిరున్న సైకిల్ నాలుగున్నర కిలోల బరువే. దాని విలువమాత్రం 16 వేల రూపాయలు. ఆ సైకిల్ పైన



ఒక్కొక్కటి 450 రూపాయలుంటుంది. అయితే ఈ సైకిల్‌కో సౌకర్యముంది. దీన్ని అతిత్వరగా వూడదీయడమే కాక రెండు నిమిషాల్లోనే తిరిగి అమర్చవచ్చు.

కాని సుకుమారి తన ప్రాక్టీసుకి ఈ సైకిల్‌ని ఉపయోగించదు. మన రోడ్లపై ఆ సైకిల్ తొక్కితే పంచరవు తుందని ఆమెకు భయం! ఎందుకంటే ఒకసారి పంచరైతే తిరిగి కొత్త ట్యూబు వేయాల్సిందే!

సుకుమారి ఉదయం నాలుగు గంట లకి నిద్ర లేవగానే బీచ్ దగ్గిర కాసేపు ప్రాక్టీస్‌చేసి, తర్వాత సైకిల్‌పై తాంబరం వరకూ వెళుతుంది. ఆమె రోజుకి 50 కిలోమీటర్ల దూరం సైకిల్ తొక్కు తుంది. 50 కిలోమీటర్లు సైకిల్ తొక్క డానికి ఆమెకు గంటా 35 క్షణాలు పడు తుంది. సైకిల్ పందాలలో అనేక మెలి కలు, మలుపులు తిరగవలసి రావడమే అంత వేగంగా సైకిల్ తొక్కడం ప్రాక్టీస్ చేయడానికి కారణమని చెబు తోందామె.

సుకుమారి జాతీయస్థాయిలో జరిగిన సైకిల్ పోటీలు పదిహేసింటిలో, ఆసియా స్థాయిలో 4 పోటీలలో పాల్గొంది. మొదట్లో ఒకటి రెండు పోటీలలో ఆమెకు ఓటమి సంభవించినా ఇపుడామె ప్రతి పోటీలోనూ ఏదో ఒక బహుమతిని గెలుచుకుంటోంది!

# జపాన్ పెళ్లి

భారతీయుల, జపానీయుల జీవన విధానం ఒకేలా వుండకపోయినా, వివాహం దగ్గరికొచ్చేసరికి మనకి, వాళ్ళకి మధ్య ఎంతో సారూప్యం కనబడుతుంది.





జపాన్ నగరాలలో వివాహం జరిగే హాళ్లు అనేకం వుంటాయి. ఆ హాళ్లకు జపాన్ యువతులకి మల్లేనే అతి చక్కని పేర్లుంటాయి. వివాహానికి నెలరోజులకి ముందే హాళ్లను బుక్ చేసుకోవలసి వుంటుంది. హాలు బాగా పెద్దదైతే అక్కడ ఒకేసారి నాలుగైదు వివాహాలు జరుగు తాయి.

పెళ్లి జరిగే హాలువాళ్లే, జపాన్ వధువు వివాహ సమయంలో ధరించే 'కిమోనా' అనే ఉడుపు దగ్గరనుంచి, కర్ణా భరణాలు, పువ్వులు, ఫొటోలు, విందు భోజనాలవరకూ బాధ్యత వహిస్తారు.

70 మందికి 3 గంటలపాటు ఆహారం సరఫరా చేసినందుకు హాలువాళ్లు 3 లక్షల యెన్నులు తీసుకుంటారు. ఆ మొత్తం మన 96 వేల రూపాయలకి సమానం! హాలులో ప్రవేశించేవారికి ఓ అందమైన యువతి కేకుముక్క తేలుతున్న 'షాంపేన్'మద్యం నింపిన గ్లాసు అందిస్తూ స్వాగతం చెబుతుంది.

జపాన్ వధువు వివాహ సమయంలో అయిదారుసార్లు దుస్తులు మార్చుకోవలసి వుంటుంది. అప్పుడామె ధరించే కిమోనా తళతళ మెరుస్తుంటుంది. వధువు అలా అన్నిసార్లు దుస్తులు మార్చుకోకుంటే, వివాహానికి హాజరైనవాళ్లు ఆ పెళ్లి తక్కువ ఖర్చుతో జరిగినట్లు అంచనా వేస్తారు.

అయితే జపాన్ యువతులు తెలివైన వాళ్లు. డబ్బు బాగా ఖర్చుపెట్టి క్రొత్త కిమోనా కొనడం వారికిష్టం వుండదు. అందుచేత వారిలో ఎక్కువమంది కిమోనానుఅద్దెకు తీసుకుని అవసరం గడిపే స్తారు.

జపాన్‌లో వివాహం జరిగేటప్పుడు, ఆ సమయమంతా ఓ హవాయన్ పాట

వాయించబడుతుంది. వధూవరులు ఓ టేబిల్‌పై నిలబడి పెళ్ళి చేసుకుంటారు. టేబిల్‌పై రెండు వెలుగుతున్న కొవ్వొత్తులను వుంచుతారు.

జపాన్‌లో హనీమూన్ ఏర్పాట్లను సైతం కొన్ని ఏజెన్సీలే చేపడతాయి. ఆ ఏజెన్సీలు డబ్బు దుబారా కాని విధంగా హనీమూన్ ఏర్పాట్లు చేస్తాయి. అక్కడ గ్రూప్ కన్సెషన్ల సౌకర్యం వుండటంతో హనీమూన్‌కి చాలామంది జంటలు కలిసి వెళతారు!

## తీర్పుల్లో మార్పులు

పాశ్చాత్యులు కొత్త కొత్త ప్రయోగాలు చేయడంలో సిద్ధహస్తులు! ఆఖరికి చట్టం లాంటి రంగంలో కూడా వాళ్ళు కొన్ని ఆసక్తికరమైన ప్రయోగాలు చేస్తున్నారు.

కొందరు జడ్జీలు తీర్పులు చెప్పేటప్పుడు చట్టానికి తమ విచక్షణా జ్ఞానాన్ని కూడా జోడించి చక్కటి తీర్పులిస్తున్నారు. ఇలా తీర్పులిచ్చే విధానం అమెరికాలో రోజురోజుకీ ఎక్కువవుతోంది.

ఇటీవల అమెరికా సంయుక్త రాష్ట్రాల లోని కొలంబియాలో తన తీర్పు ద్వారా ఓ జడ్జి ఆరోగ్యకరమైన ధోరణిని ప్రవేశ



పెట్టాడు. కొలంబియా ఫిలిమ్ కంపెనీకి యజమాని అయిన డేవిడ్ బిజాల్‌మన్ ఈమధ్య ఓ చెక్ విషయంలో మోసం చేసి పట్టుబడ్డాడు. అతనికి 5వేల డాలర్ల జరిమానా, 3 ఏళ్ళ జైలుశిక్ష విధించారు. కాని ఈ జైలుశిక్షను మళ్ళీ మార్చారు. దానికి బదులుగా అతన్ని మాదకద్రవ్యాల కలవాటు పడటం వల్ల కలిగే దుష్ఫలితాలను చిత్రించే నీతిదాయకమైన సినిమా తీయాలని ఆజ్ఞాపించారు. ఆ సినిమా మాదకద్రవ్యాల వల్ల టీనేజర్లు ఎలా నాశనమవుతున్నారో చూపాలిట!

డేవిడ్ బిజాల్‌మన్ ఈ శిక్షను సంతోషంగా ఒప్పుకుని, 'ఏంగిల్ డెత్' అనే సినిమా తీశాడు. చాలామంది అమెరికన్లు వాడే ఒక డ్రగ్ పిల్ పేరు 'ఏంగిల్ డస్ట్'. అక్కడ బాగా పేరు పొందిన ఈ పిల్ చాలా హానికరమైన ఫలితాలనిస్తుంది. ఆ పేరు స్ఫురించేలా తీసిన 'ఏంగిల్ డెత్' అలాంటి పిల్స్ వాడకం తీవ్రమైన ప్రమాదం కలిగిస్తుందని ప్రచారం చేసింది.

ఇది సాధారణమైన సినిమా ఏమీ కాదు. దీనిలో గొప్ప హాలీవుడ్ తారలైన పాల్‌న్యూమన్, జానీవుడ్‌వార్డ్‌లు కూడా నటించారు. పాల్‌న్యూమన్ ఓ బలమైన భావప్రేరణ వల్ల ఈ చిత్రంలో నటించాడు. అతని కుమారుడైన స్కాట్ న్యూమన్ 28 ఏళ్ళ యవ్వనంలోనే, 'ఏంగిల్ డస్ట్' పిల్స్ ఎక్కువగా తీసుకోవడం వల్ల మరణించాడు. పాల్ న్యూమన్ ఈ చిత్రంలో నటించినందుకు పారితోషికంగా ఒక పెన్నీ కూడా తీసుకోలేదు.

ఇజ్రాయిల్‌లో కూడా తీర్పులివ్వటంలో ఇలాంటి ప్రయోగాలు కొన్ని జరిగాయి. ఇటీవల 270 మంది నేరస్థులపై వెలువడిన ఓ తీర్పులో వాళ్ళంతా వారి వారి సామర్థ్యాన్ని బట్టి ప్రభుత్వ యాజమాన్యంలోని పరిశ్రమలలో పని చేయాలని న్యాయస్థానం ఆజ్ఞాపించింది. వారికి జైలు శిక్ష విధించడానికి బదులుగా ఈవిధమైన తీర్పు ఇచ్చారు.





## బిరుద పరంపర

ప్రపంచ వ్యాప్తంగా మదర్ థెరిస్సాను గురించి తెలియనివారు బహు అరుదు. ఆవిడ చేపట్టిన సేవా కార్యక్రమాలేగాక అందుకు బదులుగా అందుకున్న గౌరవ పురస్కారాల లిస్టు కూడా చాలా పెద్దదే.

మదర్ థెరిస్సా 1962లో భారత ప్రభుత్వం నుంచి 'పద్మశ్రీ' బిరుదూ, ఫిలిప్పైన్స్‌లో 'రామన్ మెగ్‌సేసే' బహుమతి అందుకుంది. 1971లో అమెరికా నుంచి 'గుడ్ సమారిటన్' బిరుదూ, 'జాన్ యఫ్. కెనెడీయానివర్సల్' బహుమతులూ లభించాయి. ఆ సంవత్సరంలోనే వాషింగ్‌టన్‌లో 'మోస్ట్ యూజ్‌ఫుల్ డాక్టర్' అనే బహుమతిని పొందిందావిడ. 1972లో మన దేశంలో జవహర్‌లాల్‌నెహ్రూ యూనివర్సల్ ఫ్రెండ్‌షిప్, ఇంగ్లండ్‌లో 'ది టెంపుల్‌టన్' ప్రైజులు లభించాయామెకు. 1978లో బ్రిటిషు రాణిచేత మదర్ థెరిస్సా 'ఆర్డర్ ఆఫ్ బ్రిటిష్ ఎంపైర్' అందుకుంది. ఆవిడ 1979లో ఇటలీలో ఇచ్చే పోల్సన్ యూనివర్సల్ ప్రైజు, స్వీడన్‌లో నోబుల్ బహుమతి కూడా పొందింది.

## విడుదల కాని స్టాంపు విలువ!

**1980లో** మాస్కోలో జరిగిన ఒలింపిక్ క్రీడలకి గుర్తుగా విడుదల చేసేందుకు పశ్చిమజర్మనీ ప్రభుత్వం 60 పెన్నింగుల స్టాంపునొకదాన్ని రూపొందించింది. కాని, అఫ్ఘనిస్తాన్‌లో రష్యా జోక్యాన్ని పశ్చిమజర్మనీ వ్యతిరేకిస్తూ, తన నిరసన తెలపడానికి ఒలింపిక్ క్రీడల్లో పాల్గొనలేదు. ఆవిధంగా స్టాంపు విడుదల చేయడం ఆగిపోయింది.

పశ్చిమజర్మనీ తంతితపాలా శాఖ మంత్రి అయిన కర్ట్‌జెస్టిల్ విడుదల కాని



స్టాంపు నమూనాను యథాలాపంగా తన టేబిల్ మీద ఉంచాడు. అతని భార్య ఆ స్టాంపు విడుదల కానిదని తెలియక ఓ కార్డుకు అంటించి పోస్టు చేసింది. ఆమె కార్డును హేంబర్గులో ఓ సంస్థ నిర్వహించిన పోటీకి పంపింది.

స్టాంపులు సేకరించే ఏజంట్ ఒకడు హేంబర్గులోని ఆ సంస్థకు వచ్చిన తపాలామీది స్టాంపులను విధిగా సేకరిస్తూ వుండేవాడు. అతను ఆ స్టాంపును చూడగానే దాని ప్రాముఖ్యతను గ్రహించాడు.

ఆ స్టాంపు వెనుక ఉన్న కథను వివరిస్తూ ఆ ఏజెంట్ వేలం నిర్వహించాడు. అక్కడివాళ్ళకి అలాంటి స్టాంపులను కొనడంపై విపరీతాకర్షణ వుంటుంది. ఆవిధంగా స్టాంపు వేలంలో దాదాపు 5 లక్షల 92 వేల రూపాయలకి అమ్ముడుపోయింది. ✱

మామిడి పండ్లలోని
మాధుర్యం ఇదే! ఇదే!!








సోమా మాంగో

సోమరస విహారం
ఎప్పుడైనా. ఎక్కడైనా.

గోవా, ఫ్రూట్ పంచ్
కూడా వున్నై.

మార్గదర్శి మార్కెటింగ్ ప్రైవేట్ లిమిటెడ్

ప్రస్తుతం హైద్రాబాద్, సికింద్రాబాద్‌లలోనే లభ్యం.

"రాధా... రాధా! తొందరగా రా" పెద్దగా కేకపెట్టాడు సాగర్.

"ఏవిటి? ఏం కొంపలంటుకున్నాయని అలా కేకలేస్తున్నావ్?" విసుగ్గా కాళ్ళు నేలకేసి బాదుతూ వచ్చింది రాధ, చిన్నన్నవైపు కోపంగా చూస్తూ.

"ఇలా కూర్చోమరి... చెబుతాను" అంటూ రాధ చేయిపట్టి లాగి కూర్చో బెట్టాడు సాగర్.

"మా ఫ్రెండ్ రాకేష్ దగ్గరి నుండి లెటర్ వచ్చింది. బొంబాయిలో వాళ్ళ మావగారి ఫాక్టరీలో ఏవో ఖాళీలున్నా యట. తను ముందుగానే చెప్పివుంచాడట వాళ్ళ మావగారికి. వెంటనే సర్టిఫికెట్లన్నీ పట్టుకొని నన్ను బయలుదేరి రమ్మ న్నాడు. ఇవాళ సాయంత్రమే నేను బయలుదేరి వెళ్ళాలి బొంబాయి"

ఉత్సాహంతో వెలిగిపోతున్న అన్న మొఖం వైపు సంతోషంగా చూస్తూ అంది రాధ.

"మరి ఇందాకటినుంచి చెప్పలేదే మన్నయ్యా? అయితే నీకు బొంబాయిలో పుద్యోగం వచ్చినట్లేనన్న మాట! మరి నాకేం తీసుకొస్తావ్ అక్కడి నుంచి?"

"పీచు మిఠాయి" అన్నాడు సాగర్ వెక్కిరింపుగా.

"ఛీ... ఫో అన్నయ్యా నువ్వెప్పుడూ యింతే"

"మరి ఎందుకే అంత తొందర నీకు! ముందు నాకు ఈ పుద్యోగం రానీ! ఆ తర్వాత నీకు ప్రజంటేషన్ తెచ్చే విషయం ఆలోచిస్తా...అన్నట్టు రాధీ! మా మంచి చెల్లివి కదూ! నా షర్టులు..."

"ఊ...! నాకు తెలుసులే. ఇప్పుడవి పుతికిపెట్టాలి. తప్పుతుందా. ఇలాంటి దేదో చెబుతావని అనుకుంటూనేవున్నాను. నేను వస్తూంటే శోభ అందికూడా-'మీ అన్నయ్య సరిగ్గా మనం కారమ్స్ ఆడే టప్పుడే పిలుస్తాడేమే! ఇక నువ్వు తిరిగి వచ్చినట్లే'అని. అది అన్నట్లే అయ్యింది. ఈ ఎండలో నీ బట్టలన్నీ పుతికేటప్పటికి నా పనైపోతుంది"

"అంతగా మీ ఫ్రెండ్ శోభకు ఏమీ తోచకపోతే నీకు సాయం చేయమను" అన్నాడు సాగర్ నవ్వుతూ.

"మరే! ఎందుకు చేయదూ! ఈ ఆఫీసర్‌గారి కోసం వూళ్ళోవాళ్ళంతా చాకలాళ్ళవుతారా? నాకంటే తప్పదు. దానికేం ఖర్మ నీ బట్టలు పుతకడానికి?" అంది రాధ చిరుకోపంగా అన్నవైపు చూస్తూ.

"ఛ...మీ శోభ ఎప్పుడూ అలా అను కోదే! నువ్వు కాబట్టి నా బట్టలు పుతకడం ఖర్మ అనుకుంటున్నావుగానీ తనైతే మహాభాగ్యంగా భావిస్తుంది. కావాలంటే అడిగి చూడు..."

మాట పూర్తి కాకముందే వాకిట్లో కనిపించిన శోభను చూసి తత్తరపడ్డాడు సాగర్.

పెదాలు బిగించి నవ్వునాపుకునే ప్రయత్నం చేసింది శోభ. వెనక్కు తిరిగిన రాధ గుమ్మం దగ్గర నిలబడ్డ శోభను చూసి విషయం అర్థంకావడంతో నవ్వుతూ లేచి, శోభతో పాటు లోపలి కెళ్ళింది బట్టలు తీసుకుని.

రాధా, శోభల స్నేహం స్కూల్ డేస్ నుంచీ వుంది. కాలేజీకి వెళ్ళిన తర్వాత అది మరింత గట్టిపడింది. ఎప్పుడూ ఇద్దరూ కలిసే తిరుగుతాపు. ఎటు వెళ్ళినా ఒకరికొకరు తోడుండా ల్సిందే! కాలేజీ లేని రోజుల్లో ఇద్దరూ కలిసి ఎవరో ఒకరి ఇంట్లోనే వుంటారు.





అన్నయ్యకు సడన్‌గా హైదరాబాద్‌కి ట్రాన్స్‌ఫర్ కావడంతో వదినను తీసుకొని హైదరాబాద్ వెళ్ళిపోయాడు. ఇంట్లో తనూ, రాధా, తండ్రీ మిగిలిపోయారు. రాధ ఇంటి పనుల్లో మునిగివుండే సాయం చేస్తూ ఎక్కువ కాలం ఇక్కడే గడుపుతోంది శోభ.

తన ఉద్యోగ ప్రయత్నాలింకా మొదట్లోనే వున్నాయి. డిగ్రీ పుచ్చుకొని ఏ పనీ లేకుండా ఇంట్లో కూర్చోడమంత దుర్భరం మరోటిలేదు. తన ప్రయత్నాలు తను చేస్తూనే వున్నాడు. కానీ ఒక్కటి కలిసిరావడం లేదు. రాకేష్ వాళ్ళ మావగారి ఫాక్టరీలోనైనా జాబ్ దొరికితే, ఈ వయసులో తండ్రి శ్రమపడి సంపాదిస్తుంటే తను కూర్చుని తినే బాధ తప్పుతుంది. ఆయన స్కూల్ మాష్టరుగా కుటుంబాన్ని నెట్టుకొస్తుంటే, ఆయనకు ఏవిధంగానూ సాయపడలేకపోతున్నాడు తాను.

అన్నయ్య హైదరాబాద్‌కు కావాలనే ట్రాన్స్‌ఫర్ చేయించుకున్నాడని తెలిసిన రోజున నాన్న ఎంతో బాధపడ్డారు. అయినా నవ్వుతూనే "క్షేమంగా వెళ్ళండి. అప్పుడప్పుడూ వీలుచూసుకుని వచ్చిపోతూండండి" అంటున్న ఆయన కళ్ళలో సుళ్ళు తిరిగిన నీళ్ళు చూసి తను అక్కడ నిలబడలేకపోయాడు.

జీవితంలో ఇంతవరకూ ఆయన ఏ సుఖసంతోషాలకూ నోచుకోలేదు. తమకింకా ఊహ తెలిసీ తెలియక ముందే అమ్మ చనిపోతే మరో పెళ్లి మాట ఎత్తకుండా తల్లీ తండ్రీ తనే అయి కంటికి రెప్పలా కాపాడి ప్రయోజకుల్ని చేశారాయన.

కానీ, ఏం ప్రయోజనం? ఒక్కళ్ళమూ ఆయన్ని సుఖపెట్టలేకపోతున్నాం. ఇంకా ఆయన రెక్కల కష్టం మీదే బతుకుతున్నాం అనేది సాగర్ బాధ.

ఏదియేమైనా తను మాత్రం అన్నయ్యలాగా వుద్యోగం దొరగ్గానే పెళ్లి చేసుకుని దూరంగా వెళ్లి స్వార్థపరుడు కాకూడదు. తనకు వుద్యోగం దొరగ్గానే ముందుగా నాన్నని వుద్యోగం మాన్పించాలి. ఇన్ని రోజులూ కష్టపడ్డారు. ఇక ముందైనా ఆయన్ని సుఖపెట్టాలి.

రాధకో మంచి సంబంధం చూసి పెళ్లి చేయాలి. అప్పటివరకూ తన పెళ్లిని గురించిన ఆలోచనే రాకూడదు. తనకి బొంబే వుద్యోగం దొరికితే కష్టాలు గట్టెక్కినట్లే.

భవిష్యత్ గురించి అలా కలలు కంటూ పడుకున్న సాగర్‌కి రాధ వచ్చి లేపేవరకూ మెలకువే రాలేదు. రాధ ఇచ్చిన టీ తాగి, లేచి స్నానం చేసి వెంటనే భోజనం కూడా కానిచ్చాడు. రాధ సాయంతో ఓ రెండు జతల బట్టలు ఇస్త్రీ చేసి అవీ, సర్టిఫికెట్లూ అన్నీ చిన్న సూట్‌కేస్‌లో సర్దాడు.

జగన్నాథరావుగారు స్కూలు నుంచి రాగానే సంగతి చెప్పి రాకేష్ ఉత్తరం చూపించాడు.

"అయితే ఈ రాత్రికే బయలుదేరాలి కదూ" అంటున్న తండ్రివైపు చూసి మౌనంగా తల వూపాడు సాగర్.

నెలాఖరు రోజుల్లో తనని బొంబాయి పంపించాలంటే, అది తండ్రికి ఎంత కష్టమైన పనో...కానీ తప్పదు. తనకి వుద్యోగమొస్తే ఇంక ఆయన్ని శ్రమ పెట్టాల్సిన అవసరం వుండదు.

విడిచిన చెప్పులు మళ్లీ తగిలించుకుని ఊళ్లోకి బయలుదేరుతున్న తండ్రివైపు

బాధగా చూశాడు సాగర్. అన్నయ్య మరీ అంత స్వార్థపరుడు కాకుండా తమకు ఏ కొంచం సాయంచేసినా తమ పరిస్థితి ఇంత అధ్వాన్నంగా వుండేది కాదు.

మరో అరగంటకు కొంత డబ్బు సాధించుకొచ్చి కొడుకు చేతుల్లో పెడుతూ "ఇంతకంటే ఎక్కువ దొరకలేదురా సాగర్" అంటున్న తండ్రివైపు నవ్వుతూ చూస్తూ-

"చాలునాన్నా! నాకక్కడ పెద్ద ఖర్చేముంది? ఒక్కరోజు కాకపోతే రెండు రోజులేగా వుండేది. సరాసరి వచ్చి తన ఇంట్లోనే దిగమని రాశాడు రాకేష్. కానీ వుద్యోగానికి వెళ్తూ వాళ్ళింట్లో దిగటం ఏం బావుంటుందని ఆలోచిస్తున్నాను. రాకేష్ వేరేవున్నా బాగుండేది. కానీ వాడూ మావగారింట్లోనే వుంటున్నాడింకా. ఆ... ఒక్కనైట్ ఎక్కడైనా గడిపేయవచ్చు. పగలంతా ఎలాగూ తిరుగుతూనే వుంటాను. ఇక నాకు రూమ్‌తో పనేముంది?" అంటున్న సాగర్‌వైపు చూసి చిన్నగా నవ్వారాయన.

"అన్నయ్యకు అన్నం పెట్టావామ్మా! ట్రైన్ టైము అవుతున్నట్లుంది" అన్నారు మాటదాటవేస్తూ.

"అన్నయ్య నాలుగన్నా కాకముందే హడావుడి పడి నన్ను కంగారు పెట్టేసి తినేశాడు నాన్నా! మళ్ళీ రాత్రికి ట్రైన్‌లో ఆకలవుతుందని కాసిని పూరీలు కూడా చేసి వుంచాను. అవి పొట్లం కట్టియిస్తాను" అంది రాధ.

"అయితే ఇంకేం! రేపు మధ్యాహ్నం వరకూ పైసా ఖర్చులేదన్నమాట. పూరీలుంటే నాకింకేం బాధ నాన్నా! మీరిచ్చిన ఈ డబ్బేయెక్కువ" అన్నాడు సాగర్.

"నిజానికి ఆ పూరీలు శోభ చేసింది. బొంబాయి నుంచి మాకేం తెస్తావో చూస్తానుగా" అంటున్న రాధ నెత్తిన చిన్నగా మొట్టిలేస్తూ "పేడు మిఠాయి తెచ్చిపెడతానన్నానుగా" అని నవ్వేడు.

"నాన్నా...మరి నేను బయలుదేరుతాను" అన్నాడు సాగర్ కాసేపాగి.

"అలాగే బాబూ! క్షేమంగా వెళ్ళి లాభంగారా" అంటూ లేచిన జగన్నాథ రావుగారి పాదాలకు నమస్కరించి సూట్‌కేస్ అందుకున్నాడు.

ఈలోపు రాధ లోనికెళ్ళి ప్లాస్టిక్ సంచిలో పూరీల పాకెట్ పెట్టి తీసుకొచ్చింది.

"వస్తానమ్మా!" అంటూ రాధ తల మీద చేయివేసి నిమిరి సూట్‌కేసందుకొని ముందుకు వెళ్తున్న సాగర్ వైపు చూస్తూ నుంచున్నారు తండ్రీ, కూతుళ్ళిద్దరూ.

ఈసారైనా అన్నయ్యకు ఉద్యోగం వస్తే బావుండును. ప్రతిసారీ బోలెడు డబ్బు ఖర్చుపెట్టి ఇంటర్వ్యూలకు వెళ్ళడం, నిరాశగా తిరిగి రావడం... ఈమధ్య కొన్నింటికి వెళ్ళడం కూడా మానేశాడన్నయ్య. ఆమధ్య రాకేష్ వచ్చినప్పుడు సాగర్‌కింకా ఉద్యోగం దొరకలేదని విని, "అవకాశమొస్తే నేను రాస్తానురా... తప్పకుండారా" అని మరీ మరీ చెప్పి వెళ్ళాడు.

ఇంటర్వ్యూలకు వందల మందిని పిలుస్తారు. ఎక్కడెక్కడి నుంచో ఎన్నో అవస్థలు పడి, అప్పులుచేసి హాజరవుతారు నిరుద్యోగులు కొండంత ఆశతో. కానీ అక్కడ అసలు కాండిడేట్స్ ఎన్నిక ముందే జరిగిపోయి వుంటుంది. ఆ సీట్లు వారికెప్పుడో రిజర్వయ్యే వుంటాయి.

ఆ విషయంలో సంపత్ అన్నయ్య

అదృష్టవంతుడు. డిగ్రీ పూర్తవుతూనే వదిన నాన్నగారు పలుకుబడి వుపయోగించి ఉద్యోగం ఇప్పించారు. అందులోని ఆయన స్వార్థం అర్థమయినా ఎవ్వరికీ కష్టమనిపించలేదు. సుభద్రంటే సంపత్ అన్నయ్యకు ఇష్టమే కావడంవల్ల తమ కెవ్వరికీ అభ్యంతరం లేకపోయింది- సుభద్రని ఆ ఇంటి కోడలుగా చేసుకోవడానికి. కానీ ఆ తర్వాత అన్నయ్య పూర్తిగా మారిపోవడమే తమకు బాధ కలిగించింది. తండ్రి మాత్రం మనసులో బాధపడ్డా ఎప్పుడూ బయటపడలేదు.

"పోన్లేమ్మా! వాడికి హైదరాబాద్ ట్రాన్స్ఫర్ కావడం మంచిదేఅయింది. అక్కడైతే వాళ్ళ మావగారి అండదండలుంటాయి. సుభద్రకు కూడా పుట్టింటికి దగ్గరగా ఉన్నాననే తృప్తి వుంటుంది" అంటూ ఓదార్చేవారు.

రాధఅలా ఆలోచిస్తూ ఉండే జగన్నాథరావుగారి ఆలోచనలు గతంలో ఉన్నాయి. ఆయనకు తన కాలేజీ రోజులు గుర్తుకి వస్తున్నాయి.



మరో నాలుగు రోజుల్లో కాలేజీలో డిగ్రీ ఫైనలియర్ స్టూడెంట్సంతా కలిసి బొంబాయి ఎక్స్‌కర్షన్‌కు బయలుదేరబోతున్నారట. ఆరోజు క్లాసులో బయలుదేరేవాళ్ళ పేర్లు ఇవ్వమని ప్రొఫెసర్ అడిగినప్పుడు తన పేరుతో పాటు జగన్నాథరావు పేరు కూడా ఇచ్చినట్లు చెప్పాడు సూర్యం.

బొంబే వెళ్ళాలని ఎన్నాళ్ళుగానో కోరిక వుంది జగన్నాథరావుకు. మొదటి నుంచీ కొత్త కొత్త ప్రదేశాలు చూడాలంటే ఎంతో ఇష్టం. కానీ ఇన్నాళ్లూ స్టడీస్‌లోపడి తన కోరికను బలవంతంగా అణుచుకుంటూ వచ్చాడు.

"మంచి పని చేశావు. ఎవరెవరొస్తున్నారు?" ప్రశ్నించాడు జగన్నాథరావు.

"ఆహా! మన బాచ్ అంతా వస్తున్నారు. గర్ల్స్‌లో సోడాబుడ్డి కళ్ళద్దాల కమలి, బోయస్‌లో రేసులరావు తప్ప మిగిలినవాళ్ళంతా వస్తున్నారు. బహుశా ఆ కమలి, రావులు సపరేట్‌గా మరింకెక్కడికైనా వెళతారేమో మనకు తెలియదు గురూ!"

ప్రొఫెసర్స్ కూడా ఓ ఆరుగురు వస్తున్నారు అంటూ వివరాలు చెప్పాడు రూమ్‌మేట్ సూర్యం.

అనుకున్న రోజుకు అంతా బొంబాయి ప్రయాణమయ్యారు. ప్రొఫెసర్స్ ఆరుగురూ కుర్రకారే. వాళ్ళూ స్టూడెంట్స్‌తో పాటు అల్లరికి సిద్ధం కావడంతో ప్రయాణం చాలా సరదాగా సాగింది.

ఆడపిల్లలకు తోడుగా జువాలజీ మేడమ్ లలిత వచ్చారు. ఆడపిల్లలు మొత్తం అయిదుగురే అయినా అంతా కలసి ప్రయాణం చేయడంలో థ్రిల్ ఫీలయ్యారు. చాలాసంతోషంగా వున్నారు వాళ్ళంతా కూడా.

దాదర్ అయితే ఆంధ్ర మహాసభకు వెళ్ళడానికి అనుకూలంగా వుంటుందని





అంతా అక్కడే దిగారు. వసతికోసం ముందుగానే రాసివుండటంవల్ల, వెళ్ళగానే బస ఏర్పాటయ్యింది. లేడీస్‌కు ఓ చిన్న రూమ్; జంట్స్ అందరికీ ఓ పెద్ద రూమ్ ఇచ్చారు.

అందరికంటే ముందే స్నానాలు పూర్తిచేసి రెడీ అయిన జగన్నాథ్, సూర్యం మహాసభ స్టేజిమీద కూర్చుని మాట్లాడుకుంటున్నారు.

"విశాలంగా కట్టిన ఈ స్టేజి చూస్తుంటే ఏదేనా ప్రోగ్రాం వెయ్యాలని పిస్తోంది జగన్నాథ్"

"నీకి నాటకాలపిచ్చి పోదురా సూరీ! నువ్వన్నట్లు స్టేజీ చాలా బావుంది.ఎంతైనా పర్మనెంట్ స్టేజీ కనుక ఇలా కట్టారు. అటూ ఇటూ మేకప్ రూములు కాబోలు" అంటూ వెనక్కి తిరిగి చూస్తే వచ్చిన పూజారిగారు కనుపించారు.

"స్వామివారి దర్శనం చేసుకోండి బాబూ!" అన్నారాయన.

ముఖాలు చూసుకున్న సూర్యం, జగన్నాథ్ లేచి ఆయన్ని అనుసరించి రూమ్ పక్కనే వున్న వేంకటేశ్వర ఆలయంలో అడుగుపెట్టారు. పూజారి గారు ఏవో మంత్రాలు చదువుతూ పూజ కానిచ్చి తీర్థ ప్రసాదాలిచ్చారు. వాళ్ళతో పాటు లోపలికొచ్చిన మరికొందరు స్టూడెంట్స్ కూడా స్వామివారికి నమస్కరించి, తోచిన కానుకలు వేసి బయటకు వచ్చి కూర్చున్నారు.

"ఫర్వాలేదు.మనవాళ్ళింకా మారలేదు. దైవభక్తి మిగిలే వుందన్నమాట" అంటున్న గోపాలరావుగారి మాటలకు చిన్నగా నవ్వివూరుకున్నారు స్టూడెంట్స్.

అక్కడే నుంచుని ప్రొఫెసర్ గోపాల రావుగారు, రామారావుగారు వెళ్ళవలసిన ప్రదేశాల లిస్ట్ చూసుకుంటూ ముందుగా ఎటు వెళ్ళాలో ఏమిటో ప్లాన్ వేస్తున్నారు.

ఇంతలో హడావుడిగా అక్కడికి వచ్చింది మాలతి.

"సర్! నేనొక్కసారి మా వాళ్ల ఇంటికి వెళ్ళి వస్తాను" అంది-గోపాల రావుగారి వైపు నమ్రతగా చూస్తూ.

"వాట్! మీవాళ్ళింటికి వెళ్తావా? ఎవరు వాళ్ళు? ఎక్కడ వున్నారు? ఒంటరిగా నువ్వు వెళ్ళి ఈ బొంబాయి మహానగరంలో తిరిగి రాగలవనే? ఎంత ధైర్యం నీకు? నో... నేను పంపించలేను. రూల్స్ ఒప్పుకోవు" అన్నారు గోపాల రావుగారు స్ట్రిక్ట్‌గా.

"నేనింతక్రితం చాలాసార్లు బొంబాయి వచ్చాను సార్! ఇక్కడికి చాలా దగ్గర్లోనే మా బాబాయిగారున్నారు. కింగ్ సర్కిల్ దగ్గర. జస్ట్... వాకింగ్ డిస్టెన్స్ సర్" చాలా ధైర్యంగా, అంతకంటే నమ్మకంగా చెప్పింది మాలతి

"నో... ఏమైనా ఇప్పుడందరం కలసి బయలుదేరుతున్నాం. గెట్ రెడీ! అంతగా కావాలంటే సాయంత్రం ఎవరి నైనా తోడిచ్చి పంపుతాను. నౌ యు గో అండ్ గెట్ రెడీ... క్విక్!" అంటూ మరో మాటకు అవకాశం ఇవ్వలేదు గోపాల రావుగారు.

అక్కడే నుంచుని తమ మాటలన్నీ వింటూ తననే చూస్తున్న జగన్నాథ్, సూర్యాల వైపు చురుక్కుమనేలా చూసి, విసురుగా వెళ్ళిపోయింది మాలతి.

ఆ విసురు చూసి జగన్నాథ్, సూర్యం నవ్వుకున్నారు.

మాలతి క్లాసులో చాలా తెలివైన అమ్మాయే కాకుండా అల్లరిలో కూడా ఓ పాలు ఎక్కువే. మగపిల్లలెవరికీ భయ



పడదు సరికదా వాళ్ళకే నిక్‌నేమ్స్ పెట్టి ఆనందిస్తుంది. వాళ్ళు తనకు ఏవైనా పేర్లు పెట్టినా స్పోర్టివ్‌గా తీసుకుని నవ్వ గల ధైర్యముంది. అంతా కలసి ఆమె కిచ్చిన ముద్దు పేరు "సీమ మిరపకాయ". కోపం ముక్కు మీదే వుంటుంది. ఎవ్వర్నీ లెఖ్ఖచేయదు.

ఈ ట్రిప్ తను ఫ్రండ్స్ అందరితో కలిసి ఎంజాయ్ చేయాలని వచ్చింది. నిజానికి తను చూడవలసిందేమీ మిగిలి లేదు బొంబాయిలో. తను సంవత్సరానికి ఓసారయినా వస్తుంది బొంబాయి.

అలవాటు ప్రకారం దాదర్‌లో అడుగు పెట్టగానే పార్వతక్కయ్య జ్ఞాపకం వచ్చింది. ఇంత దూరం వచ్చి దాన్ని చూడకుండా ఎలా వెళ్ళడం? పోనీ సాయంత్రం పంపిస్తానన్నారుగా. ఒక వేళ మాష్టారు పంపకపోతే చప్పుడు కాకుండా మెల్లగా జారుకుని తనే సాయంత్రం ఓ రౌండు వెళ్ళివస్తే సరి– అని మనసులోనే దృఢనిశ్చయం చేసుకుంది మాలతి.

ఈలోపు వాన్ మాట్లాడుకొచ్చారు. అందరూ ఎక్కికూర్చున్నారు. ముందుగా మహాలక్ష్మి టెంపుల్‌కి వెళ్ళాలను కున్నారు.

వాన్ సిటీలో నుంచివెళ్తుంటే ఆరోడ్లూ, బిల్డింగ్‌లూ చూస్తూ ఎవరికి తోచిన తీరుగా వాళ్ళు కామెంట్స్ చేస్తూ మహా లక్ష్మి మందిరం చేరుకొని దేవీ దర్శనం చేసుకొని, అక్కడికి దగ్గరలోనే వున్న హాజీఆలీ దర్గాకు వెళ్ళారు.

సముద్రం మధ్యగా చీలి దారి చూపి స్తున్నట్లున్న ఆ రోడ్డు మీదుగా సరాసరి దర్గాలోకి వెళ్ళారు.

అటూ ఇటూ నీళ్ళు, మధ్యలో రోడ్డు. సముద్రం మధ్యలో తెల్లగా మెరిసి పోతున్న దర్గాను చుట్టివున్న నల్లటి బండ రాళ్ళు ఆ దర్గాకు ప్రకృతి ఏర్పరచిన కోటలా వుంది. మూడు పక్కలా అనంతమైన జలరాశి. మహాలక్ష్మి గుడికి కూడా మూడు వైపులా నీళ్ళుంటాయి.



కానీ అవి అన్ని వేళలా నిండుగా వుండవు.

మహాలక్ష్మి మందిరంలో నుంచుని చూస్తుంటే హాలీ ఆజీ దర్గా అందంగా కనిపిస్తుంది.

ఆరు దాటిన తర్వాత ఆ దర్గాలోకి ఎవ్వరూ వెళ్ళలేరట. సముద్రుడు ఆ దారిని మూసివేస్తాడట! అది అల్లా మహిమ అని అక్కడి ముస్లింల నమ్మకం. అందుకే అయిదు తర్వాత అక్కడ వుండా లనుకోరెవరూ.

ఆ విషయాలు శ్రద్ధగా చెబుతున్న సూర్యంవైపు చూస్తూ మాలతి చిన్నగా నవ్వుతూ—

"మరి అలా నీళ్ళు సాయంత్రమయ్యే సరికి దారి మూసివేయడం, మళ్లీ పొద్దుటే దారి కనిపించడం...అంతా అల్లా మహిమే నని మీరూ నమ్ముతున్నారా?" అంది.

సమాధానం జగన్నాథ్ దగ్గరి నుంచి వచ్చింది.

"'నేను నమ్ముతున్నాను, మీరూ అదే నమ్మండి' అని వాడు చెప్పడం లేదు. ఇక్కడివారు చెప్పే కథ ఇది! రాత్రి పూట ఆటుపోటుల వల్ల సముద్రంలో ఆ మార్పులు రావొచ్చు. దాన్ని మీ నమ్మకాన్ని బట్టి మీరు అన్వయించుకోండి"

మాలతి ప్రశంసాపూర్వకంగా జగన్నాథ్ వైపుచూసి మౌనం దాల్చింది.

అందరూ మళ్ళీ వాన్ ఎక్కి హాంగింగ్ గార్డెన్స్‌కు వెళ్ళారు. అక్కడ చెట్ల పేర్లన్నీ అడుగుతూ బోటనీ మేడమ్ ప్రాణాలు తీశారు వాళ్లు. అక్కడి నుంచి గేట్‌వే ఆఫ్ ఇండియా, మెరిన్ డ్రైవ్ చూసి, ఏదో తిన్నామనిపించి, మళ్లీ పూరు మీద పడ్డారు. నాలుగ్గంటలకు జుహూ బీచ్‌కు చేరారు.

ఫారెనర్స్ సముద్రంలో ఈత కొట్టినంతసేపూ కొట్టి మళ్లీ హోటలువాని స్విమ్మింగ్‌పూల్‌లో విసుగు లేకుండా ఈత కొడుతుండే వాళ్ళ విన్యాసాలన్నీ చూస్తూ ఆనందించారు. ఆ నీళ్ళలో వాళ్ళ కదలికలు చూస్తుంటే ఎంత సేపయినా విసుగనిపించలేదు.

క్లాసులో ఒకటి రెండుసార్లు మాట్లాడినా జగన్నాథ్‌తో పెద్దగా పరిచయం లేదు మాలతికి.కానీ ఈ ట్రిప్పుతో సాయంత్రం లోపల ఇద్దరూ మంచి ఫ్రెండ్స్ అయ్యారు. మొదటి నుంచీ జగన్నాథ్ అంటే ఓ రకమైన ఆకర్షణ వుంది మాలతికి. మిగతా మగపిల్లల్లా వెకిలి వేషాలు లేవు అతని దగ్గర. స్ట్రెయిట్ ఫార్వర్డ్. అలాగని మరీ మమ్మీకాదు. సెన్సాఫ్ హ్యూమవుంది. సందర్భాన్నిబట్టి మాట్లాడుతూ అందర్నీ ఆకర్షించగల నేర్పుంది. అందర్నీ నవ్విస్తూ నవ్వగలడు. కానీ, తన ఆధిక్యత నలుగురిలో చాటుకోవాలని మాత్రం ప్రయత్నించడు.

కాలేజీలో ఏ ఫంక్షన్ జరిగినా అన్నింటా తను ముందుండి శ్రమపడతాడు. ఫంక్షన్స్ జయప్రదం చేసేవరకూ నిదురపోడు. ఆరకంగా ప్రిన్సిపాల్ గారికి ప్రియశిష్యుడు, విద్యార్థులకు, ఉపాధ్యాయులకు మధ్య వారధిలాంటివాడు. అలాంటి జగన్నాథంటే ఇష్టపడనివాళ్ళెవరు? అమ్మాయిలకు అతను ఆరాధనీయుడు కూడా!

అయితే స్టూడెంట్స్ ఎంత బలిమాలినా, మాష్టర్స్ నచ్చజెప్పినా స్టూడెంట్స్ యూనియన్ ప్రెసిడెంట్‌గా పోటీ చేయడానికి మాత్రం ఒప్పుకోలేదు ఎప్పుడూ.

"పదవీ వ్యామోహంలో పడితే పనులు సక్రమంగా చేయలేము బ్రదర్స్! నన్నిలాగే వుండనివ్వండి" అనేవాడు.

ఆ సంవత్సరం చురుకుగా, తెలివిగా వుండే మాలతిని ప్రపోజ్ చేశాడు జగన్నాథ్. అంతా అతని ప్రపోజల్‌ను బలపరిచారు. మాలతి ప్రెసిడెంట్ కావడం ఖాయం అనుకున్నారంతా.

కానీ ఆఖరి నిముషంలో మాలతి తను నిలబడటంలేదని చెప్పి విరమించుకోవడంతో జగన్నాథ్ చాలా బాధపడ్డాడు. ఆఖరికి ఫ్రెండ్సంతా బలవంతపెట్టి ఆ సంవత్సరం వాళ్ళ కాలేజీ ప్రెసిడెంట్‌గా జగన్నాథ్‌నే ఎన్నుకున్నారు.మరొకళ్ళను ప్రపోజ్‌చేసే టైమ్ కూడా లేకపోవడం, లాస్ట్ మూమెంట్‌లో మాలతి అలా తప్పుకోవడంతో ప్రెసిడెంట్‌కాక తప్పలేదు జగన్నాథ్‌కు.

ఆరోజును ఆ కాలేజీలో పండుగలా జరుపుకున్నారు. నవ్వుతూ పూలదండ తీసుకొచ్చి తనకిస్తున్న మాలతిని చూస్తే





ఆమె కావాలనే ఆఖరి నిముషంలో అలా తప్పుకుందేమో అన్న అనుమానం వచ్చింది జగన్నాథ్‌కు. ప్రెసిడెంట్‌గా తనని చూడాలనే ఆమె అభీష్టం అలా నెరవేర్చుకుంది సింపుల్‌గా. ఆ రకంగా జగన్నాథ్‌కు తెలియకుండానే అతని మనసులో కొంతస్థానాన్ని సంపాదించుకో గలిగింది. మాలతి పట్ల హృదయంలో అతి సున్నితమైన స్పందన బయలు దేరింది. అది అభిమానమో, ఆరాధనో మరేభావమో స్పష్టంగా నిర్ణయించుకోలే దింకా. కానీ ఈ బొంబాయి ప్రయాణం ఇద్దర్నీ మరికొంత సన్నిహితుల్ని చేసింది.

ఆ సాయంత్రం బసకు చేరుకోగానే జగన్నాథ్‌ను తోడు తీసుకుని జాగ్రత్తగా వెళ్ళిరమ్మని మాష్టారు మాలతితో చెప్పి నపుడు సంతోషంగా అంగీకరించింది మాలతి.

"మాలతిని జాగ్రత్తగా తీసుకెళ్ళి జాగ్రత్తగా తీసుకురావాలి సుమా! వాళ్ళ బంధువులెవరో ఇక్కడికి దగ్గరలోనే వున్నారట" అంటున్న ప్రొఫెసర్ మాట లకు నవ్వుతూ తల వూపాడు జగన్నాథ్!

మాతుంగా మార్కెట్ మీదుగా ఇద్దరూ మాలతీ వాళ్ళ బాబాయిగారింటికి చేరుకున్నారు. అనుకోకుండా వచ్చిన చెల్లెల్ని చూసి అమితానంద పడి పోయింది పార్వతి. వాళ్ళ బాబాయి సరే సరి. పొద్దుటి నుంచీ ఫోనైనా చేయకుండా ఎలావున్నావని గొడవ పెట్టారు. ఆ తర్వాత జగన్నాథ్‌తో కబుర్లలో పడి అతని గురించి వివరాలు సేకరించడంలో మునిగిపోయారు. ఓ గంట గడిచిన తర్వాత జగన్నాథ్ మాలతివైపుచూసి.

"మరి ఇంక వెళదామా?" అన్నాడు.

"ఎక్కడికి అప్పుడే! భోంచేసి వెళ్ళండి" అంటున్న పార్వతి వైపు ఇబ్బందిగా చూస్తూ—

"ఇప్పటికే ఆలస్యమైంది. బసలో అంతా మాకోసం ఎదురుచూస్తూంటారు. రాగానే టిఫిన్ చేసి కాఫీ తాగాంగదా! మళ్లీ భోజనమంటే ఎలా ?" అన్నాడు జగన్నాథ్.

"మరేం ఫర్వాలేదు. కొద్దికొద్దిగా తినేసి వెళ్ళండి. మళ్ళీ ఆ హోటల్ మీల్స్ ఏం చేస్తారు! ఇవ్వాళ హోటల్లో రైస్ దొరకదు కూడా. ఈ ఊళ్లో హోటల్స్‌లో వారానికి మూడురోజులు రైస్ దొరకడం గగనం. అదీ మాతుంగాలో అయితేనే అమృతమైనా దొరుకుతుంది. పార్వతీ... వెళ్ళమ్మా! ఆలస్యమవుతుంది .... వెళ్ళి వడ్డించు" అంటున్న మాలతి బాబాయి మాటలకు ఎదురుచెప్పలేక మాట్లాడకుండా కూర్చున్నాడు జగన్నాథ్ !

ముక్కూ మొహం తెలియనివాళ్ళింట్లో భోంచేయాలంటే ఇబ్బందిగా వుంది జగన్నాథ్‌కు.కానీ మాలతితో రావడం వల్ల మౌనం దాల్చాల్సి వచ్చింది.

జగన్నాథ్ పరిస్థితి గమనించినమాలతి చిన్నగా నవ్వుతూ – "మనవాళ్ళంతా ఈపాటికి మీల్స్‌కు వెళ్లేవుంటారు. నేను మాష్టారితోచెప్పేవచ్చాను, మనం భోంచేసి వస్తామని. మీరేం కంగారుపడకండి" అంటూ లేచి పార్వతితోపాటు లోపలికి వెళ్ళిపోయింది.

పార్వతి కొసరికొసరి వడ్డిస్తోంటే చక్కటి తెలుగు భోజనం ఆత్మీయుల మధ్య చేసిన అనుభూతి కలిగింది జగన్నాథ్‌కు. పరాయివాడయినా తనపై వారుచూపే అభిమానం,ఆదరణ మనసును ఆర్ద్రం చేసింది. భోంచేసి కొంచెంసేపు



కూర్చుని మాలతి బాబాయ్ పార్వతి, తోడురాగా తమ బసకేసి నడక సాగించారు.

దారిలో రమణరావుగారు "రేపు సాయంత్రం షణ్ముఖానందా హాల్లో మంచి తెలుగు ప్రోగ్రాం వుందోయ్! మీ ఇద్దరూ తప్పక రావాలి. టిక్కెట్స్ తీసి వుంచుతాను" అంటే వుత్సాహపడింది మాలతి.



"తప్పకుండా వస్తాం బాబాయ్! ఇంక మీరు వెళ్లండి. ఇప్పటికే చాలాదూరం వచ్చేశారు" అంది. పార్వతి, రమణరావు గారూ సెలవుతీసుకుని తప్పకుండా రమ్మని మరోసారి చెప్పి వెనక్కు తిరిగారు.

మాలతి, జగన్నాథ్ మహాసభ వేపు నడకసాగించారు. మౌనంగా నడుస్తున్న జగన్నాథ్ వేపు చిరునవ్వుతో చూస్తూ అంది మాలతి-

"ఈరోజు మిమ్మల్ని చాలా ఇబ్బంది పెట్టాను కదూ? అయామ్ సారీ జగన్నాథ్!మనం భోంచేయకుండా వస్తే మా అక్క నిదురపోదివాళ. ఆ విషయం తెలుసు కనుకే మాష్టారికి చెప్పే వచ్చాను-మనకోసం ఎదురుచూడవద్దని" అంటున్న మాలతి వేపు చూసి చిన్నగా నవ్వుతూ అన్నాడు జగన్నాథ్-

"నిజానికి నేనే మీకు థాంక్స్‌చెప్పాలి ఈ బొంబాయిలో ఇంత చక్కటి తెలుగు భోజనం తినిపించినందుకు. మధ్యాహ్నం ఆ హోటల్లో మనం తిన్న గడ్డి చూశాకగానీ అసలు భోజనం విలువతెలిసి రాలేదు. అమృతంలాంటి భోజనం తినిపించి సారీ చెబుతారేం...భలేవారే!"

"అమ్మయ్య... బతికించారు. మీకు ముందే చెప్పకుండా భోజనానికి వుంచేసినందుకు ఎంత కోపం తెచ్చుకున్నారోనని భయపడి ఛస్తున్నాను. ఓ బెంగ తీర్చారు. మరి రేపు సాయంత్రం ప్రోగ్రాంకి రావడం ఖాయమేగా?" అంది మాలతి ఉత్సాహంగా.

"మాష్టారుపర్మిషన్ ఇస్తే!" అంటున్న జగన్నాథ్‌వైపుచూసి కొంటెగానవ్వుతూ-

"ప్రెసిడెంట్‌గారు అడగాలేకాని మాష్టారు కాదనడం ఎప్పుడూ వుండదు" అని గబగబా అడుగులేసి జగన్నాథ్‌తో పాటు నడవడానికి ప్రయత్నించింది.

రెండోరోజు చూడవలసిన ప్రదేశాలన్నీ చూసిన తర్వాత సాయంత్రం ఏదైనా ఓ స్టూడియో చూసి ఆతర్వాత పిక్చర్‌కు వెళ్ళాలని అంతా ప్రోగ్రాం వేసుకున్నారు.

"స్టూడియో చూడాలంటే పర్మిషన్ కావాలి. ఇంతమంది స్టూడెంట్స్‌ను ఎవరు ఎలా చేస్తారు?" అంటున్న గోపాలరావుగారి వైపు నవ్వుతూ చూస్తూ అంది మాలతి-

"మాష్టారూ... మీకాభయం అక్కర్లేదు. పర్మిషన్ కావాలంటే మా బాబాయి

నడిగి పట్టుకొస్తాను. ఆయనకు దాదాపు ఈ ఫీల్డ్‌లో అంతా పరిచయస్తులే"

మాలతి వైపు కృతజ్ఞతగా చూశారు మిగతా స్టూడెంట్సంతా.

తాను నీతూసింగ్‌లా వుంటానను కుంటూ అద్దమైన డ్రస్సులూ వేసుకునే సుధ ఒక్కసారిగా ఎగిరి గంతేసి, సినిమాలో ఛాన్సువచ్చినట్లే వూహించి కలలు కనసాగింది.

"ఊ! అయితే జగన్నాథ్‌ను తీసు కెళ్ళి ఆ పర్మిషన్ లెటర్ ఏదో సాధించి అతనికిచ్చి పంపించు. నువ్వు ఈ రాత్రికి మీ బాబాయిగారింట్లో వుంటాలను కున్నావుగా" అంటున్న మాష్టారి వైపు ఇబ్బందిగా చూస్తూ అంది మాలతి–

"మాతో మరెవరినైనా పంపండి మాష్టారూ! మా అంకుల్ ఈరోజు జగన్నాథ్‌ను తమతో ఓ ప్రోగ్రాంకు తీసు కెళతామన్నారు. టిక్కెట్స్ కూడా తీసు కొని వుంటారీపాటికి. అతను తిరిగి వచ్చే సరికి ఆలస్యం అవుతుంది. మరి అప్పుడు స్టూడియో ఏం చూస్తాం?"

"మీ ప్రోగ్రాం విషయం జగన్ నాకు ముందే చెప్పాడులే...వెళ్ళిరండి. సూర్యం! నువ్వూ వాళ్ళతో వెళ్ళు. పర్మిషన్ లెటర్ తీసుకుని మహాసభకు వచ్చేయ్" అన్నారు మాష్టారు.

తన ఫ్రెండ్ స్వప్నను కూడా తీసు కెళ్ళాలని మనసులో ఎంత కోరికవున్నా మాష్టారినడిగి లేదనిపించుకోవడం తప్ప ప్రయోజనం వుండదని స్వప్న వారించ డంతో ఊరుకుంది మాలతి. సూర్యం, జగన్నాథ్‌లతో బయలుదేరింది.

ముగ్గురూ రమణరావుగారింటికి చేరు కునేసరికి ఆయన వాళ్ళకోసమే ఎదురు చూస్తూ కూర్చుని వున్నారు.

"ఏమిటోయ్... ఇంతాలస్యంచేశారు? ఇంకా నేనే బయలుదేరుదామనుకుంటు న్నాను" అన్నారు చిన్నగా నవ్వుతూ.

మాలతి స్టూడియో చూడటానికి పర్మిషన్ కావాలని చెప్పింది. వెంటనే ఆయన ఎవరికో ఫోన్‌చేశారు. కొంచం సేపు ఫోన్‌లో మాట్లాడి సూర్యం వైపు తిరిగి–

"మిష్టర్ సూర్యం! రాజకమల్ స్టూడియోలో ఏవో షూటింగ్సు వున్నా యట. స్టూడియో అంత పెద్దదేంకాదుగానీ ఆర్టిస్టులు చాలా మంది ఈ రోజు షూటింగ్‌లో వున్నారట. అక్కడ స్టూడియో ఇన్‌చార్జి మిష్టర్ సత్యన్‌కి నా లెటర్ ఇవ్వండి. ఆయనే దగ్గరుండి అన్నీ చూపిస్తాడు" అంటున్న రమణ మూర్తిగారివైపు కృతజ్ఞతగా చూస్తూ–

"అలాగే సార్! చాలా థాంక్స్. మీరీ పర్మిషన్ ఇప్పించకపోతే మా స్టూడెంట్స్ చాలా డిసప్పాయింట్ అయ్యేవాళ్ళు. నిజానికి సగంమంది స్టూడెంట్స్ ఆర్టిస్టు లను చూడాలనే బొంబాయి వచ్చారు. ఆ కోరిక తీరకపోతే మా లెక్చరర్స్‌ను ముప్పతిప్పలుపెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగించేవారు. మరి నే వస్తాను సార్. మీకూ ఆలస్యమవుతున్నట్లుంది" అని లేచాడు సూర్యం.

కాఫీ, బిస్కెట్స్‌వున్న ట్రేతో హాల్లో కొచ్చింది పార్వతి.

"మా అక్క... పార్వతి" అంటూ సూర్యానికి పరిచయం చేసింది మాలతి.

సూర్యాన్ని చేయిపట్టి లాగి కూర్చో బెట్టారు రమణరావుగారు. "కాఫీ తీసుకొని వెళ్ళవోయ్"అంటూ అంతా కాఫీలు తాగిన తర్వాత జగన్నాథ్, సూర్యం బయలు దేరారు. మాతుంగావరకు వెళ్ళవస్తానన్న





జగన్నాథ్‌ను వారించాలని సూర్యం ప్రయత్నించినా అతను ఊరుకోలేదు.

సూర్యంతో బయలుదేరిన జగన్నాథ్ అతన్ని మాత్రంగా మార్కెట్ వరకూ పంపి తను వెనుతిరిగాడు. మార్కెట్లో మంచి పళ్ళు కనిపిస్తే ఒక కిలో ద్రాక్ష, ఓ డజను అరటిపళ్ళు తీసుకుని రమణ రావుగారింటి తోవపట్టాడు. అందంగా కట్టిన పువ్వులు చూస్తుంటే తీసుకోవాలని పించింది. కానీ పూలు తీసుకొని వెళ్తే ఏమనుకుంటారోనని సంకోచించాడు మొదట. కానీ పళ్ళూ, పూలూ తీసు కెళ్ళడం ఆచారం అని చెప్పి తప్పించుకో వచ్చని ఓ రెండు రూపాయలకు పూలు తీసుకున్నాడు.

కేలాలు వేసి వాడిచ్చిన పేపర్‌కవరు చిరిగిపోతుంటే నానా అవస్థాపడి ఎలాగో ఇల్లు చేరాడు. "ఏమిటోయ్ జగన్నాథ్! మార్కెటంతా కొనుకొచ్చినట్లున్నావు. ఇంట్లో పళ్ళున్నాయ్ కదోయ్! మళ్లీ ఇన్ని ఎందుకు తెచ్చావు? సరే... పువ్వు లంటే మా అమ్మాయిలకు మహా పిచ్చనుకో ఎన్ని తెచ్చినా వద్దనరు" అంటూ ఆహ్వానించారు రమణరావుగారు.

"ఏన్నో లేవండీ... ఫ్రెష్‌గా కనిపిం చాయి. అందుకని పట్టుకొచ్చాను పువ్వులు. చాలా మరికొంచం తెచ్చిమ్మంటారా?" అన్నాడు మాలతి వైపు చూస్తూ.

"చాలు... చాలు. భలేవారే! బాబాయి మాటలు విని ఈ పూలు చాలవనుకుంటు న్నారా? బొంబాయిలోవాళ్ళకు పూలు పెట్టుకోడం తెలియదండి. ఒక్క జాన పూలు పెట్టుకుంటే అవే ఎక్కువన్నట్లు మాటి మాటికీ సర్దుకుంటారు. మాకు అలా కాదు. తలనిండా పువ్వులుండాలి. అలా ఎక్కువ పూలు పెట్టుకుంటేమేకలు వెంట పడతాయని ఆయన ఎంత వెక్కిరించినా మేం కేర్ చేయం... కావలసినన్ని పెట్టు కోవలసిందే" అంటూ నవ్వుతున్న మాలతితోపాటు అంతా నవ్వేశారు.

"మరింక బయలుదేరుదామా పార్వతీ! నీ పనులన్నీ అయినట్లేనా?"

"నా పని ఎప్పుడో అయిపోయింది డాడీ...మేం రెడీ" అనడంతో ఇంటికి తాళం వేసి నలుగురూ షణ్ముఖానంద హాలుకు బయలుదేరారు.

తెలుగు నాటకం. అంత గొప్పగా ఏం అన్పించకపోయినా లైటింగ్ ఎఫెక్ట్సు, సెట్టింగ్స్ గొప్పగా కనిపించాయి. జగన్నాథ్‌కు అక్కడి ఫెసిలిటీస్ చూసి, ఇలాంటిఏర్పాట్లువుంటే చక్కటి నాటకాలు వేయవచ్చు అనిపించింది. ఒకరిద్దరు మంచి నాటకానుభవమున్నవాళ్ళు వుండి, చక్కటి డ్రామా సెలక్ట్ చేసుకుంటే ఆ ప్రోగ్రాం ఇంకా గొప్పగా వుండేది.

ప్రోగ్రాం చూసి ఇంటికి వచ్చిన తర్వాత కూడా చాలా సేపు ఆ ప్రోగ్రాం గురించే మాట్లాడుకున్నారు. మాటల సందర్భంలో పార్వతి చక్కగా పాడు తుందని,అప్పుడప్పుడూ రేడియోలో పాడు తుందని తెలిసిన జగన్నాథ్ పార్వతిని ఓ పాట పాడమన్నాడు.

మాలతి కూడా బలవంతం చేయడంతో తప్పనిసరిగా పార్వతి ఓ పాట పాడింది. ఆ పాట విన్న జగన్నాథ్‌కు పార్వతి మీద మరింత అభిమానం ఏర్పడింది. సున్నితమైన ఆమె మనస్తత్వం, ఆప్యా యంగా మాట్లాడే ఆ మాట తీరు, మర్యాదా అమృతపు జల్లులా సాగిన ఆ గాన మాధుర్యం జగన్నాథ్ మనసులో మరపు రాని స్మృతిగా మిగిలింది.

ఎక్స్‌కర్షన్ పూర్తయి వాళ్ళంతా

హైదరాబాద్ బయలు దేరినప్పుడు, సెండాఫ్ ఇవ్వడానికి వచ్చిన పార్వతి, రమణరావుగారు మాలతితో పాటు మరో సారి తప్పక బొంబాయి రమ్మని జగన్నాథ్‌ను కూడా ఆహ్వానించారు.

హైదరాబాద్ చేరుకున్న జగన్నాథ్‌కు ఏకాంతంగా ప్రశాంత వాతావరణంలో ఉన్నపుడు పార్వతి మధురమైన గొంతు నుంచి విన్న ఆ పాట పదే పదే విని పించేది. అతిస్వల్ప వ్యవధిలో తన నంతగా ఆకర్షించిన పార్వతిని మరచి పోదామన్నా మరచిపోలేకపోతున్నాడు.

ఇది తెలియని మాలతి జగన్నాథ్‌ను అప్పుడప్పుడూ తమ ఇంటికి ఆహ్వానిం చడం, అతని దగ్గర తనకు తెలియని పాఠాలు చెప్పించుకోడం, అతను శ్రద్ధగా పాఠం చెబుతుంటే తనేమో శ్రద్ధగా అతని ముఖంలోకి చూస్తూ ఏవేవో కలల్లో తేలిపోవడం అలవాటుగా మారిపోయింది. వారానికొకసారైనా జగన్నాథ్‌తో గడవకపోతే ఏదో వెలితిగా అనిపించేది.

మాలతికి అక్క చెల్లెళ్ళు లేరు. వున్నది ఒక్క తల్లీ. జగన్ అంటే తెలివిగల కుర్రాడనీ, మర్యాదస్తుడనీ అభిమానం పెంచుకుంది. అందుకే వాళ్ళ స్నేహానికి అడ్డు చెప్పలేదు.

మాలతి చూపులకర్థం గ్రహించలేనంత వెర్రివాడు కాదు జగన్. కానీ ఎందుకో మాలతిపట్ల ఓరకమైన ఆప్యాయత, అభిమానం తప్ప మరే భావం కలగటం లేదు. పరిచయం, చనువూ పెరిగినకొద్దీ అతనికి మరింత అభిమానం పెరిగిందే తప్ప ఆకర్షణ కలగలేదు.

ఆరోజు మామూలుగా మాలతి వాళ్ళింటికి వెళ్ళేసరికి తల్లీ కూతుళ్ళిద్దరూ దిగులుగా కనిపించారు. జగన్ కారణం అడిగేలోపే లెటర్ తీసుకొచ్చి ఇచ్చింది మాలతి.

అది బొంబాయినించి రమణరావుగారు రాశారు. పార్వతి పరిస్థితి ఏమీ బాగో లేదని, వెంటనే బయలుదేరి రమ్మని దాని సారాంశం తప్ప వివరాలేమీ



రాయలేదాయన.

కన్నీళ్ళతో కూర్చున్న మాలతివేపు చూసి చిన్నగా నవ్వి "ఛ! ఏమిటి మాలా? ఇంత బెంబేలుపడుతున్నావు. ఏదో మామూలు జ్వరమైవుంటుంది. ఒక్కరే వున్నారు కనుక మీ అంకుల్ భయపడి సహాయంకోసం మీరు వస్తే బావుంటుందని అలా రాసివుంటారు. బయలుదేరండి ఆంటీ! మిమ్మల్ని బండి ఎక్కిస్తాను. భయపడాల్సిన పరిస్థితి అయితే రమణ రావుగారు టెలిగ్రామే ఇచ్చివుండేవారు" అంటూ ధైర్యం చెప్పాడు జగన్నాథ్.

"ఏమో బాబూ! ఆ లెటర్ వచ్చిన దగ్గరనుంచీ కాళ్ళూ, చేతులూ ఆడటంలేదు. అబ్బాయి కూడా దగ్గరలో లేడు. పారూ కేదయినా అయితే వాడికి మేమేం సమాధానం చెప్పాలి. చెల్లెలంటే ప్రాణం వాడికి" అంటూ కళ్ళు తుడుచుకుంటున్న కామాక్షమ్మగారి వేపు చూసి—



"పెద్దలు మీరే ఇలా గాభరాపడితే మాలతి మరీ ఖంగారుపడుతుంది. మీరు వెళ్లేసరికి పార్వతి కులాసాగా ఉంటుంది. నామాటవినిలేచిత్వరగాబయలుదేరండి... ట్రయిన్ టైమ్ అవుతోంది" అన్నాడు జగన్నాథ్.

"జగన్! మీరు కూడా మాతో రాకూడదూ. మాకు కాస్త ధైర్యంగా వుంటుంది" అన్న మాలతి మాట పూర్తి కాకుండానే–

"అవును బాబూ! నువ్వూ బయలుదేరు. అక్కడ రమణ ఒక్కరూ ఎంతబాధపడుతున్నారో. ఉన్న ఒక్కమగ పిల్లాడూ వెళ్ళి అమెరికాలో కూర్చుంటే ఇద్దరినీ పార్వతిలోనే చూసుకుంటూ కాలం గడుపుతున్నారు. ఇప్పుడు పార్వతి కేదయినా అయితే అతన్ని పట్టుకోవడం ఎవరికీ సాధ్యంకాదు" అంది కామాక్షమ్మ.

జగన్నాథ్ అప్పటికప్పుడే తనూ వాళ్ళతోపాటు ప్రయాణం కావడానికి నిర్ణయించుకున్నాడు. "నేనో పదిహేను నిముషాల్లో వచ్చేస్తాను. ఈలోపున మీరు రెడీకండి" అంటూనే లేచి గబగబా హాస్టల్‌వేపు సాగిపోయాడు జగన్.

దారిపొడుగూతా అందంగా, అమాయకంగా, వివేకంతోవెలిగే పార్వతి రూపమే కనిపించిందతనికి. మనసంతా ఎలాగో అయింది. చిన్న బ్రీఫ్‌కేస్‌లో ఓ రెండు జతల బట్టలు వేసుకొని సూర్యానికి చెప్పి బయలుదేరి మాలతివాళ్ళిల్లు చేరాడు. మరో అరగంటలో ముగ్గురూ బొంబాయివెళ్లే ట్రయిన్‌లో కూర్చున్నారు. రిజర్వేషన్ లేదు. అయినా ఆర్డినరీ కంపార్టుమెంట్‌లో ఎలాగో చోటుదొరికింది. దారిపొడుగూతా కామాక్షమ్మగారు పార్వతి మంచితనం గురించి చెబుతూ బాధపడుతూనే ఉన్నారు. మాలతీ, జగన్నాథ్ ఎవరికి వారే పార్వతి గురించిన ఆలోచనల్లో మునిగివున్నారు.

అంత అకస్మాత్తుగా ఏం జరిగి వుంటుంది. అదే ఆలోచన.జగన్నాథ్‌కూ, పార్వతికీ మధ్య పరిచయం స్వల్పమైనదే అయినా జగన్నాథ్‌లో పార్వతి రూపం, ఆమె మంచితనం ముద్రవేసుకున్నాయి. అందుకే ఆ లెటర్ చూడగానే వెంటనే వెళ్ళి పార్వతిని చూడాలనిపించింది. దానికి తగినట్లు మాలతీ, కామాక్షమ్మ గారూ కూడా బలవంతం చేయడంతో వెంటనే బయలుదేరాడు.

దాదర్ స్టేషన్‌లో దిగి టాక్సీ తీసుకుని ముగ్గురూ రమణరావుగారిల్లు చేరారు. హాలంతా నిశ్శబ్దంగా వుంది. రమణ రావుగారు సోఫాలో కూర్చుని వున్నారు. ఆయన మొఖాన ఎల్లవేళలా కనిపించే చిరునవ్వు మాయమయ్యింది.

మాలతిని చూడగానే రెండుచేతులూ చాపారు. "వచ్చావామ్మా ... మాలా!" అంటున్న ఆయన పెదాలు వణికాయి.

"అక్క అదృష్టవంతురాలు కనుక అంత పెద్ద యాక్సిడెంట్ జరిగినా ప్రాణాలు దక్కాయి. ప్రాణభయంలేదని చెప్పారు డాక్టర్" అంటూ మాలతిని వోదార్చారు – తను ధైర్యం కూడగట్టు కుంటూ.

వెనకగా సామానులు దింపించుకుని వచ్చిన జగన్నాథ్‌ను చూసి రాని నవ్వు పెదాలమీదకు రప్పించడానికి ప్రయత్నిస్తూ – "ఓ...నువ్వూ వచ్చావటోయ్ జగన్! మా మాల కంగారుపడి నిన్నూ శ్రమపెట్టినట్లుంది" అన్నారు రమణ రావుగారు.

"ఇందులో శ్రమ ఏముందండీ!

పార్వతిగారికెలా వుందిప్పుడు? ఎక్కడ వున్నారు?" అన్నాడు జగన్నాథ్ నమస్కారం చేస్తూ.

"కొంచెం ఫర్వాలేదు బాబూ! కె.యి.యమ్. హాస్పిటల్‌లో చేర్చాము. మరీ బెంబేలుపడతారని యాక్సిడెంట్ విషయం రాయలేదు. ఈమధ్య టి.వి.లో పాడే అవకాశం వచ్చింది పార్వతికి. అంతక్రితం రేడియోలో పాడుతున్నా, టి.వి.లో మొట్టమొదటిసారిగా అవకాశం వచ్చిందని ఎంతో సంబరపడింది. వారం ముందే ఎనౌన్స్ చేశారు కూడా. ఈ వారం రికార్డింగ్‌కి స్టూడియోకి రమ్మన్నారు. నాకు కొంచెం జ్వరంగా వుంటే తను ఒక్కతే బయలుదేరింది. నేను వస్తానన్నా వూరుకోలేదు. నీరసంగా వున్నారు. మీరింటిదగ్గర రెస్ట్ తీసుకోండి డాడీ నేవెళ్ళి రాగలనంది. కాదూ కూడదని నేను బయలుదేరితే తనుకూడా వెళ్లడం మానేస్తానంది. ఇంక తప్పనిసరయి నేను ఇంటిదగ్గరే వుండిపోయాను.

టి.వి. స్టేషన్‌దగ్గరనుంచి తిరిగి వస్తూండగా స్పీడుగా వస్తున్న ఎంబాసిడర్‌కారు పక్కనుంచి దూసుకొని వెళ్ళడంతో పక్కకు గెంతిన పార్వతి కాలు మడత పడి రోడ్డుకడ్డంగా పడిపోయిందిట. ఎదురుగా వస్తున్న లారీడ్రైవర్ సడన్ బ్రేక్ కొట్టడంతో సరిగ్గా పార్వతి తలకు ఓ టైర్ తగిలి బండి ఆగింది. ఆ బ్రేకు పడటం ఏమాత్రంఆలశ్యమైనా,ఆ డ్రైవర్ ఏమాత్రం అజాగ్రత్తగా వున్నా పార్వతి మనకు దక్కేది కాదు. నాకు ఫోను చేశారు టి.వి.వాళ్లే. నాకు కాళ్ళూ చేతులూ ఆడలేదు. అప్పటికే పోలీసులు రావడం, అంతా రాసుకొని హాస్పిటల్‌లో చేర్పడం జరిగిపోయింది.

దెబ్బలకంటే ఎక్కువ షాక్ తిన్నది పార్వతి. భగవంతుడి దయవల్ల తలకు పెద్దగా గాయమేమీకాలేదు-అంటూనేలేచి,

"మీరు స్నానాలవీ కానివ్వండి వదినా! కాఫీ తెప్పిస్తానుగానీ నువ్వుకూడా స్నానం చేసిరా బాబూ" అన్నారు.

"ఈ విషయంసు రేంద్రకు రాశారా?" అంటున్న కామాక్షి గారి వైపు చూసి తల అడ్డంగా వూపుతూ-

"లేదు వదినా! కంగారుపడతాడని రాయలేదు. చెల్లెలికేమైనా అయ్యిందంటే వాడు అక్కడ ఓక్షణం నిలవలేడు. పైగా పరీక్షల టైం. మరో ఆరు నెలల్లో ఎలానూ వచ్చేస్తున్నాడు కదా! మళ్లీ ఇప్పుడు రప్పించడం ఎందుకని వూరుకున్నాను" అంటూ పనికుర్రాడి కోసం వెదకడం చూసి,

"ఇంట్లో పాలు లేవా బాబాయ్?" అంది మాల.

"ఉన్నాయమ్మా... ఇప్పుడే వచ్చారు కదా! కొంచం కాఫీ తెప్పిద్దామని గోపి కోసం చూస్తున్నాను."

"పాలుంటే కాఫీ నేపెడతాలే రమణా! ఈలోపు స్నానం చేసిరా బాబూ! త్వరగా వంట పూర్తయిపోతే హాస్పిటల్‌కు వెళ్ళిరావొచ్చు" అంటూ హడావుడిగా వంటగదిలో ప్రవేశిస్తున్న కామాక్షమ్మగారి వైపుచూసి "ఈ పూటకు గోపి కారియర్లు తెస్తాడులే వదినా! మీరు స్నానాలుచేసి రెడీ కండి హాస్పిటల్‌కు వెళదాం" అంటూ వచ్చి హాల్లో కూర్చున్నారు రమణరావుగారు.

"బాబాయ్! అక్క కాలుకేం ఫర్వాలేదు కదా?" అంటున్న మాల గొంతు జీర పోయింది.


చతురకు ... తెలి

"మాలా! కాలు కొంచం ఫ్రాక్చర్ అయ్యింది. సరిగానే సెట్ అవుతుందని చెప్పారమ్మా. కానీ..."

"కానీ ఏవిటో చెప్పు బాబాయ్! నువ్వు ఏదో దాచిపెడుతున్నావు. ఏమిటో చెప్పు బాబాయ్" అంటున్న మాల కళ్ళలో గిర్రున నీళ్ళు తిరిగాయి. మాల వైపు చూసి తలకిందికి దించుకుని-

"పార్వతికి ఆషాక్‌తో మాట పోయిం దమ్మా. ఇంక అక్క పాటలే కాదు మాటలు కూడా వినలేం"

"బాబాయ్!" అని మాల పెద్దగా వేసిన కేకకు కామాక్షమ్మగారు పరుగెత్తు కొచ్చారు హాల్లోకి. విషయం తెలిసి ఆమె కూడా ఏడవడం మొదలెట్టారు.

జగన్నాథ్ కళ్ళలో నీళ్ళు తిరిగాయి. అంత ఆప్యాయంగా మాట్లాడే పార్వతి మాట ఇక వినిపించదు. అందంగా పాడే ఆ గొంతు మూగవోయిందంటే మనసంతా ఎలాగో అయిపోయింది.



త్వరగా స్నానాలు చేసి అంతా బయలుదేరి హాస్పిటల్‌కు వెళ్ళారు. ఆ హాస్పిటల్‌లో పార్వతి దగ్గర ఆమె స్నేహితురాలు మాయ కూర్చొనివుంది.

వీళ్ళు వెళ్ళగానే "అంకుల్... నే వెళ్ళివస్తా" అంటూ లేచి వెళ్ళిపోయింది.

"ఈ వారం రోజుల నుంచీ నేనులేని సమయంలో ఈ అమ్మాయే తోడుంటోంది. వాళ్ళిల్లు హాస్పిటల్ ఎదురు సందులోనే వుంది. నేను ఇంటికెళ్ళబోయే ముందు చెప్పి వెళతాను. నేను తిరిగి వచ్చేదాకా పార్వతికిఏం కావాలో తనే చూసుకొంటూ వుంటుంది" అంటూ పార్వతి మంచం దగ్గరకెళ్ళి నుంచున్నారు. అప్పుడే నిద్ర పోయినట్లుంది పార్వతి. చూస్తున్న అందరి కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"కొంచెంసేపు అలా వరండాలో నిల్చుందాంపద జగన్నాథ్. మీరు గదిలోనే కూర్చోండి మాలా! పార్వతికి మెలకువ రాగానే పిలువమ్మా" అని చెప్పి జగన్నాథ్‌తో బయటికి నడిచారు.

అక్కడ నిలుచొని చూస్తుంటే హాస్పిటల్ లోనికి వస్తున్నవాళ్ళంతా కనిపిస్తున్నారు.

ఎటుచూసినా హడావుడిగా పరుగెత్తే స్ట్రెచ్చర్సే.

"జగన్నాథ్... ఈ హాస్పిటల్‌లో ఇలా కొంచంసేపు నిలుచుంటే చాలు-బొంబాయిలో రోజుకు ఎన్ని యాక్సిడెంట్సఅవుతున్నాయో చెప్పొచ్చు. ఇక్కడికి ఎక్కువగా యాక్సిడెంట్ కేసులే వస్తాయి. చేతులు విరిగినవాళ్ళు, నడుములు విరిగినవాళ్ళు, కన్నో ముక్కో పోగొట్టుకున్నవాళ్ళు - ఇలా రకరకాల కేసుల్ని చూస్తుంటే కళ్ళు తిరిగిపోతాయి. ఓ రకంగా పార్వతి అదృష్టవంతురాలే! ప్రాణాల్తో బయటపడింది. కానీ దానికి భగవంతుడిచ్చిన వరమనుకున్న ఆగొంతు శాశ్వతంగా మూతపడింది. ఇంకదాని పాటా, మాటా వినలేము" అంటున్న రమణరావుగారి గొంతు పూడుకు పోయింది.

"నువ్వు విన్నట్లున్నావు కదూ

పార్వతి పాటలు" కాసేపాగి అన్నారు. "నాకా అదృష్టం కలగలేదు పూర్తిగా. ఉన్నదే రెండు రోజులు. ఆమె పాట వినగల అవకాశం ఒక్కసారే కలిగింది" అంటున్న జగన్నాథ్ మనసులో అనుకున్నాడు-

'పూర్తిగా వినకపోవడమే మంచిదైంది. ఒక్క పాట వినే ఆమెను మరచిపోలేకపోయిన నేను పాటలన్నీ వినివుంటే పిచ్చివాడినై వుండేవాడినేమో' అని.

ఇంతలో మాల బయటకు వచ్చింది. కళ్ళు ఎర్రగా జ్యోతుల్లా వున్నాయి- అప్పటివరకూ ఏడ్చిందనటానికి గుర్తుగా.

అంతా కలిసి గదిలోకి వెళ్ళారు.

జగన్నాథ్‌ను చూడగానే సన్నటి నవ్వు విరిసింది పార్వతి పెదాలపై. ఆమెవైపే చూస్తున్న జగన్నాథ్ కళ్ళలో అప్రయత్నంగా నీళ్ళు తిరిగాయి.

"కులాసాగా వుందా పార్వతీ" అన్నాడు దగ్గరగా వెళ్ళి జగన్నాథ్.

చిన్నగా నవ్వుతూ తల వూపుతున్న పార్వతి కళ్ళలో నీటి తళుకు చూసి అందరి మనసులూ ఆర్ద్రమయ్యాయి. సమాధానం చెప్పలేని పార్వతి అశక్తత చూసి మాలతి తట్టుకోలేక బావురుమంది మళ్ళీ.

వాళ్ళిద్దరి బాంధవ్యం తెలిసిన రమణరావుగారే దగ్గరకు తీసుకొని మాలను ఓదార్చారు. కామాక్షమ్మగారు కళ్ళొత్తుకున్నారు పార్వతి తల నిమురుతూ.

మౌనం రాజ్యమేలుతోందా రూములో. ఎవరికి వారే మౌనంగా వున్నారు. మూగవోయిన పార్వతి ముందు మాట్లాడానికి ఎవ్వరికీ గొంతు పెగలడం లేదు.

చివరికి పక్కనేవున్న లెటర్ పాడ్ అందుకుని రాసింది పార్వతి.

"ఎప్పుడొచ్చారు మీరంతా ? ఫోం చేశారా?"

"మూడుగంటలైంది. ఇంకా ఎవ్వరూ ఫోంచేయలేదు. నిన్ను చూడాలని ఆత్రంగా వచ్చేశారు. వచ్చిన దగ్గర నుంచీ మాల ఒకటే ఏడుపు" అన్నారు రమణరావుగారు. ఆ పాడ్‌వైపు చూసి, నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ.

మాలను చేత్తో దగ్గరకు రమ్మని సైగ చేసింది పార్వతి. కన్నీళ్ళుతుడుచుకుంటూ దగ్గరగా వెళ్ళి నుంచున్న మాలను మంచం మీద కూర్చోబెట్టుకొంది. మెల్లగా దిండుకు ఆనుకొని జారుగా పడుకొని పాడ్ తీసుకొని మెల్లగా రాసింది మళ్ళీ-

"మాలా...ఎందుకే ఏడుపు? మిమ్మల్నందర్నీ చూసే అదృష్టం వుంది బతికాను.లేకపోతే అంత పెద్దయాక్సిడెంట్ నుంచి తప్పించుకోడం ఎవరికి సాధ్యం? మరో వారం రోజుల్లో డిశ్చార్జ్ చేస్తారట. గొంతు పోయిందని బాధపడుతున్నావా? అది యాక్సిడెంట్‌లో పోయింది. కనుక మళ్ళీ రావచ్చు" అని. అది చదివిన మాల జగన్నాథ్‌కిచ్చిందా పాడ్.

"భలే బాగా చెప్పారు పార్వతీ! మాల ఒట్టి పిరికిపిల్ల. హైదరాబాద్‌లో బయలుదేరిన దగ్గరనుంచీ ఒకటే ఏడుపు. పార్వతిగారికేంకాదు కులాసాగా వుంటారని ఎంత చెప్పినా వినలేదు. చివరికి మీరు ధైర్యం చెప్పాల్సి వచ్చింది" అంటూ నవ్వుతున్న జగన్నాథ్ వైపు సన్నగా నవ్వుతూ చూసింది పార్వతి.

"ఇంటికెళ్ళి ఫోంచేసి కొంచెం రెస్ట్ తీసుకోండి జగన్నాథ్. ఈ రోజు... అతి ముఖ్యమైన రోజు నా జీవితంలో. ఈరోజే టి. వి. లో నా మొదటి, చివరి




ప్రోగ్రాం వుంది. ఇంటికెళ్ళి ప్రోగ్రాం చూసి ఎలావుందో రేపు నాకు చెప్పాలి" అని రాసి జగన్నాథ్‌కిచ్చింది పార్వతి.

అది చదివిన జగన్నాథ్ మనసంతా ఎలాగో అయిపోయింది. పార్వతి చేత హార్లిక్స్ తాగించి అంతా ఇంటికి వచ్చేశారు. కామాక్షమ్మగారు పార్వతి దగ్గరే వుంటానన్నా ఒప్పుకోలేదు పార్వతి.

"నాకు అవసరమేమీ వుండదు పెద్దమ్మా! మీరు వెళ్ళి భోంచేసి నా ప్రోగ్రాం చూడండి. నేనెలాగూ చూడలేను. మీరు చూస్తే తృప్తిగా వుంటుంది. త్వరగా వెళ్ళండి" అని రాసింది.

తప్పనిసరిగా అందరూ బయలుదేరి ఇంటికి వచ్చారు. భోజనమైందనిపించి హాల్లో టి. వి. ముందు కూర్చున్నారు అందరూ.

ఎనౌన్సర్ ప్రోగ్రాం వివరాలు చెబుతున్నారు. 'ఎనిమిది గంటల ముప్పైనిమిషాలకు కుమారి పార్వతి లలిత సంగీతం వింటారు' అని చెప్పిన తర్వాత ఏదో రెండు ప్రోగ్రాములు జరిగాయి. కానీ ఎవ్వరికీ మనసు దానిమీద లగ్నం కావడం లేదు. రాబోయే పార్వతి ప్రోగ్రాం కోసం ఎదురుచూస్తూ కూర్చున్నారు.

మరోమారు ఎనౌన్స్ చేశారు పార్వతి ప్రోగ్రాం గురించి. మైకు ముందు హుందిగా నుంచుని చేతిలో పుస్తకం పట్టుకొని పాడుతున్న పార్వతి పాటలో లీనమైన అందరూ ఆ అరగంటా బాహ్య ప్రపంచాన్ని మరచి మధురమైన ఆ గాన వాహినిలో మునిగితేలారు. జగన్నాథ్ కళ్ళు అవిరామంగా వర్షిస్తున్నాయి. మాల పరిస్థితీ అంతే. రమణరావుగారు ఇంక కూర్చోలేక లోపలికెళ్ళిపోయారు. పాట పూర్తికాగానే టి. వి. ఆఫ్‌చేసిన మాల కళ్ళు తుడుచుకుంటూ అంది-

"జగన్! అక్క ఎంత బాగా పాడిందో చూడండి. కనీసం అది చూసుకునే అదృష్టంకూడా లేకుండాపోయిందిదానికి" అని వెక్కివెక్కి ఏడ్చింది.

మాట్లాడకుండా కూర్చున్న జగన్ వైపు కళ్ళెత్తి చూసిన మాలతి ఆశ్చర్యపోయింది.

"ఎన్నెన్ని కలలు కనేదో టి. వి. లో పాడి గొప్పగా పేరు తెచ్చుకోవాలని. కలలన్నీ కరిగిపోయి కన్నీళ్ళే మిగిలాయి దానికి. మనచేత కూడా కంటతడి పెట్టించింది" అంటు అమాయకంగా అన్న మాలతి వైపు చూస్తూ, అన్నాడు జగన్నాథ్.

"భగవంతుడు కొన్ని వరాల్ని అందించినట్లే అందించి మళ్ళీ ఎందుకు తీసేసుకుంటాడో అని ఆలోచిస్తే బాధే మిగులుతుంది. మొట్టమొదటిసారి పార్వతి పాట విన్నప్పుడే ఆమె పట్ల అభిమానం పెరిగింది. ఆ పాట వినగలిగిన అదృష్టానికి నేనెంతగానో ఆనందించాను. కానీ ఇంత త్వరగా దురదృష్టదేవత ఆమెను వరిస్తుందనీ, అంతటి మధురమైన కంఠాన్ని హరిస్తుందని ఊహించలేకపోయాను" అంటున్న జగన్నాథ్ కంఠంలో కదలాడిన వ్యథ చూసి మాలతి కళ్ళు తుడుచుకొంది.

"పదండి ! బాబాయ్ బాధ పడుతున్నట్లున్నారు. ఒంటరిగా ఉంటే ఆయన అదే ఆలోచిస్తూ వుంటారు" అంది లేస్తూ.

"పార్వతంటే ప్రాణం బాబాయికి. ఈ దెబ్బకు ఆయన తట్టుకోలేకుండా వున్నారు. ఎప్పుడూ నవ్వుతూ నవ్విస్తూ వుండే బాబాయిని ఇలా గంభీరంగా చూస్తుంటే నాకు భయంగా వుంది

జగన్"

"అందుకే నువ్వు ముందుగా ధైర్యం తెచ్చుకో మాలా! నువ్వే ఆయనలో మళ్ళీ వుత్సాహాన్ని కలిగించాలి. ఈ కాస్త పరిచయంలో నేను గ్రహించింది ఏమిటంటే ఆయన నిన్నూ, పార్వతినీ ఒక్కలాగే చూస్తారు. నువ్వు మాట్లాడుతూ ఆయన దగ్గర కూర్చుంటే పార్వతే ఆయనతో మాట్లాడుతున్నట్లు అనుభూతి పొందగలరు. వెళ్ళు... వెళ్ళి ఆయనతో నవ్వుతూ కబుర్లు చెప్పు. నేనలా బయటికి వెళ్ళివస్తాను" అంటూ జగన్నాథ్



చెప్పులు వేసుకుని బయటికి నడిచాడు.

నవ్వుతూ మృదుమధుర స్వరాన పాడుతున్న పార్వతి రూపమే కనుల ముందు కదలాడుతుండే చాలాసేపు అలా రోడ్డున పడి నడుస్తూనే వున్నాడు. చాలా పొద్దుపోయేంతవరకూ అలా రోడ్డుమీదే వుండిపోయి తర్వాత స్పృహ తెచ్చుకొని రమణరావుగారి ఇంటివైపు అడుగులు వేశాడు. కాలింగ్ బెల్ నొక్కగానే వచ్చి తలుపు తీసింది మాలతి.

ఎర్రగా జ్యోతుల్లా వున్న జగన్నాథ్ కళ్ళవైపూ, అలసటగా వున్న ముఖం వైపూ పరీక్షగా చూసి, "ఎటు వెళ్ళావు! ఇంత రాత్రయినా రాకపోతే దారి తప్పారేమోనని భయపడుతున్నాను. బాబాయి ఇప్పుడే వెళ్ళి పడుకున్నారు. చాలా పొద్దుపోయింది...మీరూపడుకోండి. మంచినీళ్ళు తాగుతారా?" అంటూ ఏకబిగిన ప్రశ్నల వర్షం కురిపిస్తూ అతని సమాధానాలకు ఎదురు చూడకుండానే ఓ గ్లాసు చల్లటి నీళ్ళు తెచ్చి ఇచ్చింది మాలతి.

మంచినీళ్ళు తాగి హాల్లో తనకోసం వేసిన పక్కమీద పడుకున్నాడు జగన్నాథ్ మరోమాట మాట్లాడకుండా.

అతనికి ఎవరితోనూ మాట్లాడాలని పించలేదు. మనసంతా తెలియని బాధతో నిండి వుంది.

ఓ క్షణం అలాగే నిలబడి జగన్నాథ్‌వైపు చూసి మాలతి లోపలికి వెళ్ళిపోయింది మౌనంగా.



తెల్లవారు జామునే పాల మనిషి కేకతో మెలకువ వచ్చిన మాలతి హాలు తలుపు తీసి పాలందుకొని తలుపు మూసేసి జీరోలైట్ వెలుగులో జగన్నాథ్ పడుకొన్నవైపు చూసింది. కళ్లు తెరచి చూస్తున్న జగన్నాథ్ మాలతిని చూడగానే చిన్నగా నవ్వుతూ-

"గుడ్‌మార్నింగ్ మాలా" అన్నాడు.

తనూ చిన్నగా నవ్వింది. "వెరీ గుడ్ మార్నింగ్...బాగా నిద్రపట్టిందా? కాఫీ కలిపి పట్టుకురానా ? కొంచెం ఆగుతారా?"

"నిద్ర బాగా పట్టిందిసరేగానీమాలా! ఒక్కసారే నాలుగు ప్రశ్నలు వేసే అలవాటు మానాలి ముందు నువ్వు. గుర్తుపెట్టుకొని అన్ని ప్రశ్నలకు సమాధానాలు చెప్పలేని మొద్దబ్బాయిని నేను" అన్నాడు చిన్నగా నవ్వుతూ.

"సరే... ఇంతకీ కాఫీ కలిపి ఇవ్వనా వద్దా" అంది మళ్ళీ నవ్వుతూ.

"ఎంత తొందరగా ఇస్తే అంతమంచి దానివి" అంటూ లేచి కూర్చున్నాడు.

మాలతి కాఫీ కలుపుకు తీసుకువచ్చే సరికి జగన్నాథ్ ముఖం కడిగి స్నానం కూడా పూర్తిచేసి డ్రెస్ చేసుకొని రెడీ అయ్యాడు.

కాఫీ కప్పు అందుకుంటూ "మాలా! అంకులింకా లేవలేదుకదూ! ఫ్లాస్క్‌లో పాలుపోసి ఇస్తే నేను హాస్పిటల్‌కు వెళ్ళిపోతాను. ఆరున్నర అవుతోందికదూ. ఈలోపు నువ్వూ స్నానం, టిఫిన్ కానిచ్చి అంకుల్‌తోపాటు హాస్పిటల్‌కు వచ్చేయవచ్చు. అందరూ ఒక్కసారే వెళ్లాలనుకుంటే పాపం పార్వతికి ఈలోగా ఒంటరిగా వుంటే బోర్ కొడుతుంది. మీరు వచ్చేవరకూ నేను తోడుంటాను... ఏం?" అన్నాడు.

"అలాగే చేయండి జగన్! అక్కను సాధ్యమైనంత త్వరగా మనలో మనిషిగా చేయాలి. మీరు ముందు వెళ్ళండి. నేనూ, బాబాయ్ త్వరగానే వచ్చేస్తాము. పాలు ఫ్లాస్క్‌లో పోసి తెస్తాను" అంటూ లోపలికి పరుగెత్తింది మాల.

అప్పటికి కామాక్షమ్మగారు కూడా నిద్రలేచారు.

పాలున్న ఫ్లాస్క్ చేతిలోకి తీసుకొని మాలతో చెప్పి బయలుదేరిన జగన్నాథ్ ముందుగా మార్కెట్‌కు వెళ్ళి ఓ అరడజను యాపిల్స్, అందంగా కట్టిన పూలమాల ఒకటి తీసుకొని హాస్పిటల్‌కు చేరుకున్నాడు.

కిటికీలోంచి బయటకు చూస్తూ ఏదో ఆలోచిస్తున్న పార్వతి జగన్నాథ్ రాక గుర్తించలేదు. ఫ్లాస్క్ పక్కనపెట్టి మంచం దగ్గరగా వెళ్ళి–

"గుడ్‌మార్నింగ్ మేడమ్!" అన్నాడు చిన్నగా నవ్వుతూ. ఉలిక్కిపడి తిరిగి చూసిన పార్వతి తనకు అతిసమీపంగా నుంచునివున్న జగన్‌ను చూసి చిన్నగా నవ్వుతూ చేతులు జోడించింది.

"రాత్రి మీ ప్రోగ్రాం అద్భుతంగా వుంది. నా ఆనందాన్ని ఎలా తెలియపరచాలో తెలియక ఈ చిరుకానుక తీసుకొచ్చాను" అంటూ పొట్లం విప్పి పూమాలను పార్వతి చేతులకందించాడు.

ఆప్యాయంగా ఆ పూలను వాసన చూస్తూ హృదయానికి హత్తుకొని కళ్ళు మూసుకున్న పార్వతి కళ్లనుంచి తప్పున రాలిన కన్నీరు చూసిన జగన్నాథ్ కలవరపడిపోయాడు. అప్రయత్నంగా చెయ్యిసాచి ఆమె కన్నీరు కొనగోట చిమ్మాడు. ఉలిక్కిపడినట్లయి కళ్ళు పెద్దవిచేసి ఆశ్చర్యంగా చూస్తున్న పార్వతి వేపు నవ్వుతూ–

"మిమ్మల్ని అభినందించటానికి ప్రత్యేకంగా వస్తే, మీరిలా బాధపడటం భావ్యంకాదు. అన్నట్లు మీరు ముఖం కడుక్కున్నారా?" అన్నాడు.

మెల్లగా తల వూపింది పార్వతి.

దిండుకు ఆనుకొని మెల్లగా లేవటానికి ప్రయత్నిస్తున్న పార్వతి బాధపడటంచూసి జగన్నాథ్ ఆలోచించకుండా పార్వతిని లేపి నెమ్మదిగా దిండుకాన్చి కూర్చోపెట్టాడు. తన అశక్తతకు మరోమారు కన్నీరు నింపుకుంటున్న పార్వతి వేపు చిరునవ్వుతోచూసి కళ్ళతోనే ఏడవద్దని వారించాడు. పాలగ్లాసు పార్వతి చేతికిచ్చి కుర్చీ మంచం దగ్గరగా జరుపుకొని కూర్చుంటూ, "అసలు మీరు కళ్లతోనే మాట్లాడగలరు పార్వతీ. మీరు మాట్లా




పటం లేదన్న భావమే నాకు కలగటం లేదు. ఓ వారం మీతో గడిపానంటే మీ కళ్ళ భాష నేర్చేసుకుంటాను" అంటూ నవ్వుతున్న జగన్నాథ్‌వేపు చిరునవ్వుతో చూస్తోంది పార్వతి. నెమ్మదిగా పాలు తాగుతున్న పార్వతిని తమ కాలేజీ కబుర్లతో నవ్విస్తూ కూర్చున్నాడు జగన్నాథ్.

తెల్లటి బట్టల్లో అంతకంటే తెల్లని పలువరస తళుకులీనేటట్లుగా నవ్వుతూ ఆహ్లాదకరమయిన కబుర్లు చెబుతున్న జగన్నాథ్‌వేపు చూస్తూ అతని మాటలు వింటూ నవ్వుతున్న పార్వతికి తను హాస్పిటల్లో వున్నానన్న విషయమే జ్ఞాపకం రాలేదు. అతను మాట్లాడుతున్నంతసేపూ సర్వప్రపంచాన్నీ మరచి అతన్నే చూస్తూ ఆ మాటలు మరీ మరీ వినాలనిపిస్తోంది. 'ఎవరితను? ఇతనికీ, తనకూ ఏమిటి సంబంధం?' అన్న ఆలోచనే రాలేదు. అతను తనకెంతో సన్నిహితుడిగా, ఆత్మీయుడిగా అనిపిస్తోంది. మాట్లాడుతూనే ఓ యాపిల్ కట్ చేసి బలవంతంగా పార్వతిచేత తినిపించాడు. రాత్రి తను విన్న పాట కొద్దిగా పాడి వినిపించి పార్వతిని నవ్వించాడు. మరి కాసేపట్లో రమణరావుగారూ, మాలతీ వచ్చారు.

జగన్ చెప్పిన ఏదో జోక్‌కు పెద్దగా నవ్వుతున్న పార్వతిని చూసి వాళ్ళ ముఖాలు సంతోషంతో విప్పారాయి. రమణరావుగారిని చూసి లేచి కుర్చీ ఆయనవేపు జరుపుతూ ఆహ్వానించాడు జగన్.

మాలతి పార్వతి బెడ్‌మీదే కూర్చుని చిన్నగా నవ్వుతూ– "జగన్! మీకోసం టిఫిన్, కాఫీ తెచ్చాను...తీసుకోండి" అంది జగన్ వేపు చూసి.

"కాఫీ తాగే వచ్చానుగా! ఇప్పుడు టిఫిన్ చేయాలని లేదు" అంటున్న జగన్ భుజం మీద చేయివేసి–

"టిఫిన్ తినకుండా వచ్చావు. తొమ్మిదవుతోంది. పొద్దుటెప్పుడో తాగిన కాఫీ ఇంకా వుందా?" అనడంతో పార్వతి వేపు చూశాడు జగన్–

"మేడమ్... మీరు టిఫిన్ తింటారా?" అంటూ.

"అక్కకు ఇడ్లీ వేరే తెచ్చాను మీరు తినండి" అంది మాలతి గ్లాస్‌కడిగి మంచినీళ్ళు పోసి టేబులుమీద పెడుతూ.

తినమని అర్థిస్తున్నట్లుగా చూస్తున్న పార్వతి వేపు చూసి మెల్లగా లేచి టిఫిన్ చేయడం మొదలెట్టాడు జగన్. పార్వతికి టిఫిన్ పెట్టబోయిన మాలతిని చేత్తో వారించింది పార్వతి.

"రెండుగ్లాసుల పాలు, ఓ యాపిల్ తినిపించారు జగన్! ఇంక ఇప్పుడు ఖాళీ లేదు. ఆకలయితే తర్వాత తింటానమ్మా" అని రాసింది పాడ్ మీద.

రెండురోజుల్లో తిరిగి వద్దామని వెళ్ళిన జగన్నాథ్ అనుకోకుండా అక్కడ వారం రోజులుండిపోయాడు. రోజూ పొద్దుటే పార్వతికి పాలు పట్టుకెళ్ళడం తన డ్యూటీగా పెట్టుకున్నాడు. ఆ పనిలో తెలియని సంతృప్తి ఏదో పొందుతున్నాడతను.

అందంగా, అమాయకంగా నవ్వే ఆ కళ్ళతో పార్వతి మాట్లాడుతున్న అనుభూతి కలిగేది. నోరు విప్పి చెప్పలేని ఎన్నో భావాలు ఆ కళ్ళలో చదువుకొనేవాడు. అనుకోకుండానే రోజురోజుకూ పార్వతి మనసుకు మరింత దగ్గరయ్యాడు.

ఓ డైరీ కొనుక్కొచ్చి ఇచ్చి చెప్పాడు

జగన్-

"పార్వతీ! మీ నోట వినిపించని మాటలన్నీ అలా కాగితాలమీద శాశ్వతంగా నిలిచిపోతాయి. మాట్లాడితే అప్పుడే మరచిపోవచ్చు. కానీ రాస్తే మీ ప్రతి మాటా అలా పేపరుమీద నిలిచి వుంటుంది" అని.

పార్వతి ఆ పుస్తకం తీసుకొని అందులో రాసింది-

"నా మాటలతో పాటు మీ మాటలూ శాశ్వతం కావాలని నా కోరిక. అందుకే ఈ డైరీలో సాధ్యమైనంతవరకూ మీరూ రాస్తూండండి. నాకు సమాధానాలు నోటితో చెప్పొద్దు" అని.

"తప్పకుండా పార్వతీ! ఇది చదివితే రెండు హృదయాలను చదివిన తృప్తి కలుగుతుంది. కానీ ఈ డైరీ మనిద్దరికే సొంతం. ఇందులో మరొకరి మాటలు వుండటానికి వీల్లేదు పారూ!" అని రాసి చిరునవ్వుతో పార్వతికిచ్చాడు.

అవి తీసుకొని చదివిన పార్వతి హృదయం వేగంగా స్పందించింది. సిగ్గుతో ముఖమంతా ఎర్రగా అయింది. కళ్ళెత్తి జగన్నాథ్ వైపు చూడలేకపోయింది.

నెమ్మదిగా పార్వతి దగ్గరగా నుంచొని సిగ్గుతో వంగిన తలను చేత్తో పైకెత్తుతూ-

"ఏం పారూ... నీకిష్టం లేదా!" అన్నాడు జగన్నాథ్. పార్వతి కళ్ళనిండా నీళ్ళు నిలిచాయి.

"క్షమించండి పార్వతీ! మిమ్మల్ని బాధపెట్టినట్లున్నాను. అతి చనువు తీసుకున్నాననుకొంటా" అన్నాడు జగన్నాథ్. పుస్తకం చేతిలోకి తీసుకొన్న పార్వతి గబగబా రాసింది-

"లేదు జగన్! మీరు నన్నేం బాధ పెట్టలేదు. వేదనతో బరువెక్కిన నా హృదయాన మీ మాటలతో పన్నీటి జల్లులు కురిపించారు. మీరు నన్ను మన్నించడం మానేయండి. పారూ అనే పిలవండి. ఈ పుస్తకం నా హృదయంలో దాచుకుంటా జగన్! ఇది మీకూ, నాకూ మాత్రమే పరిమితం... సరేనా?"

అది చదివిన జగన్ పెదాలపై చిరునవ్వు విరిసింది. పుస్తకంలో మళ్ళీరాశాడు-

"పుస్తకం మాత్రమే నీలో దాచుకుంటే చాలదు పారూ... నన్నూ నీలో దాచుకోవాలి" అని.

అది చదివిన పార్వతి సన్నగా నవ్వుతూ జగన్ వైపు చూసి తల వూపింది సిగ్గుగా.

"ఊహూ! అలా కాదు... పుస్తకంలో రాయాలి" అన్నాడు.

"తప్పకుండా జగన్... నాకు అంతకంటే అదృష్టం మరేముంది" అని రాసింది పార్వతి.

తలుపు దగ్గర ఎవరో వస్తున్న చప్పుడువిని చప్పున పుస్తకం తీసి దిండు కింద పెట్టింది పార్వతి.

ఆ వారం రోజులూ జగన్ జీవితంలో మరపురాని మధురమైన మలుపుకు నాంది పలికాయి. డిగ్రీ పూర్తవగానే తనే స్వయంగా రమణరావుగారికి లెటర్ రాశాడు. తను పార్వతిని పెళ్ళిచేసుకుంటానని. పార్వతి మనసు కూడా తెలుసుకున్న రమణరావుగారికి పెద్ద భారం తీరిపోయినట్లైంది. సమస్యగా పరిణమిస్తుందనుకున్న పార్వతి పెళ్ళి అంత త్వరగా తమకు ప్రీతిపాత్రుడైన జగన్నాథ్‌తో జరగడం పార్వతి అదృష్టంగానే భావించాడు. మూగవోయిన పార్వతి జీవితం జగన్నాథ్‌తో ముడిపడటం ఓ అదృష్టంగా అన్పించిందాయనకు.





విషయం విన్న మాలతికి ఒక్కసారిగా సర్వ ప్రపంచం తనను చూసి నవ్వుతున్నట్లనిపించింది. ఇన్నాళ్ళూ జగన్నాథ్‌తో భావిజీవితాన్ని గురించి రంగుల కలలుకంటున్న మాలతికి ఆరోజు జగన్నాథ్ తమ ఇంటికి వచ్చి తన మనసు తెలిపేసరికి ఓ క్షణం అయోమయమైపోయింది.

"మాలా! నాకున్న అతి ముఖ్యులు, సన్నిహితులూ మీరే. అందుకే నా అభిప్రాయం ముందు మీకు చెప్పాలని వచ్చాను. పార్వతిని పెళ్లి చేసుకోవాలని నిర్ణయించుకున్నాను. ఈ రోజే అంకుల్‌కు లెటర్ రాశాను. రాసిన దగ్గర నుంచీ మనసులో ఆందోళనగా వుంది. ఆయన ఏమనుకుంటారో, నా కోరిక ఎలా అర్థంచేసుకుంటారో అని భయంగా వుంది" అంటూ తల కింపకు దించుకొని అరచేతులు రుద్దుకుంటున్న జగన్నాథ్ వైపు పరీక్షగా చూసిన మాలతి కళ్ళనిండా నీళ్ళు నిలిచాయి.

కానీ ఎలాగో అవి అతని కంట పడకుండా తుడుచుకొని చిన్నగా నవ్వుతూ– "ఇందులో మీరింతగా భయపడవలసిందేముంది? బాబాయ్ మీ లెటర్ చదివితే తప్పక సంతోషపడతారు. పార్వతి నిజంగా అదృష్టవంతురాలు..."

ఆ పైన ఎన్నో చెప్పాలనివున్నా మాట పెగలలేదు మాలతికి. మరో పది నిముషాలు కూర్చుని ఏవో కబుర్లు చెప్పి వెళ్ళిపోయాడు జగన్నాథ్.

కానీ జగన్నాథ్ చెప్పిన మాటే మాల చెవుల్లో మారు మోగుతోంది. ఎంత ప్రయత్నించినా, ఆ రాత్రి అతని మాటలూ, అతని రూపం, ఆ చిరునవ్వూ పదేపదే కళ్ళముందు కదలాడి మాల మనసును చిత్రవధకు గురిచేశాయి.

అతని స్నేహాన్నీ, అభిమానాన్నీ, తను ప్రేమగా, అనురాగంగా అర్థంచేసుకోవడం తన తప్పా? లేక తనతో ఎంతో చనువుగా మెసిలి హఠాత్తుగా పార్వతిని పెళ్లి చేసుకోవాలనుకుంటున్నాను – అన్న జగన్నాథ్‌ది తప్పా?

తప్పెవరిదైనా తనకు బాధ తప్పదు. జగన్నాథ్‌ను మనసులో నిలుపుకున్న తను మరొకరితో జీవితాన్ని కలలో కూడా భరించలేదు. మరి దీనికి పరిష్కారం?

తన మనసేమిటో జగన్నాథ్‌కు చెప్పేస్తే? అతను అర్థంచేసుకొని తన అభిప్రాయాన్ని మార్చుకొనేవాడేమో?

అంటే... అంటే... తన స్వార్థం కోసం అర్థాంతరంగా మూగదైన పార్వతి జీవితంలో వచ్చిన అమూల్యమైన అవకాశాన్నీ, అదృష్టాన్నీ చెరిపేయాలను కుంటున్నదా....? ఊహూ! ఎప్పటికీ అలా కాదు. తన జీవితమంతా జగన్ స్మృతిలో మండిపోయినా పర్వాలేదు. కానీ పారూ సుఖపడాలి. పారూ కోసం తనిప్పుడు మూగదానిలా అయిపోవాలి. తను నోరు విప్పితే మనసు బయటపడే ప్రమాదముందనే జగన్నాథ్ వున్నంతసేపూ సాధ్యమైనంత మౌనంగా వుండటానికే ప్రయత్నించింది. ఆ మౌనాన్నే తనింక అతనిముందు ఆశ్రయించాలి. నోరువిప్పి మాట్లాడ్డానికి ప్రయత్నించకూడదు. పార్వతిని భగవంతుడు మూగను చేస్తే, తనని తను మూగనుచేసుకోవాలి ఇప్పుడు.

అలా నిర్ణయించుకున్న మాలతి మౌనంగా జరుగుతున్నదంతా ఓ ప్రేక్షకురాలిగా చూస్తూండిపోయింది. సురేంద్ర కూడా మరో నెలలో అమెరికా నుంచి

వస్తున్నారని తెలిసి, అన్నయ్య వచ్చిన తర్వాతే పెళ్ళిచేసుకుంటానన్న పార్వతి ఇష్టప్రకారం మూహూర్తాలు పెట్టుకున్నారు.



పెళ్ళికి వారం రోజులముందే అమెరికా నుంచి వచ్చిన సురేంద్ర ఒంటరిగా రాలేదు. వెంట మార్గరెట్ ను తీసుకొచ్చాడు. తన కంపెనీలో సెక్రటరీగా పనిచేస్తూండేదనీ, ఇండియా అన్నా, ఇండియన్సన్నా ప్రాణమనీ, అందువల్లే ఆమెతో స్నేహం కలిసిందనీ, ఓ సందర్భంలో అనుకోకుండా ఆమెను పెళ్ళిచేసుకోవాల్సి వచ్చిందనీ చెప్పిన కొడుకును ఏమీ అనలేకపోయినా ఒక్కమాటైనా తమకు చెప్పకుండా పెళ్ళిచేసేసుకుని భార్యను వెంటబెట్టుకొచ్చిన కొడుకుమీద ఓ రకమైన విరక్తి కలిగింది రమణరావుగారి మనసులో. తనను చూడగానే కళ్ళనిండా నీళ్ళు నింపుకున్న పార్వతి దగ్గరకు వచ్చి ఆప్యాయంగా భుజాల చుట్టూ చేయివేసిన సురేంద్ర కళ్ళలో కూడా నీళ్ళు తిరిగాయి.

"ఎన్నాళ్ళకోమళ్ళీనిన్ను చూస్తున్నాను పారూ! నీ పాటలు వినాలని మీ వదినను పూరిస్తూ తీసుకు వచ్చాను. తనకూ మ్యూజిక్ అంటే చాలా ఇష్టం. నీ కాసెట్స్ పెట్టుకొని రోజూ వింటూంటాం..."

ఇంకా నవ్వుతూ మాటలు పొడిగించబోయిన సురేంద్ర ఒక్కసారిగా తన గుండెలమీద వాలిపోయి బావురుమంటున్న పార్వతి వైపు, చుట్టూ నిలబడి కళ్ళుతుడుచుకుంటున్న అందరివైపూ ఆశ్చర్యంగా చూశాడు.

"అన్నయ్యా! ముందువెళ్ళి మీ లగేజ్ వ్యవహారం చూడరా. మేం కారులో వుంటాం" అంటూ బలవంతంగా పార్వతిని నడిపించుకు వెళుతున్న మాలతి వైపు చూస్తూ - "వాట్స్ రాంగ్ విత్ హర్" అంది మార్గరెట్.

రమణరావుగారు వివరంగా జరిగిన యాక్సిడెంట్ గురించీ, పార్వతి మాట పోవడం గురించీ చెప్పారు. అది విన్న సురేంద్రకు కళ్ళవెంటతప్పనరాలుతున్న కన్నీళ్ళనుచూసి మెల్లగాఅన్నారు-

"ఓరకంగా పార్వతి అదృష్టవంతురాలురా... మాట పోగొట్టుకున్నా యాక్సిడెంటల్ గా మంచి ముత్యంలాంటి జగన్ ప్రేమకు పాత్రురాలు కాగలిగింది. అతనితో దాని జీవితం ముడిపడటం వల్ల పార్వతిని సంతోషంగా చూడగలుగుతాము. ఆ యాక్సిడెంట్ అయింతర్వాత దాన్ని నవ్వించి మళ్ళీ మనమల్లో పడేయగలిగింది అతనే. అందుకే అతను పార్వతిని పెళ్లి చేసుకుంటాననగానే మరో మాట లేకుండా అంగీకరించాం"

తండ్రి మాటలు పూర్తిగా సురేంద్ర చెవుల్లో పడ్డా మనసుకు ఎక్కడంలేదు. తనచెల్లెలు, తనంటే ప్రాణంలా చూసుకొనే చెల్లెలు మూగదైందన్న వార్త అంత హఠాత్తుగా జీర్ణించుకోలేక పోతున్నాడు. ఎంత చక్కని గొంతు పారూది! ఇంక తను వినలేదు. బాధ, కోపం మిళితమైన స్వరంతో అడిగాడు సురేంద్ర-




"యాక్సిడెంట్ జరగ్గానే నాకెందుకు తెలియజేయలేదు. నేను పారూని అమెరికా తీసుకెళ్ళి బాగుచేయించేవాడిని. ఆ తర్వాతైనా నాకు మాలతిగానీ, మీరుగానీ, ఎవ్వరూ రాయలేదు. నేనసలు మీకు గుర్తున్నానా?"

"అదేం మాటరా! అంత దూరాన వున్న నీకు తెలిపి బాధపెట్టడం ఎందుకని రాయలేదు. 'వచ్చిన తర్వాత ఎలాగా తెలుస్తుంది. ఇప్పటినుంచే తెలిపి అక్కడెక్కడో వున్న అన్నయ్య మనసుకు శాంతిలేకుండా చేయడమెందుకు రాయవద్దు నాన్నా!' అని పారూ, మాలా ఇద్దరూ నా చేతులు కట్టేశారు. అయినా ఇక్కడ వున్న మమ్మల్నందర్నీ మరిచిపోయి ఒక్కమాటైనా చెప్పకుండా, పెళ్ళి చేసుకొని భార్యను వెంటబెట్టుకు వచ్చిన నువ్వు చేసిన పనికంటే తప్పుగా అన్పిస్తోందా మా పని నీకు?" అంటూ అడుగుతున్న తండ్రి మాటలకు తల వంచుకున్న సురేంద్ర-

"క్షమించండి డాడీ! మీకు ముందుగా చెప్పకపోవడం తప్పే. కానీ అప్పటికే సమయం మించిపోయింది. మార్గరెట్ తల్లి కాబోతోంది. ఆ పరిస్థితుల్లో మీకు రాసి మీ అనుమతి తీసుకునే టైమ్ లేకపోయింది. క్లుప్తంగా పెళ్ళి చేసేసుకున్నాము. వెంటనే బయలుదేరటంతో నాతోపాటు తననీ తీసుకురావాల్సి వచ్చింది" అంటున్న సురేంద్రవైపు చూసి రమణరావుగారు దీర్ఘంగా నిట్టూర్చారు.

ఎంత మారిపోయింది ప్రపంచం. ఆ అమ్మాయి తల్లి కాబోతోందని తెలిసిన తర్వాతగానీ పెళ్ళిచేసుకోవాలని తోచలేదన్నమాట వీడికి.

మారుతున్న ప్రపంచంలో మారిన మనుషులు వీళ్ళు. వీళ్ళను అర్థంచేసుకొని ఆదరించడం, అభిమానించడం తన లాంటి వాళ్ళు నేర్చుకోక తప్పదు.

మౌనంగా కొడుకుని అనుసరించి లగేజ్‌తో పాటు వచ్చి కారెక్కారు. దారి పొడుగూతా ఎవ్వరూ మాట్లాడలేదు. చెల్లెలి పక్కనే కూర్చొని తను కన్నీళ్లు కారుస్తూ, చెల్లెలి కన్నీరు తుడుస్తున్న సురేంద్ర వైపు విచిత్రంగా చూసింది మార్గరెట్. ఆమెకు ఏమీ అర్థం కావడంలేదు.

భార్యను వెంటబెట్టుకు వచ్చిన కొడుక్కు ఎంతగొప్పగా స్వాగతమిస్తారో అనుకుంది. తనను చూసి కూడా ఎవరూ సంతోషంగా పలకరించలేదు. ఏదో తప్పనిసరిగా మాట్లాడుతున్నట్లుంది. వాళ్ళలో వాళ్లు ఏం మాట్లాడుకుంటున్నారో తెలియదు. ఎందుకా అమ్మాయి ఏడుస్తోంది? సురేంద్ర కళ్లు తుడుచుకోవడం మరచి, చివరికి తన వునికిని కూడా మరచి చెల్లెల్ని ఓదార్చే పనిలో వున్నాడు..... ఆ పరిస్థితి మార్గరెట్‌కు చికాగ్గా అన్పించింది. తమను ఎంతో సంతోషంగా రిసీవ్ చేసుకుంటారనుకున్నవాళ్ళంతా అలా ముభావంగా, విచారంగావుండటం ఆమెకు నచ్చలేదు. ఇండియన్స్‌కు బొత్తిగా మేనర్స్ తెలీదు కాబోలు అనుకుంది మార్గరేట్. ఇండియన్ కల్చర్ గురించీ, ఇండియన్స్ గురించీ ఎంతో గొప్పగా వూహించుకున్న మార్గరెట్ మనసులో వాళ్ళ ప్రవర్తన అసంతృప్తినే కలిగించింది.

ఎవరికి వారే ఆలోచనల్లో మునిగి వుండగానే కారు ఇల్లుచేరింది. మధ్యాహ్నానికి వచ్చిన జగన్నాథ్ ఆ వాతావరణంలో మార్గరెట్‌ను ఆకర్షించాడు. అతనితో మాట్లాడుతుంటే టైమ్ ఎలా పాస్ అయిందో తెలీలేదు. ఆ సాయంత్రానికి

వాతావరణంలో కావలసినంత మార్పు వచ్చింది. అందర్నీ నవ్విస్తున్న జగన్ అంటే సురేంద్రకు కూడా స్నేహభావం కలిగింది.

మరో వారం రోజుల్లో పార్వతీ, జగన్‌ల వివాహం వైభవోపేతంగా జరిగింది. జగన్ తరపున అతని మిత్రులు కొందరు వచ్చారు.

ఆ మూడు రోజులూ పెళ్ళి ముచ్చట్లు అన్నీ దగ్గరుండి చూస్తున్న మాలతి హృదయం తీరని బాధకు లోనౌతున్నా పైకి ఎంతో గంభీరంగా వుండటానికి ప్రయత్నించింది. ప్రతి పనికీ తనే ముందుండి అన్నీ జరిపించింది. రోజు రోజుకూ భారమౌతున్న హృదయాన్ని చిక్కబట్టుకొంటూ పెళ్ళైన అయిదో రోజు తల్లితో పాటు బయలుదేరి హైదరాబాద్‌కు వెళ్ళిపోయింది మాలతి.

హైదరాబాద్ చేరిన మాలతి ఆలోచనంతో అస్తవ్యస్తంగా వున్న మనసుకు విశ్రాంతినివ్వాలనీ, ఏదో పనిలో తనను తాను మర్చిపోవాలనీ వుద్యోగ ప్రయత్నాలు మొదలుపెట్టింది. తన ఫ్రెండ్ సుమన సహాయంతో వాళ్ళ ఫాక్టరీలో టైపిస్ట్‌గా చేరిపోయింది. సరదాకు నేర్చుకున్న టైపురైటింగ్, షార్ట్ హాండ్ అవసరానికి వుపయోగపడ్డాయి. ఓ రకంగా ప్రశాంతంగా గడిచిపోతున్నాయి రోజులు. అప్పుడప్పుడూ తల్లి మాలతి పెళ్ళికాలేదని, ఆడపిల్ల సంపాదన తింటూకూర్చోవాల్సివచ్చిందని బాధపడ్డా - మాలతి తన ముందెప్పుడూ పెళ్ళి ప్రసక్తి తీసుకురావద్దని వార్నింగ్ ఇవ్వడంతో మరి చేసేదిలేక తనలో తానే కుమిలిపోతూ మౌనంగా వుండటం నేర్చుకుంది.

పార్వతి పెళ్ళి అయిన సంవత్సరం అంతా ప్రశాంతంగా గడిచిపోయింది. సంపత్ పుట్టాడు. సురేంద్ర, మార్గరెట్‌లకు ఆ సంవత్సరంలోనే సుభ పుట్టింది. వాళ్ళ



ద్దరికీ సంవత్సరం తేడా కూడా లేదు.

ఇండియా అంటూ కలవరించిన మార్గరెట్‌కు ఆరుమాసాల్లోనే ఇండియా మీద మొఖం మొత్తింది. అయినా సురేంద్ర మీద వున్న ఇష్టంతో సుభ పుట్టిన తర్వాత కూడా ఓ రెండు సంవత్సరాలు అలాగే ఓపిక పట్టింది సర్దుకుపోవడానికి. ఏది ఎలావున్నా తనను అత్యంత అనురాగంతో చూసుకునే సురేంద్ర సన్నిధిలో సర్వం మరచిపోయేది. మాట్లాడ లేని పార్వతి వల్ల ఆమెకు ఏ గొడవలూ లేవు.

అయితే సురేంద్ర స్టార్ట్ చేసిన కంపెనీలో జగన్నాథ్‌ను సమభాగస్తుడిగా మావగారు నిర్ణయించడమే మార్గరెట్‌కు నచ్చలేదు. ఈలోపు పార్వతికి సాగర్ పుట్టాడు. తన కొడుకులిద్దరితోపాటు సుభ బాధ్యతకూడా ఆనందంగా స్వీకరించింది పార్వతి. జగన్నాథ్,సురేంద్రలు మంచి స్నేహితుల్లా కలిసి తిరుగుతూ వ్యాపార విషయాలు చూసుకుంటుండే

తృప్తిగా చూస్తూండేవారు రమణరావు గారు.

ఈమధ్యకాలంలో రెండుమూడుసార్లు మాలతినీ, వాళ్ళమ్మనూ కూడా రప్పించి అక్కడే వుండమనీ, ఏదో సంబంధం చూసి మాల పెళ్ళిచేస్తాననీ ఎన్నో విధాల చెప్పి చూశారు రమణరావుగారు. కానీ మాలతి తనకు పెళ్ళిమీద కోరిక లేదనీ, అందుకు తనని బలవంత పెట్టవద్దనీ స్పష్టంగా ఆయన ఆహ్వానాన్ని తిరస్కరించింది. పార్వతినీ, పిల్లల్నీ చూస్తూంటే తన కూతురికే ఆ అదృష్టం లేకపోయిందని బాధపడేది మాల తల్లి.

మార్గరెట్, పార్వతీ ఒక్కసారే గర్భం ధరించారు. అప్పుడే పార్వతి ఆరోగ్యం బాగా దెబ్బతిన్నది. మార్గరెట్‌కి మొదటి నుంచీ ఇంటి విషయాలమీద, పిల్లల పెంపకంమీద శ్రద్ధ తక్కువ. రెండవ సారి గర్భం రావడంతో మరింత బద్ధకం ఎక్కువయింది.

ఇంటిపనులూ, పిల్లల పెంపకం, మధ్య మధ్య మార్గరెట్‌కి కావలసినవి అందించడంతో పార్వతి మరీ బలహీనంగా తయారయింది. దానికితోడు గర్భిణిగా వుండటంతో పనులు చేయడానికి చాలా అవస్థపడవలసి వచ్చేది. ఏదీ నోరువిప్పి ఒకరికి చెప్పే మనస్తత్వం కాదు. దానికి తగినట్లు మూగతనం. దాంతో తన బాధలూ, వ్యధలూ అన్నీ లోలోపలే అణచుకోవడం అలవాటు చేసుకుంది పార్వతి.

కూతురి బాధ చూడలేక మాలతినీ, వాళ్ళమ్మని వెంటనే బయలుదేరి రమ్మని రాశారు రమణరావుగారు. తప్పనిసరయి కొన్నాళ్లు సెలవుపెట్టి వచ్చిన మాలతికి పార్వతి ఆకారంచూసి కళ్ళలో నీళ్లు తిరిగాయి. జగన్నాథ్ అనురాగంతో తన మూగతనాన్ని మరిచి ఆనందతరంగాల్లో తేలుతున్న పిల్లలూ, బాధ్యతలూ మధ్య మధ్య మార్గరెట్ అనే సూటిపోటిమాటలూ పార్వతిని కృంగదీశాయని అర్థమైంది.

రెండు మూడు సంవత్సరాల్లోనే తెలుగు బాగా నేర్చుకుంది మార్గరెట్. అయితే ఆ తెలుగు పార్వతిని హింసించడానికి మాత్రమే వుపయోగపడుతోంది. ఆ సంగతి వచ్చిన రెండోరోజే గ్రహించిన మాలతి సాధ్యమైనంత వరకూ పార్వతిని మార్గరెట్ బారినుంచి తప్పిస్తూ, పార్వతిని పూర్తిగా విశ్రాంతి తీసుకొమ్మని పిల్లల బాధ్యత తను తీసుకుంది. ముగ్గురూ చిన్న పిల్లలు కావడంతో చాలా అవస్థగా వుండేది. తల్లి వంటపని చూసుకుంటుంటే పిల్లల పనులూ, అందరికీ అన్నీ అమర్చి పెట్టే పనులూ తనమీద వేసుకుంది. బాబాయి ముఖం చూసీ, పార్వతి పరిస్థితి చూసీ, పార్వతి ప్రసవించే వరకూ అక్కడే వుండటానికి అంగీకరించింది మాలతి.

"పారూ! నేనున్నంతవరకూ నువ్వేదయినా పనిచేయడానికి ప్రయత్నించావా నేను వెంటనే హైదరాబాద్ వెళ్ళిపోతాను. మళ్ళీ జన్మలో నా ముఖం చూపించను. నేను చెప్పిన మాట విని రెస్ట్‌తీసుకో. నీ ఆరోగ్యం ఎంతగా పాడయిపోయిందో నీకు తెలీడంలేదు. వెంట వెంటనే ఇద్దరు పిల్లలు. మళ్ళీ ఇప్పుడు గర్భం ... నీకు తెలీకపోతే జగన్‌కయినా తెలీదా?"

"హల్లో మాలా! ఎప్పుడు వచ్చారు?" అంటూ ప్రవేశించిన జగన్నాథ్ మాటతో మాలతి మాటలకు బ్రేక్‌పడింది.

"పొద్దుటే వచ్చాం" అంటూ కళ్ళెత్తి జగన్నాథ్‌ని చూసిన మాలతి కళ్లు రెప్ప





కొట్టడం మర్చిపోయాయి. మునుపటి కంటే అందంగా, హుందాగా ఫుల్ గ్రీన్ సూట్‌లో ఎదురుగా నిలబడ్డ జగన్ వేపు ఓ క్షణం మైమరచినట్లే చూస్తూండిపోయిన మాలతి అంతలోనే తనని తాను సంబాళించుకుంటూ చూపులు తిప్పేసింది. పార్వతిని చూస్తూ – "ఏమిటిది? ఇది పార్వతేనా? చూడండి ఎలాతయారైందో.." అంటున్న మాలతి మాటలు మధ్యలోనే కట్ చేసి నవ్వుతూ పార్వతి మంచం దగ్గరకు వచ్చి పార్వతి తలమీద చేయి వేశాడు జగన్నాథ్.

"మాలా! నా తప్పేంలేదు. నిజానికి పార్వతి ఆరోగ్యం దృష్ట్యా నేను సంపత్‌తోనే ఫుల్‌స్టాప్ పెట్టాలనుకున్నాను. కానీ తనకింకో పాప కావాలంది. సరేననక తప్పలేదు. రెండోసారి కూడా బాబే పుట్టే సరికి మరొక్క ఛాన్సు చూడాలనీ, ఈ ఒక్కసారికి వదిలేయమనీ ఆపరేషన్‌కు అభ్యంతరంచెప్పి నన్ను బలవంతంగా ఒప్పించింది...

ఇప్పుడు పార్వతిని చూస్తుంటే నేను చాలా పొరపాటు చేశాననిపిస్తోంది. తన మాటకు నేను అంగీకరించకుండా వుండాల్సింది. ఇంతగా ఆరోగ్యం దెబ్బ తింటుందనుకుంటే ఈ పరిస్థితికి రానిచ్చివుండే వాడిని కాదు."

జగన్నాథ్ వైపు చూసి నవ్వుతూ డైరీ తీసి రాసింది పార్వతి–

"ఈసారి తప్పకుండా పాపే పుడుతుంది. పేరు కూడా నిర్ణయించేశాను 'రాధ' అని. ఇద్దరు అన్నల ముద్దుల చెల్లెలు అవుతుంది"

ఆ మాటలు చదివి పెద్దగా నవ్విన జగన్నాథ్ వైపే చూస్తూ చిరునవ్వు తొలికిస్తున్న పార్వతి వైపు చూసిన మాలతికి ఆ కళ్ళలోని వెలుగు రేఖలు పార్వతికి ఆడపిల్లలంటే వుండే ఇష్టాన్ని చెప్పక చెప్పినట్లైంది. అందుకే కాబోలు సుభని క్షణం వదలదు. సురేంద్ర అన్నయ్యకు కూతురు పుట్టిన దగ్గరనుంచీ పెంచడం పూర్తిగా పార్వతి పనే అయ్యింది. "మీ వదినకు బొత్తిగా పిల్లల్ని పెంచడం తెలీదే మాలా" అంటూండేవాడు సురేంద్ర నవ్వుతూ.

నిజానికి పిల్లల్ని పెంచడం పార్వతికి మట్టుకేం తెలుసు? అలవాటు చేసుకుంటే అన్నీ అలవాటవుతాయి–అనుకుంది మాల అప్పుడే.

ఇప్పుడు పార్వతి మనసులోని కోరిక జగన్ నోట విన్నాక "పార్వతి కోరిక తీరాలి. ఈసారి తప్పకుండా ఆడపిల్ల పుట్టాలి" అని కోరుకుంది మాలతి.

మరో మూడు మాసాలకు పార్వతికి నెలలు నిండాయి. మనిషి మరీ నీరసంగా తయారైంది. పొద్దుట లేచిన దగ్గర నుంచీ పార్వతి విపరీతంగా బాధపడుతోంది. జగన్ ఆరోజు ఆఫీసుకు కూడా వెళ్ళక పార్వతి పక్కనే కూర్చున్నాడు. డాక్టర్ వచ్చి చూసి వెంటనే హాస్పిటల్‌కు తీసుకెళ్ళాలని చెప్పడంతో హడావుడిగా హాస్పిటల్‌కు తీసుకువెళ్ళారు.

ఎందుకో పార్వతి మానసికంగా చాలా బలహీనంగా తయారైంది. జగన్ చేయి వదిలిపెట్టడం లేదు. మనసులోని భయాలూ, బాధ్యతలూ చెప్పలేని అశక్తత! మాటిమాటికీ క్రిస్నీరు నింపుకుంటున్న పార్వతిని చూసిన జగన్‌కు కూడా ధైర్యం సన్నగిల్లింది. ఆపరేషన్ చేయాలన్నారు డాక్టర్. "నీకేం భయంలేదు



పారూ! నీకు కష్టం తగ్గించడం కోసమే డాక్టర్ ఆపరేషన్ చేసి పాపను తీయాలన్నారు. మామూలుగా అయితే నువ్వు అంత శ్రమకు ఓర్చుకోలేవని ఇలా చేస్తానన్నారు. నీకేం భయం నేనుండగా!" అని ధైర్యం చెప్పాడు.

ఆపరేషన్ జయప్రదంగా ముగిసింది. పార్వతి కోరిక మేరకు అందాల చిన్నారి రాధ పుట్టింది. ఆనందానికి అవధులు లేవు. స్పృహ రాగానే నీరసంగా బెడ్ మీద పడుకొని వున్న పార్వతి వైపు చూసి చిన్నగా నవ్వుతూ అన్నాడు జగన్నాథ్-

"మొత్తానికి పంతం నెగ్గించుకున్నావు. ఇంకా నిన్ను శ్రమపెట్టడం దేనికని ఆపరేషన్ నేనే చేయించుకోవాలని నిర్ణయించుకున్నాను. ఇంక నువ్వు నిశ్చింతగా వుండు పారూ ! నీ చిన్నారి రాధను నీలాగే గొప్ప గాయనిగా చేద్దాం"

తన తల నిమురుతున్న జగన్ చేయి తన చేతుల్లోకి తీసుకుని కళ్ళకద్దుకొని ముద్దుపెట్టుకుంటూ సన్నగా నవ్వుతున్న పార్వతి కన్నుల్లో కన్నీటి తళుకులు !

"ఈ శుభ సమయంలో కంటతడి పెట్టడమేమిటి? నీ కోరిక తీరిందిగా" అంటున్న జగన్ వైపు తృప్తిగా చూస్తూ తల వూపింది పార్వతి.

"నీ పంతం నెగ్గించుకున్నావే మొత్తానికి. ఈసారి అన్నయ్యకు మగపిల్లాడు కావాలంట. చూద్దాం వదినే మంటుందో. పాప మట్టుకు ఎంత బాగుందో చెప్పలేను. నీ సంపత్, సాగర్ దానిముందు ఎందుకూ పనికిరారు" అంటున్న మాలతి మాటలకు చిన్నగా నవ్వి వాళ్ళెక్కడ అన్నట్లు సైగ చేసింది.

"వాళ్ళు వస్తే గొడవ చేస్తారని పిన్ని దగ్గర వదిలేసి వచ్చామమ్మా! పైగా అంతా వచ్చేస్తే మీ వదిన, సుభ ఒంటరిగా వుంటారని వాళ్ళను కూడా ఇంటి దగ్గరే వుంచేశాము. ఇప్పుడెలా వుందమ్మా? పెద్ద గండం తప్పిందని చెప్పారు డాక్టర్" అంటున్న రమణ రావుగారి వైపు చూసి ఫర్వాలేదని సైగ చేసింది పార్వతి.

ఉయ్యాల దగ్గరకు వెళ్ళి పాపను చూసి వచ్చిన సురేంద్ర నవ్వుతూ-

"పారూ! ఇప్పుడు మీ వదినకు బాబు పుడితే ఇది రాధ అన్నావు కదూ! నిజంగా రాధైపోతుంది. ఎందుకంటే మీ వదిన ప్రసవించడానికి ఇంకా నెలరోజులు వుంది. ఒకనెల పెద్దదైనా ఫరవాలేదు. ఈ రాధనే నా కోడలిగా చేసుకొంటాను" అంటూనవ్వడంతో అంతా శృతికలిపారు.

అప్పుడే లోపలికివచ్చిననర్సు "ఆమెను రెస్ట్ తీసుకోనివ్వండి. మీరు ఇంటికెళ్ళి రావచ్చిలోపు" అని చెప్పడంతో అంతా బయటకు నడిచారు.

తెల్లవారి కాఫీ తీసుకొని జగన్ హాస్పిటల్‌కు వచ్చేసరికి పరిస్థితి అంతా గందరగోళంగా వుంది.

"పారూకు ఒక్కసారిగా ఆరోగ్యం దెబ్బతింది. ఊపిరి తీసుకోవడం కష్టంగా వుంది" అంటూ ఏడుస్తూ ఎదురొచ్చింది మాలతి. డాక్టర్ అన్ని ఏర్పాట్లూ చేయించి ఆక్సిజన్ ట్యూబ్స్ కూడా ఎటాచ్ చేశారు.

ఎదురుగా ఆత్రుతగా కళ్ళనిండా నీళ్ళతో చూస్తున్న మాలతి వైపూ, జగన్ వైపూ మార్చిమార్చి చూసింది పార్వతి. పక్కన వుయ్యాలలో వున్న పాపవైపు చూపి, ఏదో చెప్పడానికి ప్రయత్నించి,

తన అశక్తతకు కళ్ళనిండా నీరు నింపు కుంది.

"భయపడకు పారూ! నీకేం ఫర్వా లేదు. మరో అరగంటలో అంతా మామూలుగా వుంటుందన్నారు డాక్టరు" అంటూ పార్వతి తలమీద చేయి వేసిన జగన్ కంఠం సన్నగా వణికింది. జగన్ చేయి చేతుల్లోకి తీసుకుని అతి ప్రయత్నంమీద గుండెల మీదకు చేర్చుకొని కళ్ళు మూసుకుంది పార్వతి. మూసిన కళ్ళనుంచి కన్నీరు పక్కలకు జారి దిండులోకి ఇంకిపోయింది.

మరో పది నిముషాలకు పరీక్షచేసిన నర్సు డాక్టర్స్ కోసం పరుగెత్తింది. డాక్టర్ వచ్చి పరీక్షచేసి ఆక్సిజన్ కనెక్షన్ తీసి మౌనంగా బయటకు నడిచారు. "అయామ్ సారీ" అని వెళ్ళిపోతున్న డాక్టర్ వైపు చూసిన జగన్నాథ్ పార్వతి మంచం దగ్గరకు నడిచాడు. అప్పటికే అక్కడికి చేరుకున్న మాలతి హృదయ విదారకంగా ఏడుస్తోంది.

"మాలా! పారూ అదృష్టవంతురాలు. తన కోరిక తీర్చుకొని వెళ్ళిపోయింది. తన గుర్తుగా పాపను నాకొప్పజెప్పి వెళ్ళిపోయింది. మూడుముళ్ళతో నేను వేసిన బంధానికి మూడుబంధాల్ని నాకు బిగించి తన దారి తను చూసుకుంది" అంటూ స్వప్నావస్థలో వున్నట్లుగా పార్వతి వైపు చూస్తూ ఏమేమిటో మాట్లాడుతున్నాడు జగన్.

"అన్నయ్యకు ఫోన్‌చేసి వస్తాను" అంటూ ముందుకు నడిచింది మాలతి. నాలుగు అడుగుల్లోనే ఎదురుగా సురేంద్ర కనిపించాడు.

హడావుడిగా వస్తూ "మాలా! మీ వదిన్ని హాస్పిటల్లో చేర్పించాను. తనకు తెల్లవారుఝామునుండీ పెయిన్స్ స్టార్ట్ అయ్యాయి. ఆ పక్కరూమ్‌లో వుంది. పారూ కెలావుంది?" అని అడుగుతున్న సురేంద్ర భుజంమీద చేయివేసి-

"అన్నయ్యా! పారూ మనల్ని అన్యాయం చేసి వెళ్ళిపోయింది" అంటూ ఏడవడం మొదలెట్టింది.

మాలతిని విదిలించుకుని గదివైపు అడుగులేసిన సురేంద్ర నిశ్చలంగా పడుకొనివున్న పార్వతినీ, పిచ్చివాడిలా ఆ ముఖాన్ని చేతుల్లోకి తీసుకొని కన్నీరు కారుస్తున్న జగన్‌నూ చూసి ఒక్కసారిగా షాక్ తిన్నట్లు అయ్యాడు. నెమ్మదిగా మంచం దగ్గరకు నడిచాడు. అతని వెనుకే లోపలికి వచ్చిన మాలతి పాపను వుయ్యాల లోపల పడుకోబెట్టి సురేంద్ర దగ్గరగా నడిచింది.

"మాలా! ఇది...ఇదెలా జరిగింది? నేనమ్మలేనమ్మా..." అంటూ పసిపిల్లవాడిలా ఏడుస్తున్న సురేంద్ర భుజంమీద చేయి వేసి అతన్ని ఓదార్చడానికి ప్రయత్నించింది.

"అవునన్నయ్యా! ఎదురుగా లేకపోతే నేనూ నమ్మివుండేదాన్ని కాదు. అందర్నీ నమ్మించి మోసం చేసింది. పూర్తిగా కోలుకుంది ఇంక ఫర్వాలేదనుకున్న పరిస్థితుల్లో పరిస్థితి విషమించింది.. అక్కడ వదినకెలా వుందో! ముందు జరగవలసిన కార్యక్రమాలు చూడన్నయ్యా! బతికివున్నవాళ్ళకు బాధ్యతలు తప్పవుగా! జగన్ చూడు ఎలా వున్నారో? ముందు ఆయన్ని లేపు. బాబాయ్ ఈ షాక్ ఎలా తట్టుకుంటారో నాకు భయంగా వుందిరా" అంటూ అప్పటివరకూ ధైర్యం చెప్పిన మాలతి తనని తాను కంట్రోల్ చేసుకోలేక భోరు

మంది.

ఏదిఏలాగున్నా జరగవలసిన కార్యక్రమాలు ఆగవు.



రమణరావుగారికి కూతురి మరణం పెద్ద షాక్. పార్వతి మరణానికి కారణమైన పాప రాధంటే అందరూ ఒకరకమైన విరక్తి పెంచుకున్నారు.కానీ విచిత్రంగా జగన్ ఆ పాపలో పార్వతిని చూసుకుంటూ ఆ పాప దగ్గరే కూర్చుంటున్నాడు ఎక్కువగా.

పార్వతి కాలిబూడిదైన సమయంలోనే మార్గరెట్ ప్రసవించింది. మళ్ళీ పాప పుట్టింది. పాప పుట్టినవేళా, పార్వతి పోయినవేళా ఒక్కటే కావడంతో సురేంద్రకు ఆ పాప మీద కలగవలసిన ప్రేమ కలగలేదు. అందుకు మార్గరెట్ కు చాలా కష్టం కలిగింది.

ఆ పరిస్థితుల్లో తప్పనిసరిగా మాలతి తల్లితోపాటు కొంతకాలం ఉండక తప్పలేదు. పసిపిల్లలకు సరైన పోషణ అవసరం. మార్గరెట్ బాలింత కావడం, ఇంట్లో మరో ఆడదిక్కు లేకపోవడంతో పిల్లల్ని చూసుకోవలసిన బాధ్యత మాలతి స్వీకరించక తప్పలేదు.

రమణరావుగారు మాలని ఉద్యోగానికి రాజీనామా ఇవ్వమన్నారు. మాలకు అయోమయంగా వుంది. ఆ పరిస్థితుల్లో వాళ్ళను వదిలి వెళ్లాలనీలేదు. జగన్ బాధ చూస్తూ అతని ఎదురుగా తిరగగల ధైర్యమూ లేదు. అడకత్తెరలో పోక చెక్కలా ఉంది పరిస్థితి. తల్లికి ఇంట్లో పనితో సరిపోతుంది. పిల్లల్ని చూసుకోడానికి, మార్గరెట్ కు, రమణరావుగారికి, జగన్ కు వేళకు అన్నీ అమర్చడానికీ ఎక్కడిటైమూ చాలడం లేదు మాలతికి.

రోజులు యాంత్రికంగా గడిచిపోతున్నాయి. ఒక్కోసారి మార్గరేట్ అధికారం చెలాయించడం చూస్తే వెళ్ళిపోవాలన్పిస్తోందిగానీ దీనంగా వున్న బాబాయి ముఖమూ, అమాయకంగా వున్న చిన్నారి పాపల ముఖాలు చూస్తే ఎక్కడలేని సహనము వస్తోంది మాలతిలో.

ఒకటి రెండుసార్లు తల్లి కూడా "మనంహైదరాబాద్ వెళ్ళిపోదాం మాలా" అంది మార్గరెట్ నిర్లక్ష్య వైఖరి చూసి. తల్లికి సర్దిచెప్పింది మాలతి.

"అమ్మా...తెలిసీ తెలీక ఒదిన ఏదో అన్నదని మనం వెళ్ళిపోతే అన్నయ్యా, బాబాయ్ బాధపడతారు. పుడుతూనే తల్లిని దూరం చేసుకున్న దౌర్భాగ్యురాలని రాధను అనాథలా వదిలేసి రమ్మంటావా? కనీసం పిల్లలకు కొద్దిగా ఊహ తెలిసేంతవరకు అయినా మనం వాళ్లను చూసే అవసరం ఉంది. ఆ తర్వాత ఎలాగో వాళ్ళే పెరుగుతారు. అప్పటివరకు వదిన మాటలు పట్టించుకోకు" అంది.

కొద్ది తేడాలో సురేంద్ర కూడా అవే మాటలు చెప్పాడు బాధపడుతూ.

"మీ వదిన మాటలు పట్టించుకోకు మాలా! అసలు కారణం ఆమెకు అమెరికా తిరిగి వెళ్ళిపోవాలని వుంది. అందుకే ఏదో వంకతో అందరి మీదా కోపగించు





కుంటోంది. తనకు బాధ్యత తెలీదు. దానికి తగ్గట్టు ఇద్దరూ ఆడపిల్లలే పుట్టారు. వాళ్ళెలా పెరిగి పెద్దవాళ్ళవుతారో" అంటూ పిల్లల భవిష్యత్‌ను గురించి దిగులుపడే సురేంద్రను చూస్తే జాలితో మాల మనసు కలచివేసినట్లైంది. తల్లీ, తండ్రీ ఇద్దరూ వుండి ఆ పాపల పరిస్థితి అలా వుంటే-తల్లి కరువై, తండ్రి ఆప్యాయతకు కూడా దూరమైన పార్వతి పిల్లల గురించి ఎవరు పట్టించుకుంటారు?

తనని ఎంతో ప్రేమగా చూసిన పార్వతి పిల్లలకు అభిమానం,ఆప్యాయత కరువై అనాథల్లా పెరగటమా ? అస్థవ్యస్థంగా వున్న పరిస్థితుల్ని మరింత అస్థవ్యస్థం చేస్తూ అనుకోకుండా రమణ రావుగారు కన్ను మూయడంతో, మాలతికి దిక్కుతోచకుండా అయింది. పైగా చనిపోయే ముందు మాలతిని దగ్గరకు పిలచి పిల్లలైదుగుర్నీ పెంచ వలసిన బాధ్యత మాలతి మీద పెట్టారు. అందుకు హక్కు కల్పిస్తూ ఆస్థిలో సగభాగం మాలతిపేర పెట్టటమేకాకుండా జగన్‌ను మారేజ్ చేసుకొమ్మని చెప్పారు మాలతితో.

"మాలా! ఇందులో నా స్వార్థం లేకపోలేదు. పార్వతి పిల్లలు అనాథలు కాకుండా ఉండాలంటే జగన్, నువ్వూ ఒక్కటికాక తప్పదు. నాకోసం ఈ త్యాగం నువ్వు చేయక తప్పదమ్మా" అని కన్నీళ్లతో ప్రాధేయపడుతున్న రమణరావుగారికి ఏం సమాధానం చెప్పాలో తెలీలేదు.

"పిల్లల గురించి మీరేమీ బాధ పడకండి బాబాయ్...వాళ్లను నాకంటి పాపల్లా చూసుకుంటాను" అంటూ ఆయనకు ధైర్యం చెప్పడానికి ప్రయత్నించింది.

జగన్ కూడా మావగారి దగ్గర కూర్చుని "అనవసరమైన ఆలోచనలతో మీ మనసు పాడుచేసుకోకండి" అంటూ ధైర్యాన్ని చెప్పటానికి ప్రయత్నించాడు.

ఎవరి ధైర్యవచనాలూ ఆయన మీద పనిచేయలేదు. పిల్లల్ని గురించి దిగులు పడుతూనే కన్నుమూశారు.

రోజులు యాంత్రికంగా గడిచిపోతున్నాయి. మాలతి తన పెళ్ళిమాట మనసులోంచి ఏనాడో తీసివేసుకున్నా బాబాయ్ జగన్‌ను పెళ్ళిచేసుకోమని చెప్పినపుడు మనసు కొద్దిగా చలించింది.

కూతురు ఎవరి కుటుంబానికో అంకితమైపోయి తన భవిష్యత్ పాడు చేసుకున్నదన్న దిగులు మాల తల్లిది. ఆ ఇంట్లో వుండాలంటే ఆమెకు కంటకంగా వుంది. అందుకేచుట్టు పక్కల రెండిళ్లవాళ్లు కలిసి కాశీ, ప్రయాగ లాంటి పుణ్యక్షేత్రాలు తిరిగిరావడానికి వెళుతున్నారని తెలిసి, తనూ వాళ్లతో వెళ్ళివస్తానని పట్టుపట్టింది.

"అమ్మా! ఇక్కడి పరిస్థితులు తెలిసి కూడా నువ్వెలా వెళతానంటే ఏం చెప్పను? నీకామాత్రం అర్థంకావడం లేదా?" అంటున్న మాలకు విసుగ్గా సమాధానం చెప్పింది తల్లి.

"ఎందుకర్థంకావమ్మా! అర్థమవుతూనే వున్నాయి. ఎవరి స్వార్థం వాళ్లు చూసుకుంటూ చక్కగా ఉపయోగించుకుంటున్నారు మనల్ని. కనీసం ఈ వయసులో నన్నా రామా, కృష్ణా అనుకోవద్దంటావా? నువ్వు అన్నీవదులుకున్నావుగానీ ఆ పని నావల్లకాదు తల్లీ. నన్ను తీర్థయాత్రలకు పంపించు. ఆ కాశీనాథుని సన్నిధిలో కాలక్షేపం చేస్తాను. మళ్ళీతిరిగివచ్చి నిన్ను

తిప్పలు పెట్టను. ఆయుష్షు మూడితే ఆ గంగమ్మ ఒళ్లోనే కన్ను మూస్తాను" అంటూ కన్నీళ్లు తుడుచుకుంటున్న తల్లిని చూసి మాల కళ్లలో నీళ్లు తిరిగాయి.

తనేంచేయగలదు? పెళ్ళిచేసుకొని అమ్మ కోరిక తీర్చలేదు. జగన్‌కు అంకితమైన మనస్సు మరొకరికి అర్పించలేదు. ఆ ఊహే భరించలేదు. అతని మనసులో చెరగకుండా వున్న పార్వతి రూపాన్ని చెరపలేదు. పార్వతి పిల్లల్ని అనాథల్ని చేయలేదు. అన్నయ్య సంసారం కూడా అంతంతమాత్రంగానే వుంది. ఏ క్షణాన ఆవిడ అమెరికా వెళ్ళిపోతుందో చెప్పలేము. అప్పుడు ఆ ఇద్దరి పిల్లల బాధ్యత కూడా తనమీదే పడుతుంది. స్వీకరించక తప్పదు. తన బతుక్కు ఆలంబన ఈ పిల్లలు...

ఆలోచనల్లో మునిగి సమాధానం చెప్పని కూతురువైపు కోపంగా చూస్తూ- "నన్ను పంపటానికి నీకు ప్రాణమొప్పదు. నేనిక్కడే చావాలి. నాకు కాశీలో చచ్చే అదృష్టం ఎక్కడ వస్తుంది?" అని పెద్దగా ఏడవడం మొదలెట్టింది.

"అమ్మా! ఏవిటా మాటలు?" అంటుండగానే సురేంద్ర వచ్చాడు.

"మాలా! అమ్మనెందుకు బాధ





పెడతావు. ఈ వయసులో పుణ్యతీర్థాలు చూడాలని వుండటం సహజం. ఎంతకాలమని ఇంటిచాకిరీకి అంకితమై పొమ్మంటావు? నీకు ఇబ్బంది అవుతుం దంటే వంట మనిషిని పెడదాము. అమ్మను వెళ్ళిరానివ్వు. నువ్వు ప్రయాణానికి సిద్ధంకా అమ్మా! నేను కావలసిన ఏర్పాట్లు చూస్తాను" అని చెప్పి వెళ్లాడు సురేంద్ర.

అతని మనసంతా చికాగ్గావుంది. మార్గరెట్ పోరు భరించరానిదిగా వుంది. 'మాలకు ఆస్తిలో భాగం ఎందుకు పెట్టాలి మీ నాన్నగారు?' అని అడుగుతుంది ఈ బాధ్యతల్లో చిక్కుకుని మాల ఎంత నష్టపోయిందో మార్గరెట్ కు ఎలా చెబితే అర్థమవుతుంది? 'ఫాక్టరీలో జగన్‌కు భాగం పెట్టారు. ఆస్తిలో మాలకు భాగం పెట్టారు. ఇండియాలో ఇంకేం మిగిలింది? వున్న తండ్రీ, చెల్లెలూ పోయారు. మనం అమెరికా వెళ్ళిపోదాం' అని అనుక్షణం ఊపిరి సలపనివ్వడంలేదు.

ఈరోజు గొడవ చాలా ముదిరిం "నువ్వు రాకపోతే నే వెళ్ళిపోతాను' అనేంతవరకూ వచ్చింది మార్గరెట్. అమెరికాలో వున్నప్పుడు ఎంత ప్రేమగా వుండేది?

'మీ ఇండియా గురించి పుస్తకాల్లో చదువుతుంటే ఎప్పుడు వెళ్ళి ఆ పవిత్ర దేశంలో వాలాలా అని వుంది సురేన్!' అన్న మార్గరెట్ ఈమేనా? అయిదు సంవత్సరాల్లో ఎన్ని మార్పులు! చెల్లాయి పోవడం, తండ్రిపోవడం ఒకదానివెంట ఒకటిగా తగిలిన షాకులు. ఇవన్నీ

చాలవన్నట్లు ఇప్పుడు మార్గరెట్ గొడవ ఒకటి.

పిల్లల్ని కన్నదనేగానీ, ఎప్పుడూ వాళ్లను దగ్గరకు చేర్చుకున్న పాపాన పోలేదు. ఎంతసేపూ క్లబ్బులూ, సరదాలు. తను ఎంత తిరిగి తిరిగి వచ్చినా చూసుకోడానికి మాలవుంది కనుక సరిపోయింది. లేకపోతే పిల్లల్ని ఆయా సంరక్షణలో వదిలితే ఎలా వుండేవాళ్లు?

తమ మూలంగా మాల ఎంత నష్టపోతోందో ఆలోచిస్తుంటే గుండె తరుక్కుపోతోంది. జగన్ మాలను చేసుకుంటే మాల జీవితం కూడా సంతోషంగా గడిచే అవకాశం వుంది. కేవలం తమ స్వార్థం చూసుకుంటే మాల భవితవ్యం ఏం కావాలి? ఇవ్వన్నీ ఆలోచించే తండ్రి ఆ నిర్ణయానికి వచ్చి వుంటారు. ఆయన పోయిన దిగులుతో ఇన్నాళ్ళూ మళ్ళీ ఆ ప్రస్తావన ఎవ్వరూ తీసుకురాలేదు.

అయినా ఎవరడగగలరు జగన్‌ను తను తప్ప. ఈరోజే అడగాలి. అప్పుడు మార్గరెట్‌కు కూడా నోటికొచ్చినట్లు మాట్లాడే అవకాశం దొరకదు. ఆ ఆలోచనలతోనే హాయిగా నిద్రపోయాడు సురేంద్ర ఆరోజు.

ఆ తర్వాత రెండు రోజులకు మాల తల్లి తీర్థయాత్రలకు వెళ్ళిపోయింది. ఆమె వుండగానే జగన్నాథ్ అభిప్రాయం కనుక్కొని మాలా జగన్‌ల పెళ్ళి నిశ్చయించాలనుకున్న సురేంద్ర తన అభిప్రాయం చెప్పాడు. కానీ జగన్ అంత ఖచ్చితంగా తన మాట తీసి వేసాడనుకోలేదు.

"సురేన్! అప్పుడే మీ చెల్లెల్ని మర్చిపోగలిగావంటే చాలా అదృష్టవంతుడివి. కానీ నేను... నేను బతికున్నంతకాలం పార్వతిని మర్చిపోలేను. తియ్యటి ఆమె కంఠం నా చెవుల్లో ప్రతిధ్వనిస్తూనే వుంది. మూగగా, ఆరాధనాపూర్వకంగా చూసే ఆ కళ్ళు నన్ను వెంటాడుతూనే వుంటాయి. తన తీపి గుర్తులుగా ముగ్గురు పిల్లల్ని మిగిల్చిపోయింది. ఇప్పుడు నేను మాలను పెళ్ళిచేసుకొని మాల భవిష్యత్తు నాశనం చేయలేను. నిండు మనసుతో ఆమెను ప్రేమించలేని నేను పెళ్లాడటం ద్రోహం" అని అంటున్న జగన్‌కు ఏం బదులు చెప్పగలడు? అందుకే మౌనంగా వుండిపోయాడు.

ఆ తర్వాత మళ్ళీ మాల పెళ్ళి ప్రస్తావన ఎవరూ తేలేదు సురేంద్ర, జగన్‌ల మధ్య. కానీ జగన్‌ను కూడా మాలతిని చూస్తే బాధగా వుండేది. ఆనందంగా, హాయిగా తిరగాల్సిన మాల తమ పిల్లల బాధ్యతను నెత్తిమీద వేసుకొని నిస్వార్థంగా ఆ ఇంటికి అంకితం అవ్వడం చూస్తే అభిమానం పొంగివచ్చేది ఆమెమీద.

రోజులు అలాగే సాఫీగా సాగిపోతే బాగానే వుండేది. కానీ అనుకోకుండా ఫాక్టరీలో గొడవలు వచ్చాయి. ఆ గొడవల్లో కార్మిక పక్షం మాట్లాడిన జగన్ మీద విపరీతమైన కోపం వచ్చింది సురేంద్రకు. మేనేజిమెంట్‌దే తప్పు అని ఎత్తి చూపుతున్న జగన్ తమ ఫాక్టరీ పున్నతికే ఓ కంటకంగా కనిపించాడు. అందుకే ఆరోజు తనేమంటున్నాడో తెలియకుండా నోటికొచ్చినట్లు మాట్లాడేశాడు సురేంద్ర.

"నువ్వసలు మా చెల్లెల్ని చేసుకుందే ఈ ఆస్థికోసం. నాన్నగార్ని మంచి చేసుకొని ఫాక్టరీలో భాగం రాయించుకున్నావు. ఇప్పుడు కార్మికుల్ని మంచి




చేసుకొని ఫాక్టరీ పూర్తిగా స్వాధీనం చేసుకోవాలని చూస్తున్నావు. ఎట్టి పరిస్థితుల్లోనూ నీ స్వార్థబుద్ధిని సాగనీను. ప్రాణ సమానంగా వుండే చెల్లెలే పోయిన తర్వాత నువ్వెవరు? నీకూ, మాకూ ఏమిటి సంబంధం? నేతలచుకుంటే నిముషాలమీద నిన్ను బయటికి పంపగలను" అని సురేంద్ర కోపంగా అరిచి ఫాక్టరీకి వెళ్ళిపోయాడు.

సురేంద్ర మాట్లాడినంతసేపూ మౌనంగా కూర్చున్న జగన్‌ను చూసి భయం వేసింది మాలతికి. జగన్ దగ్గరకు వెళ్ళి "అన్నయ్య ఏదో కోపంతో మాట్లాడాడు. అవ్వన్నీ మనసులో పెట్టుకొని బాధపడకండి జగన్! మళ్ళీ సాయంత్రానికి తనే చల్లబడతాడు" అని చెబుతున్న మాల వైపు చూసి చిన్నగా నవ్వాడు జగన్.

సురేంద్ర మాటలూ, అప్పుడప్పుడూ మార్గరెట్ విసిరే విసుర్లూ జగన్ మనసు మీద బాగా పనిచేశాయ్. పైగా తన పిల్లల బాధ్యత కోసం మాలతి జీవితం మోడు బారిపోవడం తనకిష్టం లేదు. పార్వతి లేని ఇంట తనకేం పని? అందుకే ఓ నిశ్చయానికి వచ్చిన జగన్ ముగ్గురు పిల్లల్నీ తీసుకొని ఆ ఇంటిని వదిలి వెళ్ళిపోయాడు. చెబితే వెళ్ళనివ్వదని మాలతికి కూడా చెప్పలేదు. కానీ ఓ లెటర్ రాసి పెట్టి వెళ్ళిపోయాడు మాలతికి.

పసిపిల్లలు ముగ్గుర్నీ తీసుకెళ్ళి ఎక్కడ ఏ అవస్థలుపడుతున్నాడో అని మాలతి బాధపడని క్షణం లేదు. జగన్ వెళ్ళిపోయిన తర్వాత గానీ సురేంద్రకు తను చేసిన తప్పు తెలిసిరాలేదు. తను తొందరపడి అన్ని మాటలు అని వుండకూడదని, తనలో తనే బాధపడ్డాడు. మాలతి బాధ చూసి మరింత బాధపడ్డాడు. పిల్లల్ని ప్రేమగా పెంచిన మాల, ఒక్కసారిగా ముగ్గురూ దూరం కావడాన్ని భరించలేకపోయింది. ఇక తన అవసరం కూడా ఇంట్లో లేదనిపించింది. సురేంద్రతో ఆ విషయమే చెప్పింది.

"అన్నయ్యా! పార్వతి పిల్లల కోసమే నేనీఇంట్లో వున్నాను. ఇంక ఇప్పుడు వాళ్ళే లేని ఈ ఇంట్లో నా అవసరమేముంది? అమ్మ రాగానే మేము హైదరాబాద్ వెళ్ళిపోతాము" అంది కన్నీళ్ళతో.

సురేంద్ర ఏమీ మాట్లాడలేకపోయాడు. మరో పది రోజులు స్తబ్ధుగా గడిచిపోయాయి. జగన్ ఎక్కడకు వెళ్ళిందీ తెలియలేదు. తీర్థయాత్రలకు వెళ్ళిన వాళ్ళు తిరిగివచ్చారు. కానీ వాళ్లతో పాటు మాల తల్లి తిరిగి రాలేదు. గంగలో స్నానం చేయడానికి వెళ్ళిన ఆమె తిరిగి రాలేదని వాళ్ళు చెప్పలేక చెప్పారు.

ఆ వార్త మాలతి హృదయంమీద పెద్ద దెబ్బతీసింది. రెండు రోజులుగా ఏడుస్తూ పచ్చి మంచినీళ్ళు మింగని మాలను ఓదార్చటం సురేంద్రవల్ల కాలేదు. పైగా రెండు రోజులు మాల పట్టించుకోకపోతే సుభ, సంధ్యల ఆలనా పాలనా చూసే దిక్కు లేకుండాపోయింది.

మార్గరెట్ మరీ మొండిగా తయారైంది. అమెరికా తిరిగి వెళ్ళిపోవాలనే కోర్కె ఆమెలో ప్రబలమైంది. ఎప్పుడు చూసినా ఏడుపులూ, మొత్తుకోళ్ళు తప్ప సుఖం, సంతోషం లేని ఇండియాలో నేనుండలేనంటూ అమెరికా వెళ్ళే ఏర్పాట్లలో మునిగివుంది. మనశ్శాంతి పూర్తిగా కరువైంది.

ఏంచేయాలో, మార్గరెట్‌కు ఎలా

నచ్చజెప్పాలో తెలీని సురేంద్ర మౌనంగా వుండిపోయాడు.

పిల్లలిద్దరిలో ఒకర్ని తనతో తీసుకుపోతానన్న మార్గరెట్ మనసులో తల్లి ప్రేమకంటే చెరొకళ్ళనీ పంచుకోవాలన్న ఉద్దేశంతప్ప మరేంలేదని గ్రహించిన సురేంద్ర అందుకు ఒప్పుకోలేదు. మొదట తను అడిగితే ఇద్దర్నీ పంపుదామనుకున్న సురేంద్ర మనసు మార్చుకున్నాడు. పిల్లల్ని వదిలివెళితే కనీసం వాళ్ళకోసమైనా మార్గరెట్ తిరిగి ఇండియాకు వస్తుందన్న ఆశ ఏ మూలో వుండటంతో పిల్లల్ని తన దగ్గరే వుంచుకుంటానన్నాడు. మార్గరెట్ ఆ విషయంలో వాదన పెంచుకోలేదు. పిల్లల్ని మొదటి నుంచీ ఆమె పెంచలేదు. వాళ్ళు మాలకు బాగా అలవాటయ్యారు.

తను తీసుకెళ్ళినా, వెళ్ళిన వాడానికే ఆంటీని చూడాలంటే తను తిరిగి ఇండియా రావాల్సి వుంటుంది.

మార్గరెట్ వెళ్ళిపోయి, ఫాక్టరీలో అన్నీ సమర్థించుకుపోయే జగన్ తోడు లేక తండ్రినీ, చెల్లినీ పోగొట్టుకున్న సురేంద్రను ఒంటరిగా ఆ ఇద్దరు పిల్లలతో ఒదిలివెళ్ళలేకపోయింది మాలతి. అయినా ఎక్కడికి వెళుతుంది? తల్లి కూడా తోడు లేకుండా వెళ్ళి అనాథలా ఎక్కడ వుండగలదు?

అందుకే సురేంద్ర పిల్లల పెంపకంలో తన బాధలు మరిచిపోవానికి ప్రయత్నించింది.

ఆ ప్రయత్నంలో కొంతవరకూ కృతకృత్యురాలైంది. కానీ మళ్ళీ ఒక్కసారైనా జగన్‌నూ, పిల్లల్నీ చూడగలిగితే అన్న ఆశ మనసులోపల మెదులుతూనే వుంది. సంవత్సరాలు గడిచిపోతున్నా మళ్ళీ జగన్‌నుకానీ, అతని పిల్లల్నికానీ చూసే అవకాశం కలగలేదు మాలతికి. సుభ, సంధ్య పెరిగి పెద్దవాళ్ళయినారు. ఎలాగైనా మాలతి పెళ్ళిచేసి తన బాధ్యత తీర్చుకోవాలని ఎంతో ప్రయత్నించాడు సురేంద్ర. కానీ మాలతిని పెళ్ళికి వప్పించడం సాధ్యంకాలేదు.

"నీకు నేను బరువుగావుంటే చెప్పన్నయ్యా ఎక్కడికైనా వెళ్ళిపోతాను" అంటున్న మాలను మరీ బలవంతపెట్ట దలచుకోక ఆమె ఇష్టప్రకారం వదిలేయక తప్పలేదు.

జీవితంలో ఏ సుఖాలూ నోచుకోని మాలతి సుభా, సంధ్యల పెంపకంలో మనసును లగ్నంచేసి వాళ్ళను క్రమశిక్షణతో పెంచి, పెద్దమ్మాయి శుభకు యుక్తవయసు రాగానే ఆమె మనసు తెలుసుకొని, ఆమె ప్రేమించిన రాకేష్‌తో పెళ్ళి జరిపించింది. ఇక మిగిలింది సంధ్య. ఇద్దరిలోకీ అందమైన, చురుకైన సంధ్య అంటే మాలతికీ, సురేంద్రకూ కూడా చాలా ఇష్టం. తల్లి రంగూ, తండ్రి పోలికలతో పుట్టిన సంధ్య కాలేజి బ్యూటీగా పేరు తెచ్చుకుంది.



దాదర్ స్టేషన్ దగ్గరవుతుంటే ఆత్రంగా కిటికీ దగ్గరచేరి స్టేషన్‌వైపు చూస్తూ





కూర్చున్నాడు సాగర్.

ప్లాట్‌ఫారం మీద బండి ఆగీ ఆగక ముందే సామానులకోసం ఎగబడే కూలీల మధ్యనుంచీ "హల్లో సాగర్! ప్రయాణం ఎలా జరిగిందీ?" అంటూ దూసుకొనివచ్చి సాగర్‌ని అమాంతం వాటేసుకొని ఉక్కిరిబిక్కిరి చేశాడు రాకేష్. సాగర్ మనసు ఆనందంతో నిండి నోటినుండి మాట రాలేదు. అలాగే ఓ చేత్తో సూట్ కేస్ వుంచుకొనే ఆప్యాయంగా స్నేహితుడి కౌగిట్లో బందీ అయ్యాడు.

"ఊ!...పద వెళదాం!" అంటున్న రాకేష్‌ను అనుసరించాడు సాగర్.

"నాన్నగారెలా వున్నారు? చెల్లాయి రాధ అల్లరంతేవుందా కాస్త ఏమైనా తగ్గిందా? సంపత్ అన్నయ్య విషయా లేమైనా తెలుస్తున్నాయా?" అంటూ ప్రశ్నలవర్షం కురిపిస్తున్న రాకేష్‌కు నవ్వుతూ సమాధానం చెబుతూ నడుస్తు న్నాడు సాగర్.

స్టేషన్ బయటకు రాగానే స్టాండ్‌లో పెట్టివున్న మోటార్‌బైక్ దగ్గరకు నడిచి స్టాండ్‌తీసి బైక్ స్టార్ట్‌చేశాడు రాకేష్.

"ఊ... ఎక్కరా! ఏమిటింకా దిక్కులు చూస్తున్నావు? బొంబాయి మహానగరాన్ని తీరిగ్గా చూడవచ్చులే... కమాన్!" అనడంతో నవ్వుతూ బైక్ మీద కూర్చున్నాడు సాగర్.

బొంబాయి నగరవైభవాన్ని చూస్తూ బైక్ శబ్దంలో వినిపించకుండావున్నా ఏదో ఒకటి వాగుతున్న రాకేష్‌తోపాటు మాట్లాడుతూండగానే చెంబూర్ చేరింది బైక్.

చెంబూర్‌లో అందంగా వున్న బిల్డింగ్స్ మధ్య మూడంతస్థులున్న ఓ ఫ్లాట్ ముందు ఆగింది బైక్. హారన్ కొట్టగానే పనికుర్రాడు వచ్చి గేట్‌తీశాడు. విశాలమైన ఆవరణ. అందంగా, శ్రద్ధగా పెంచిన పూలతోట మధ్యనుంచీ కారు పోయేంతమేరా సిమెంట్ స్లాబ్ వేసిన చోటు. ఓ పక్కగా షెడ్డు. ఆ పక్కనే మరో చిన్నగేటు. మనుషులు నడవడానికి వీలుగా ఆ పక్కకూడా సిమెంట్‌తో స్లాబ్ వేశారు.

మిగతా బిల్డింగ్స్‌కు దూరంగా అధు నాతనంగా కట్టినట్లున్న ఆ ఇంటి వాతా వరణం చూస్తుంటేనే సాగర్ గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. అప్పుడే మొట్ట మొదటిసారిగా తన బట్టల వైపు చూసు కొన్నాడు. మట్టికొట్టుకొని, రాత్రంతా ప్రయాణం చేసి, నిద్రలేకుండా గడపటం వల్ల నలిగివున్న డ్రస్ చూసుకుంటే సిగ్గనిపించింది.

తన వయసులోనే వున్నా ట్రిమ్‌గా వున్న సూటూ బూటూ,మెడలో అందంగా వూగుతున్న మాచింగ్ నెక్ టైతో దొర బాబులా వున్న రాకేష్ పక్కన తనెంత సామాన్యుడిగా కనిపిస్తున్నాడు? ఆలోచన లతో నిలబడిపోయిన సాగర్ వీపుస ఒక్కటి చరిచాడు రాకేష్.

"ఏమిటిది? ఎక్కడపడితే అక్కడ ఇలా నిలబడిపోతే పరధ్యానం మాష్టారని పేరు పెట్టేస్తారు మా సుభా,సంధ్యాకలిసి.. కమాన్" అంటూ చేయిపట్టి బరబరా లాక్కెళుతున్న రాకేష్‌ను నవ్వుతూ అనుసరించాడు సాగర్.

హాల్లో అడుగుపెట్టగానే ముందుగా పక్కనే వున్న రూమ్‌లోకి దారితీస్తూ "కమాన్...ముందు స్నానం చేసి బట్టలు మార్చుకొనిరా. ఆ తర్వాత అందర్నీ ఇంటర్‌డ్యూస్ చేస్తాను. ఈ అవతారంతో మా మరదలు చూసిందంటే నీ పని

గోవిందా! ఇది గెస్టురూమ్. ఇందులోకి మరెవ్వరూ రారు. పదిహేను నిముషాల్లో వచ్చేయాలి. నేను వెయిట్ చేస్తూవుంటాను హాల్లోనే...." అంటూనే సాగర్‌కు మాట్లాడే అవకాశం ఇవ్వకుండా తమ రూమ్‌వైపు వెళ్ళాడు రాకేష్.

తలుపు గడియవేసి మెల్లగా తనకు కావలసిన డ్రెస్ తీసుకొని, బాత్‌రూమ్ వైపు వెళ్లి తలుపు తోశాడు సాగర్. అంతే! అలాగే ఆశ్చర్యంగా చూస్తూ నిలబడిపోయాడు.

ఎదురుగా పంజాబీ డ్రెస్‌లో వున్న ఓ అమ్మాయి టవల్‌తో ముఖం తుడుచు కుంటూ వచ్చి దాదాపు సాగర్‌ను ఢీకొన్నంతపని చేసి...ఆశ్చర్యంగా అతని వైపు చూస్తూ నిలుచుండిపోయింది.

అదే ఇంకో అమ్మాయి అయితే సడన్‌గా కనిపించిన పరాయి వ్యక్తిని చూసి కెవ్వున కేకపెట్టివుండేది. కానీ అక్కడ నుంచున్నది సంధ్య...తెలుపూ నలుపూ కలిసిన పువ్వుల డిజైన్ పంజాబీ డ్రస్‌మీద తెల్లటి పల్చటి వోణీ ముఖం కడుక్కునేటప్పుడు జారి ముందుకు పడ కుండా రెండు కొసలూ నడుం దగ్గర చేర్చి ముడేసింది. ఓణీ రంగుతో పోటీ పడుతున్నట్లున్న తెల్లని తెలుపు వన్నెకు గులాబీ రంగు కలిపినట్లున్న అందమైన ముఖం. ముఖాన చిందరవందరగా తడిసి అక్కడక్కడా అంటుకొనివున్న నల్లటి వెంట్రుకలు. ఎరుపూ, గులాబీ కలిపినట్లున్న తడిసిమెరుస్తున్న పెదాలు. ఆశ్చర్యంతో పెద్దవై మెరుస్తున్న ఆ కళ్ళవైపు చూస్తూ ప్రపంచాన్నే మరచి నట్లు అలాగే నిలబడిపోయాడు సాగర్ ఓక్షణం.

ఆ కళ్ళు పెద్దగా వుండటమే కాదు-పొడుగ్గావున్న కనురెప్పలతో తీర్చిదిద్ది నట్లుండటం ఒక్కటే కాదు. సాధారణంగా అందరి కనుపాపల్లా ఆ కనుపాపలు నల్లగా లేవు... నీలిరంగు కనుపాపలు, అతి అరుదుగా కనిపిస్తాయి.పొడవుగా వేలాడు తున్న జడా, నల్లటి వెంట్రుకలూ కాక, కొంచెం రాగి వర్ణంగా వుండివున్నా, ఆ అమ్మాయి ఏ ఫారెన్ అమ్మాయో అనుకో వచ్చు. ఇండియన్ అమ్మాయి అని తెలియ డానికే ఆ జడ అలా తాచులా వేలాడు తుందేమో? అయితే అందమైన ఆ ముఖంలో దాచినా దాగని భారతీయత స్పష్టంగా కనిపించింది సాగర్‌కు.

నీలి కళ్ళలో అంతటి అందాలుంటా యని ఎవరైనా చెబితే చచ్చినా నమ్మి వుండేవాడు కాదు సాగర్. కానీ ఆ అమ్మాయిని చూశాక అనుకోకుండా వుండలేకపోయాడు 'సప్త సముద్రాం నీలిమ ఏకం చేసి ఈ అమ్మాయి కను పాపల్ని సృష్టించి వుంటాడా సృష్టికర్త' అని.

మాటా మంతీ లేకుండా తనకెదురుగా నిలబడి, కళ్ళలో కళ్ళు కలిపి అలాగే చూస్తూ వుండిపోయిన సాగర్‌ను చూసి ముందుగా తేరుకున్నది సంధ్య.

"ఎక్స్‌క్యూజ్ మీ! నాకొంచెం దారి యిస్తారా?" అంది.

అప్పటి వరకూ తను బాత్‌రూమ్‌కు అడ్డంగా నిలబడి వున్న సంగతి గ్రహిం చిన సాగర్ తొట్రుపాటుతో—

"ఓ...అయామ్ సారీ!" అంటూ పక్కకు తప్పుకొని గబగబా వెళ్ళి రూమ్ తలుపు బార్లా తెరిచి పక్కకెళ్ళి నుంచున్నాడు. అతని హడావుడికి, అతని ముఖంలో కనిపించిన కంగారుకూ తెరలు తెరలుగా వస్తున్న నవ్వునాపు




కుంటూ ఒక్క గంతులో బయటకు పప గె త్తింది సంధ్య. ఆ వెనుకనే తలుపులు మూసిన సాగర్ అయిదు నిముషాలలాగే ఆ తలుపుకు ఆనుకొని నిలబడిపోయాడు.

ఎవరీ యువతి? ఈ రూమ్‌లో ఎవ్వరూ వుండరు గెస్ట్‌రూమ్ అని చెప్పాడు రాకేష్? బహుశా ఆ అమ్మాయి కూడా తనలాంటి గెస్ట్ కాదు కదా! తనూ ఇంటర్వ్యూ కోసం రాలేదు కదా! ఆమె సుభకో, సంధ్యకో ఫ్రెండ్ అయ్యుం టుంది. ఆలోచిస్తూ నిలబడిపోయిన సాగర్ రాకేష్ పిలుపుతో గబగబా బాత్‌రూమ్‌లో దూరాడు - "వస్తున్నా ఫైవ్ మినిట్స్" అంటూ.

పది నిముషాల్లో స్నానం ముగించి, డ్రస్ చేసుకొని డ్రెస్సింగ్ టేబుల్ మీద వున్న దువ్వెనతో తల దువ్వుకొని వెళ్ళి తలుపు తీశాడు. హాల్లో కూర్చొని ఎవరో నడివయసు స్త్రీతో, నవ్వుతూ కబుర్లు చెబుతున్న రాకేష్-

"రా సాగర్! పక్కా అర్ధగంట పట్టింది నువ్వు బయటికి రావడానికి. ఇలా అన్నింటా లేటైతే మాపుగారికి ఆన్సర్ చేయడం చాలా కష్టం. ఆ... అన్నట్లు ఆంటీ! మీకు చెప్పాను చూడండి....సాగర్ అని. వాడేవీడు. ఒరేయ్....నీకు చెప్పానే మా ఆంటీ మాలతీదేవని వారే వీరు"

అప్పుడే పక్కరూమ్ కర్టెన్ తొల గించుకొని వస్తున్న అమ్మాయి ని చూపిస్తూ-

"ఆ.. అదిగో వేంచేశారు మా బెటర్ హాఫ్! మిసెస్ సుభాదేవి" అని చెప్పడంతో ఇద్దరికీ నమస్కరించాడు సాగర్. అలాగే నుంచుని వున్న సాగర్ వైపు తదేకంగా చూస్తూ ఆప్యాయంగా "కూర్చో బాబూ!" అంటూ సోఫాలో తమ పక్కన చోటు చూపించింది మాలతి.

సాగర్‌ను చూస్తుంటే స్మృతిపథంలో నిలిచిపోయిన ఎవరిదో రూపం గుర్తుకు వచ్చి, మనసు వేగంగా స్పందించింది. ఆ ముఖం తనకెంతో ఆత్మీయమైందిగా అనిపిస్తోంది. మొట్టమొదటిసారిగా చూస్తున్న ఈ కుర్రాడు తనకు ఇంత ఆత్మీయుడిగా అనిపించడానికి కారణం? ఏదో అనుమానం మనసును పట్టి లాగు తుంటే అతి ప్రయత్నం మీద తనను తాను కంట్రోల్ చేసుకుంటూ నెమ్మదిగా లేచి నుంచుంటూ "మీకు భోజనాల ఏర్పాటు చేస్తాను రాకేష్. మాట్లాడు తూండండి" అంటూ లేచి వెళ్ళింది.

"సుభా! ఇతను నా బెస్ట్ ఫ్రెండ్. అంటే, మరి మన పెళ్ళికి రాలేదెందుకని అడిగావుగదూ? ఇప్పుడు ఎదురుగా వున్నాడుగదా! వాడినే అడుగు" అన్నాడు నవ్వుతూ.

చిన్నగా నవ్వి తల వంచుకుంది సుభ.

"ముందే వదినగారికి క్షమార్పణలతో లెటర్ రాశానులే! కారణాలు వారికి తెలుసు" అంటూ నవ్వుతున్న సాగర్ వైపు చూసి-

"ఓరి పిడుగా! పరిచయం లేకుండానే లెటర్ రాసేశావన్నమాట. అయితే మీ ఇద్దరూ కలిసి నన్ను ఫూల్‌ను చేశారన్న మాట! అందుకే అన్నారు మా మావయ్య- 'ఒరే...బొంబాయి పిల్లల్ని నమ్మకూడ దురా' అని. అప్పట్లో మావయ్య మాటలు వినిపించుకోలేదు. 'లౌ ఎట్ ఫస్ట్ సైట్' అని చూపుల తూపులతో లాగి బొంబాయి మహానగరానికి తెచ్చిపడేసింది నన్ను" అన్నాడు రాకేష్.

"ఇప్పుడు నీకేం తక్కువైంది?" అన్నాడు సాగర్ నవ్వుతూ.



"నాకేం తక్కువ కాలేదుగానీ అదుగో మా సీమ మిరపకాయ వురఫ్ సంధ్యా సుందరి...అనబడు మా మరదలుంగారు వేంచేయుచున్నారు ..." అంటున్న రాకేష్ నెత్తిన తడుతూ వెళ్ళి అక్క పక్కన కూర్చుంటున్న సంధ్య వైపు చూసి, వులిక్కిపడ్డాడు సాగర్. బాత్ రూమ్ సుందరి ఈవిడే! నవ్వుతూ అతని వైపు చూస్తూ—

"బావా! మీ ఫ్రెండ్‌తో కలిసి ఏదైనా డ్రామా వేసే ప్రయత్నంలో వున్నావా? మిట్టమధ్యాహ్నం హాట్ హాట్‌గా డైలాగ్స్ వప్పచెబుతున్నావ్" అంది.

"నేను నీతో వాదించి గెలవలేను" అన్నాడు రాకేష్ భయం నటిస్తూ.

"అతి వినయం ధూర్త లక్షణం అన్నారు. మరీ అంత వినయం ప్రదర్శించకు" అంటూ నవ్వుతూన్న సంధ్య మాటలకు సాగర్ కూడా నవ్వేశాడు.

"సాగర్! అతిగా నవ్వకు. ఆ తర్వాత ఏడిపించడం ఎలాగో కూడా మా మరదలికి తెలుసు" అన్నాడు రాకేష్.

"అవును పాపం! అనుభవంతో చెబుతున్నాడు మా బావ" అంటూ కిలా కిలా నవ్వుతున్న సంధ్య నవ్వుతో అంతా శృతికలిపారు.



ఇంతలో అటుగావచ్చిన మాలతి సాగర్ వైపు చూస్తూ – "లే బాబూ! వాళ్ళకు కబుర్లుంటే చాలు ఆకలి దప్పులు కూడా తెలీవు. ఎప్పుడనగా బయలుదేరావో ఏమో? భోంచేద్దురు గానీ పదండి!" అనడంతో అంతా భోజనాలకు లేచారు.

కొసరి కొసరి వడ్డిస్తున్న మాలతీదేవిని చూస్తుంటే, అమ్మ లేని కొరత ఎంత తీరనిదో అర్థమైంది సాగర్‌కు. ఆమె ఆప్యాయంగా వడ్డిస్తుంటే అప్రయత్నంగానే కళ్ళలో నీళ్ళూరాయి. తను పుట్టి బుద్దెరిగిన తర్వాత తనకు అంత ఆప్యాయంగా తినిపించిన మొట్టమొదటి పరాయివ్యక్తి మాలతీదేవి. కానీ ఎందుకో ఆవిడ పరాయిదానిగా అన్పించలేదు. ఆమె నవ్వులో, మాటలో ఏదో తెలియని ఆత్మీయత వుంది. రాకేష్ చెప్పిన మాట అక్షరాలా నిజం. ఆవిడ ఆ ఇంట్లో కనిపించే దేవత!

భోంచేసి మాలతీదేవి చెప్పిన మాట ప్రకారం గెస్టురూమ్‌లోకి వెళ్ళి పడుకున్నాడు. "ఎంత ప్రేమగా చూస్తుందో అంత డిసిప్లిన్‌గా వుంచుతుంది ఆంటీ. ఎవ్వరికీ లొంగని కొరకరాని కొయ్య అనుకునే సంధ్యకూడా ఆమె ఏంచెప్పినా ఎదురు చెప్పదు" అన్న రాకేష్ మాటలు జ్ఞాపకం వచ్చి చిన్నగా నవ్వుకున్నాడు సాగర్. నీలికళ్ళ నీలాలతార సంధ్య రూపం కళ్ళ ముందు కదలాడింది. చిలిపిగా నవ్వే ఆ నవ్వు, నవ్వుతుంటే అందంగా మెలితిరిగే ఆ కింది పెదవి, అందంగా అలలుగాకొద్దిపాటి నొక్కులతో

వున్న నల్లటి తలకట్టు, పొడవాటి కనురెప్పలతో నవ్వినప్పుడల్లా విచిత్రంగా మెరిసే ఆ నీలికళ్ళు,మాటల్లో కొంటెతనం. ఎందుకో పదేపదే ఆ రూపం కళ్ళముందు కదలాడుతుంటే తనలో తానే నవ్వుకుని అలాగే మంచం మీద అటూ ఇటూ పొర్లుతూ పడుకొని ఆ తర్వాత ఎంత సేపటికో నిద్రపోయాడు.

కొద్దిగంటల తర్వాత నెమ్మదిగా కళ్ల నులుముకుంటూ లేచి, బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటూ ఎదురుగా చూసిన సాగర్ ఒక్కసారిగా తడబడ్డాడు. ఎదురుగా కుర్చీలో కూర్చుని తనవైపే తదేకంగా చూస్తున్న మాలతీదేవిని చూసి, తత్తర పాటుగా లేచి కూర్చుంటూ-

"మీరు... మీరెంతసేపైంది వచ్చి! బాగా నిద్రపోయాను. మీరు వచ్చిందే తెలీదు" అన్నాడు నొచ్చుకుంటూ.

చిన్నగా నవ్వుతూ - "ఫర్వాలేదులే సాగర్! ఇవ్వాళ ఆమాత్రం రెస్ట్ తీసుకోక పోతే రేపు ఇంటర్వ్యూలో ఫ్రెష్‌గా కన్పించవు. సగం ఇంటర్వ్యూ నీకు ఇక్కడే అయిపోతుందనుకో. లేచి ముఖం కడుక్కో బాబూ... కాఫీ తీసుకొస్తాను" అంటూ లేచి వెళ్లిపోతున్న ఆమెవైపే చూస్తూ కూర్చున్న సాగర్‌కు అనిపిం చింది-'ఇంట్లో ఎంతమంది పనివాళ్ళున్నా అతిథుల మంచీ చెడ్డా స్వయంగా కనుక్కునే ఇలాంటి తల్లులు ఎందరుం టారు?' అని.

ముఖం కడుక్కుని వచ్చేసరికి వేడి కాఫీ పట్టుకొని వచ్చిన మాలతీదేవి వైపు గౌరవంగా చూస్తూ- "నేనే అక్కడికి వచ్చేవాడినిగా. మీరెందుకు శ్రమ తీసు కున్నారు!" అన్నాడు చిరునవ్వుతో కాఫీ కప్పు అందుకుంటూ.

"రాకేష్ ఎక్కడికో బయటకు వెళ్లాడు. సుభా, సంధ్యా దొడ్లో టెన్నిస్ ఆడు తున్నారు. నీతో కాసేపు మాట్లాడవచ్చు కదాని నేనే వచ్చాను. రాకేష్ మరో అరగంటలో వస్తానన్నాడు. కూర్చో బాబూ!" అంటూ తనూ ఓ కప్పు తీసు కొని కూర్చుంది మాలతి.

మౌనంగా కాఫీ తాగుతున్నాడు సాగర్. తలవొంచుకుని కాఫీ తాగుతుంటే ముందుకు పడిన ఆ క్రాపూ, నవ్వుతుంటే తెల్లగా మెరిసే పలువరస.... అచ్చు తన జగన్‌లాగే అన్పిస్తున్నాడు. కానీ... కానీ...? ఇతను జగన్ కొడుకు కాదుగదా? ఒకవేళ కాకపోతే నష్టమేముంది? ఆ అబ్బాయి వివరాలడిగి తెలుసుకోవడంలో తప్పులేదుగా...?

"సాగర్!మీరు అన్నదమ్ములెంతమంది బాబూ?" అంది సంభాషణ ప్రారంభిస్తూ.

"మేం మొత్తం ముగ్గురం ఆంటీ! నాకో అన్నయ్య, ఓ చెల్లెలు వున్నారు. నాన్నగారు పాలెంలో స్కూలు టీచర్‌గా పనిచేస్తున్నారు" అన్నాడు సాగర్ మాలతి వైపు నవ్వుతూ చూస్తూ.

స్కూల్ టీచరా! జగన్ స్కూలు టీచరుగా వుండటానికి అవకాశం లేదు. ఏమో... స్కూల్ టీచర్ కాకూడదని ఎక్కడుంది? అప్పుడతనున్న మానసిక స్థితిలో పిల్లల్ని తీసుకొని ఏ మారుమూల ప్రదేశానికో వెళ్లి ఎలాగో బతకడమే అతని ధ్యేయంగా అనుకుని వుండవచ్చు.

మళ్ళీ తన సమాధానం విని ఆలోచ నలో పడ్డ మాలతి వైపు చూస్తూ కూర్చు న్నాడు సాగర్. వున్నట్లుండి మళ్ళీ అడిగింది మాలతి-

"సాగర్! మరి మీ అమ్మగారు....?" అర్ధోక్తిలో ఆగిపోయింది.

"మాకంత అదృష్టం లేదు ఆంటీ! ఊహ సరిగ్గా తెలీక ముందే మమ్మల్ని అనాథల్ని చేసింది అమ్మ. అప్పటినుంచీ నాన్నగారే అన్నీఅయి పెంచారు. ఎంత చేస్తే ఏం ప్రయోజనం? అష్టకష్టాలూ పడి మమ్మల్ని పెంచి పెద్దవాళ్ళను చేసిన నాన్నగారికి ఈ వయసులో వుండాల్సిన విశ్రాంతినివ్వలేని వాళ్ళమయ్యాము మేము. అన్నయ్య సంపత్ కలవారింటి అమ్మాయిని పెళ్లి చేసుకుని మామగారింట ఇల్లరికపు అల్లుడిగా రాజభోగాలు అనుభవిస్తూ అందర్నీ మరిచిపోయాడు. చెల్లాయి రాధ పెళ్లీడుకొచ్చింది.నాకింకా ఉద్యోగం దొరకలేదు. నేను ఇంకానాన్నగారిరెక్కల కష్టం మీదే బతుకుతున్నాను..." ఆఖరి మాటలు చెబుతున్న సాగర్ కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

ఆత్మీయురాలిగా తన విషయాలన్నీ అడుగుతున్న ఆ మాతృమూర్తి ముందు ఏదీ దాచాలనిపించలేదు. అందుకే తమ కుటుంబాన్ని గురించి అన్ని విషయాలూ క్లుప్తంగా చెప్పేశాడు.

సాగర్ మాటలు వింటున్న మాలతి గుండెలు వుద్వేగంతో కొట్టుకున్నాయి.

"మీ నాన్నగారి పేరు జగన్నాథరావు గారు కదూ?" అంటున్న మాలతి కంఠం కంపించడం, ఆమె కళ్ళనిండుగా నీళ్ళూరడం చూసిన సాగర్ తన కళ్లు తుడుచుకుంటూ, తలెత్తి ఆమె వైపు ఆశ్చర్యంగా చూశాడు.

"మీకెలా తెలుసు?" అన్నాడు ఆశ్చర్యంగా.

అంతే! కుర్చీలో నుంచి లేచిన మాలతి సాగర్ తలను గుండెలకు హత్తుకొని, కన్నీటితో అతని తలను అభిషేకిస్తూ—

"సాగర్... బాబూ... నువ్వేనా! ఎన్నాళ్టికి నిన్ను చూడగలిగాను?" అంటూ ఏమేమిటో తనలో తానే గొణుక్కుంటూ అతని తలమీద చేయి వేసి నిమరసాగింది. సాగర్ అయోమయంలో పడి ఆమె చేతుల్లో ఇమిడిపోయాడు.

ఈమెలో ఏం శక్తి వుంది? ఆమెను అమ్మా అని పిలవాలనిపిస్తోందేం? తల్లి స్పర్శలోని మహత్తరమైన అనుభూతి మొట్టమొదటిసారిగా తనకు ఈమె దగ్గరే లభిస్తోంది. ఆమె తనను చూసిన దగ్గరనుంచీ తన మీద ఎందుకంత అభిమానం, ఆప్యాయత కురిపిస్తోందో అర్థంకాకుండా వుంది సాగర్ కు. ఇప్పటి ఆమె స్థితి అతన్ని మరింత డైలమాలో పడేసింది. ఎవరీమె? ఈమెకూ, తనకూ ఏమిటి సంబంధం? తన తండ్రి పేరు ఈమెకెలా తెలిసింది?

తనకు ఊహ తెలిసిన దగ్గరినుంచీ తమకు తెలిసిన బంధువులు లేరు. చిన్నప్పటి విషయాల్ని తండ్రి ఎప్పుడూ తమ మధ్యకు రానిచ్చేవారు కాదు. తల్లిని గురించి అడిగితే సరిగా చెప్పలేదు మాలతీదేవి ఆదరణ చూస్తుంటే తల్లిలేని కొరత ఎంతటిదో అర్థమౌతోంది. తనింతకాలం ఎంత పోగొట్టుకున్నాడో అర్థమౌతోంది.

"బాబూ... సాగర్!" అంటూ అస్పష్టంగా ఏమేమిటో మాట్లాడుతున్న మాలతీదేవి పరిస్థితికి మరింత అయోమయంలో పడిపోయాడు.

"ఏమిటి ఆంటీ? మేము మీకు తెలుసా?" అని అడుగుతున్న సాగర్ తల రెండు చేతుల మధ్యకూ చేర్చుకుని నుదుట ముద్దుపెట్టుకుంటూ వుద్వేగంతో గొంతు నిండుగా—

"తెలియటమేమిట్రాసాగర్! నేను... నేను మీ అమ్మనురా!" అంది ఆశ్చర్యంగా

చూస్తున్న సాగర్‌తో.

"అవును బాబూ! మీ అమ్మనే. కన్న తల్లిని కాదు... కానీ పెంచిన తల్లిని. మీ అమ్మ పార్వతి మా బాబాయి కూతురు. ఆరోగ్యం బాగుండకపోతే తన పిల్లలైన మీ ముగ్గుర్నీ నా చేతులమీదుగా పెంచాను. మీ నాన్న ఈ విషయాలెప్పుడూ చెప్ప లేదా బాబూ! అవునులే... ఇదంతా ఓ పీడ కలగా మర్చిపోవాలని మాకందరికీ దూరంగా, మిమ్మల్ని తీసుకుపోయిన వాడు. మీకు మమ్మల్ని గురించి ఎందుకు చెబుతాడు! అందుకే మీకీ విషయాలేవీ తెలిసే అవకాశం లేకపోయింది. ఆ విషయాలన్నీ నేను వివరంగా చెబుతానులే కూర్చో..." అంటూ సాగర్‌ను కూర్చో బెట్టి చెప్పడం మొదలెట్టింది మాలతి.

"రాకేష్ మావగారు, సురేంద్ర ఎవరో కాదు–నీకు సొంత మేనమామ. మాట పట్టింపు వచ్చి మీ నాన్నా, ఆయనా విడి పోయారు. మీ అమ్మపోయిన కొద్దికాలా నికే మీ తాతయ్యా పోయారు. మీ అత్తయ్య ఇండియాలో ఉండలేనని సుభని, సంధ్యనూ, అన్నయ్యనూ వదిలి అమెరికా వెళ్ళిపోయింది. పిల్లల్ని తీసుకొని మీ నాన్న ఎవ్వరికీ చెప్పకుండా ఏ మూరు మూలకో వెళ్ళిపోయారు. ఇంత ఇంట్లో ఇద్దరు పసివాళ్ళతో ఒంటరిగా మిగిలిన అన్నయ్యను వదిలిపోలేక ఇక్కడే వాళ్ళ మంచీ చెడ్డా చూస్తూ వుండిపోయాను నేను. ఇప్పటికి కూడా వెళ్ళేవాడు తను వెళ్ళక పసిపిల్లల్ని కూడా తీసుకు వెళ్ళా డని అన్నయ్యకు మీనాన్న మీద కోపమే.

మీ నాన్న అలా వెళ్ళడం తప్పని నేను అనను. ఆత్మాభిమానం వున్న వాళ్ళెవరైనా మా పదిన అనే మాటలు పడి ఈ ఇంట్లో వుండటమనేది జరగదు. ఇకనేనంటావా...? అన్నయ్య మీద వున్న అభిమానం, పిల్లల మీద వున్న మమకారం నన్నీ ఇంటికి కట్టి పడేశాయి"

అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకుంటున్న మాలతివేపు చూసి "ఆంటీ! ఈ విషయం తెలిస్తే మావయ్యా, నాన్నగారూ ఎంత సంతోషపడతారో! నాకెంత ఆనందంగా వుందో మాటల్లో చెప్పలేను ఆంటీ! ఇన్నాళ్ళికి మాకంటూ నిజమయిన ఆత్మీయులు, ఆత్మబంధువులున్నారని తెలుసు కోగలగటం నిజంగా నా అదృష్టం..." అంటున్న సాగర్ మాటలు మధ్యలోనే తుంచేసింది మాలతి.

"నువ్వు పొరపడుతున్నావు సాగర్! ఇప్పుడు నువ్వెవరో తెలిస్తే అన్నయ్య ఆదరించడానికి బదులుగా అవమానించే అవకాశాలెక్కువ. మమ్మల్నందరినీ కాదని పోయాడు మీ నాన్న. మాకంటే ఎంత గొప్పగా బతికాడని నిష్ఠూరమాడవచ్చు. అవి నీ అభిమానాన్ని దెబ్బతియ్యవచ్చు. అంతకంటే నువ్వెవరో అన్నయ్యకు తెలియకుండా అతని ఆదరణ పొంద గలిగితే, అప్పుడు అందర్నీ సంతోష పెట్టినవాడివవుతావు. నీ ద్వారా మళ్ళీ విడిపోయిన రెండు కుటుంబాలూ ఏకం కావాలి. అదే నాకు మిగిలివున్న జీవితాశయం. నీ ఆంటీ మీద ఏమాత్రం అభిమానం వున్నా నేను చెప్పినట్లు చేయి బాబూ! నువ్వెవరివో తెలియపరచ కుండానే ఆ తండ్రీకూతుళ్ళ అభిమానాన్ని సంపాదించు. అప్పుడే మీ నాన్న కూడా సంతోషిస్తాడు"

"ఆంటీ! మీరు ధైర్యంగా వుండండి. రేపు జరగబోయే ఇంటర్వ్యూలో నాకు విజయంచేకూరాలని ఆశీర్వదించండి" అంటూ తన కాళ్ళమీదకు వంగి నమస్క–




రిస్తున్న సాగర్ భుజాలు పట్టుకొని పైకి లేపింది మాలతి.

ఎన్నాళ్ళకో తప్పిపోయిన కొడుకు దొరికిన ఆనందం మాలతిని నిలవ నివ్వడంలేదు.

"నేను చెప్పిన విషయాలేవీ రాకేష్‌కు కూడా తెలియడం మంచిదికాదు. ప్రస్తుతానికి ఇవన్నీ రహస్యంగానే వుండనివ్వు" అంటున్న మాలతి మాటలకు నవ్వుతూ తలవూపాడు సాగర్.

ఇంతలో రాకెట్‌లా దూసుకొచ్చాడు రాకేష్.

"అరె...అప్పుడే ఆంటీతో దోస్తీ కట్టేశావన్న మాట. అక్కడ కోర్టులో సవాల్ చేశారు ఆడపిల్లలిద్దరూ నాతో. టెన్నిస్‌లో మనను ఓడిస్తారట. నువ్వు ఛాంపియన్‌వని వీళ్ళకు తెలీదు పాపం. పద... ఓ పట్టు పడదాం. ఆంటీ...మీరూ రండి, ఆట చూద్దురుగానీ" అంటూ సాగర్‌ను లాక్కెళుతున్న రాకేష్ వేపు చూసి నవ్వింది మాలతి.

"మీరు పదండి బాబూ...నేనిప్పుడే వస్తాను" అంది లేస్తూ.

"టిఫిన్ ఎరేంజ్ మెంట్ కేగా ఆంటీ... డోంట్‌వర్రీ. మళ్ళీ వచ్చి చేసుకుందాం రండి" అంటూ మరోచేత మాలతి చేయి పట్టుకొని ముందుకు లాక్కెళ్ళాడురాకేష్.

"ప్రతిదానికీ పంతాలేగానీ, చెయ్యి వదలరా బాబూ! నేవస్తాలే" అనడంతో నవ్వుతూ చెయ్యి వదిలేశాడు రాకేష్.

అప్పటికే ఒకసైడ్ కోర్టులో సిద్ధంగా వున్నారు సుభ, సంధ్య.

"వచ్చారా? మీరు ఆడుకోండి బాబూ .... మేం వెళతాం!" అంటూ బయటికి రాబోయింది సుభ.

గట్టిగా పట్టుకొని ఆపుతూ-"అక్కా... ఏవిటి? ఇప్పుడు నువ్వెళ్ళిపోతే ఎలా? మనం ఓడిపోయినట్లవదూ! ఒక్క ఆట ఆడు చాలు. చిత్తుగా వోడించిపారేద్దాం!" అంటున్న సంధ్య వేపు నవ్వుతూ చూస్తూ బాట్ తీసుకున్న సాగర్-"ఒక్క ఆటతో గెలుపూ ఓటమి తేలదు మేడమ్. ఎట్‌లీస్ట్ రెండు ఆటలయినా ఆడవలసి వస్తుంది" అన్నాడు నవ్వుతూ.

ఆ అందాల అపరంజి తనకు మావయ్య కూతురు అనుకుంటే హృదయం ఆనందంతో మేఘాల్లో తేలిపోతు న్నట్లుగా వుంది. ఇంట ర్యూళ్ళ లో మావయ్యనే కాదు-సంధ్యని ఈ ఆటలోనే కాదు...సంధ్య మనస్సును కూడా గెలవ గలిగినపుడే తనది నిజమయిన గెలుపు అనుకుంటూ సాగర్ సర్వీసింగ్ మొదలు పెట్టాడు.

ఆ ఇద్దరూ ఆటలో సమవుజ్జీలే. రాకేష్, సుభా వుత్సవ విగ్రహాల్లా నిలబడవలసి వచ్చింది. సంధ్యా, సాగర్ చాలా పౌరుషంగా, వుత్సాహంగా ఆడుతున్నారు. మొదటి ఆట పూర్తయ్యేసరికి సంధ్యచీకట్లు ముసురుకున్నాయి. అప్పటికి ఇద్దరూ సమానంగానే వున్నారు.

"ఈరోజుకింక ఆపండి సంధ్యా! మళ్ళీ రేపు ఆడుకోవచ్చులే" అంది మాలతి.

"ఓకే...మిష్టర్ సాగర్! మీరు చాలా బాగా ఆడారు. కంగ్రాట్స్" అంటూ చేయి అందించిన సంధ్యకు రెండు చేతులూ జోడించి "నిజానికి మీరే బాగా ఆడారు" అంటున్న సాగర్‌ను చూస్తే మహాకోపం వచ్చింది సంధ్యకు.

'ఎంత గర్వం? తను మనస్ఫూర్తిగా అభినందించాలని చెయ్యిస్తే, షేక్‌హాండ్ ఇవ్వడం కూడా తెలీని శుద్ధ కంట్రీ మన్‌లా వున్నాడు. అలాంటివాడికి

చెయ్యి ఇవ్వబోవడం తనదే తప్పు' అనుకున్న సంధ్య విసురుగా ఇంటివేపు సాగిపోయింది.

సంధ్య కోపానికి కారణం తెలిసిన సాగర్ మెల్లగా తనలో తానే నవ్వుకుంటూ మాలతితోపాటు ముందుకు నడిచాడు.

ఆ రాత్రి భోజనాల సమయంలో సాగర్‌కు తన మేనమామను కలుసుకునే అవకాశం కలిగింది. కానీ ఎక్కువగా మాట్లాడే అవకాశం ఇవ్వలేదు సురేంద్ర. అది అతని ప్రిన్సిపుల్‌కు విరుద్ధం. నార్మల్‌గా ఒకటి రెండు ప్రశ్నలు వేసి తన డిన్నర్ పూర్తిచేసుకుని వెళ్ళిపోయాను.

"సాగర్... మా మావగారు సరిగా మాట్లాడలేదని బాధపడకు. ఆయన తత్వమే అంత. మరి ఇప్పుడు చనువుగా మాట్లాడితే రేపు ఇంటర్వ్యూలో అది నువ్వెక్కడ ఎడ్వాంటేజ్‌గా తీసుకుంటావోనని భయం కావచ్చు. మహా స్ట్రిక్ట్ మనిషిలే. కేవలం మెరిట్ తప్ప రికమండేషన్స్ ఆయనదగ్గరపనిచేయవు" అన్నాడు రాకేష్.

"ఈరోజుల్లో మెరిట్ చూసి ఉద్యోగం ఇచ్చేవాళ్ళున్నారంటే నిజంగా ఆనందించదగ్గ విషయం" అన్నాడు సాగర్.

"మా అన్నయ్య మొదటినుంచీ అంతే సాగర్! ఎక్కడివరకో ఎందుకు-రాకేష్‌ను తీసుకొనే ముందు కూడా యధాతథంగా అందరితో పాటు ఇంటర్వ్యూ జరిపారు. రాకేష్ ఎవరో తెలిసి మిగతా జడ్జీలు కూడా ఏకగ్రీవంగా రాకేష్‌ను ఎన్నుకోవడంతో ఇక అతన్ని మేనేజర్‌ను చేయక తప్పలేదు" అంటున్న మాలతి మాటలకు ముసి ముసి నవ్వులు నవ్వుతున్న రాకేష్‌వైపుచూశాడు సాగర్.

"సాగర్! ఉదయం ఏడుగంటలకల్లా స్నానం చేసి రెడీగా వుండాలి. అప్పటికే మావగారు ఫాక్టరీకి వెళ్ళిపోతారు. మనం ఎనిమిది గంటలకు సరిగ్గా ఆఫీసులో లేకపోతే .."

"ఆ...ఆ అర్థమైందిలే ! నేను ఆరు గంటలకే రెడీగా వుంటాను....సరేనా ?" అంటూ తన గదివైపు వెళ్ళిపోయిన సాగర్ పక్కమీదకు చేరాడన్నమాటే గానీ ఎంతసేపటికి నిద్రపట్టలేదు.

మాలతి ఆంటీ చెప్పిన విషయాలు జ్ఞాపకం వచ్చాయి. తండ్రి పట్టుదలకు పోకుండావుంటే తమ జీవితాలు ఎలా వుండేవో. రాకేష్ స్థానంలో సంపత్ వుండివుండేవాడు. ఇప్పటిలా అన్నయ్యను గురించి బాధపడవలసిన పరిస్థితి వుండేది కాదు. రాధకు మంచి సంబంధం చూసి పెళ్లి చేసేవారు. తనూ...తనూ...సంధ్య ఇప్పుడు మాత్రం మించిపోయిందేముంది? సంధ్యను తనదాన్నిగా చేసుకునే అవకాశం ఇప్పటికీ వుంది. కానీ మొదటి పరిచయంలోనే తనమీద కోపం కలిగేట్లు ప్రవర్తించి, సంధ్య మనసు నొప్పించానేమో! మావయ్య కూతురు కనుక ఏడిపించాలనిపిస్తోంది. అది రివర్స్‌గా పనిచేస్తే...? నో.... ఏ సినిమాలో చూసినా కోపం నుండే గదా ప్రేమ జనించేది. ముందు ఇష్టంలేనట్లు నటిస్తారు. తమాషాగా అయిష్టాలన్నీ ఇష్టాలుగా మారిపోయి ఆ హీరోని ప్రేమించడం ప్రారంభిస్తారు. ఛీ! తమది సినిమాలా కాదు... నిజమైన ప్రేమ! మొట్టమొదట సంధ్యను చూడగానే స్పందించడం మొదలెట్టింది మనసు. అదే ప్రేమకు ప్రారంభం.

మరీ తనతో వాదన పెట్టుకొని

 

నొప్పించకూడదు. ఆంటీ చెప్పిన విషయాలు జ్ఞాపకం పెట్టుకొని, ముందు సంధ్య మనసుని గెలవాలి. ఆ తర్వాత మావయ్యను గెలవడం సులభం. వీట న్నింటికన్నా ముందు రేపు ఇంటర్వ్యూలో గెలిచి మావగారి అభిమానాన్ని సంపాదిం చాలి. దృఢ నిశ్చయానికి వచ్చిన సాగర్ హాయిగా నిద్రపోయాడు.

బలవంతంగా ఆంటీ ఇచ్చిన పాలు తాగి పడుకున్న సంధ్య కూడా అలాగే ఆలోచిస్తోంది. ఏవిటి రోజంతా ఇలా గడిచింది...?

మధ్యాహ్నం మొహం కడుక్కోడానికి మళ్ళీ పైకెందుకులే అని కిందవున్న గెస్ట్ రూమ్‌లోకి వెళ్ళి మొహం కడుక్కొని, తలుపు తీసేసరికి ఎదురుగా నిలబడి వున్నాడు తను. 'తదేకంగా తననే చూస్తున్న ఆ కళ్ళతో ముడిపడ్డ కళ్ళను అతి ప్రయత్నంమీద విడదీసుకొని ఎలాగో బయటపడింది.

తర్వాత బావ అతన్ని తన ఫ్రెండ్‌గా పరిచయంచేశారు. అప్పుడూ పెద్దగా మాట్లాడలేదు. ఈవినింగ్ బావను టెన్నిస్ ఆడమని ఛాలెంజ్ చేస్తే మావాడు బాగా ఆడతాడని సాగర్‌ను తీసు కొచ్చాడు. నిజంగా చాలా బాగా ఆడాడు. అంతంతమాత్రపు ప్లేయర్స్ అతని ముందు నిలవడం కష్టమే. తను ఎవ్వర్నీ త్వరగా మెచ్చుకోదుమరి. అలాంటిది మనస్ఫూర్తిగా షేక్‌హాండ్ ఇవ్వబోతే కొంటెగా నవ్వుతూ చేతులు జోడిం చాడు. మొట్టమొదటిసారి తన అహం దెబ్బతిన్నది అక్కడే.

ఆ తర్వాత భోజనాల సమయంలో మరోసారి కోపం తెప్పించాడు. తనకు కోపంవస్తే ఎదురుగా వున్నది ఎవరైనా లెక్కచేయదు. అది తన వీక్‌నెస్. తనతో అతి చనువు ప్రదర్శించబోయాడు. తను పెడసరంగా ప్రవర్తించింది.

ఎప్పుడూ ఏదో ఒకటి అంటుండే బావ కూడా బాధపడ్డట్లున్నాడు. అవునుమరి... తన స్నేహితుణ్ని ఇంటికి పిలిచి అవమా నించినట్లయిందన్నబాధకలగడం సహ జమేకదా!

ఆంటీ ఏమనుకుందోగానీ ఏమీ అన లేదు.

ఆ విషయాలేవీ ప్రస్తావించకుండా పాలు తీసుకొచ్చి బలవంతంగా తాగించి వెళ్ళిపోయింది. అందే ఆంటీకి కూడా తను చేసిన పని నచ్చలేదన్నమాట! అందుకే ఏ మాటా అనలేదు.

అతనేమనుకొని వుంటాడు? తను లేచివచ్చిన తర్వాత కూడా పెద్దగా నవ్వులు వినిపించాయి. అది అతను జోక్‌గానే తీసుకున్నాడా? అలా అయితే ఇంక బాధపడేదేముంది?

అంతగా అయితే రేపొద్దున్న రాకేష్ బావకు సారీ చెప్పవచ్చులెద్దూఅనుకుంటూ పక్కకు తిరిగి పడుకున్న సంధ్యకు నిద్రపట్టే సూచనలు కనిపించలేదు. ఆలస్యం అమృతం విషం అన్నారు. రేపెందుకు? వైనాట్ నౌ? అవును... ఇప్పుడే సారీచెబితే బావ హాయిగా నిద్ర పోతాడు. నేనూ తృప్తిగా నిద్రపోవచ్చు- అనుకున్న సంధ్య గబగబా కిందకుదిగి వచ్చింది.

సుభ గదిలో ఇంకా లైట్ వెలుగు తూండటం చూసి పక్కగది వైపు చూసింది. గెస్ట్‌రూమ్‌లైట్ ఆఫ్ చేసి వుంది. 'సాగర్ నిద్రపోయినట్లున్నాడు' అనుకుంటూ అక్కగది తలుపు మెల్లగా తట్టింది.



పిల్లిలా అప్పుడు తలుపు తడుతున్నదెవరో ఇద్దరికీ తెలుసు. అందుకే రాకేష్ పుస్తకం పక్కనపెట్టి చిన్నగా నవ్వుతూ వెళ్ళి తలుపు తీయమని సైగచేశాడు.



సుభ మెల్లిగా వెళ్ళి తలుపు తీసింది. ఎదురుగా నిలబడ్డ సంధ్యను చూసి పక్కకు తప్పుకుంది. నెమ్మదిగా తల వంచుకొని లోపలికి వచ్చింది సంధ్య. సంధ్య వెనకాలే లోపలికి వచ్చింది సుభ.

"కూర్చో సంధ్యా... నిద్రపట్టలేదా?" అంది.

"ఎలా పడుతుంది? పాపం" అన్నాడు రాకేష్ చిరుకోపంగా.

మరోప్పుడైతే విరుచుకుపడేదే. కానీ అప్పుడు సంధ్య మానసిక స్థితి చాలా ప్రశాంతంగా వుంది. మెల్లిగా వచ్చి మంచం చివర కూర్చుంటూ-

"సారీ బావా! నిజంగా తొందర పడ్డాసు. మీ ఫ్రెండ్‌ను అలా ఇన్సల్ట్ చేసి వుండాల్సిందికాదు. రియల్లీ అయామ్ సారీ... నన్ను క్షమించు"

ఆశ్చర్యంగా సంధ్య వైపు తిరిగి రాకేష్-

"అరే... చూడవోయ్ సుభా! ఎయిత్ పందర్ అంటే ఇదే. మీ చెల్లాయి సారీ చెబుతోంది. పైగా తను నా ఫ్రెండ్‌పట్ల ప్రవర్తించిన తీరుకు పశ్చాత్తాప పడుతోంది. ఆరోగ్యవంతమైన పరివర్తన. ఓకే మరదలుగారూ క్షమించేశాం. అయితే నీకు మరో విషయం చెప్పనా...? మా సాగర్ వున్నాడే... వాడు నీకంటే అభిమానస్థుడు. చిన్న అవమానాన్ని కూడా సహించలేదు. కానీ ఈరోజు

వాడిని చూస్తుంటే నాకే ఆశ్చర్యమేసింది. వాడు సాగరేనా అన్న అనుమానం కూడా కలిగింది"

అంటూ నవ్వుతున్న రాకేష్ వైపు చూడలేక సిగ్గుగా తల తిప్పుకుని లేచి బయటకు పరుగెత్తుతున్న సంధ్యను చూసి మరింత ఆశ్చర్యం ప్రకటించింది సుభ.

"అరెరె! ... మీ చెల్లాయి సిగ్గు పడుతోంది కూడా..చూడవోయ్ సుభా" అంటూన్న రాకేష్‌ను పక్కకు నెట్టి తలుపువేసి వచ్చి పక్కన పడుకుంది.

"అది సిగ్గుపడటం కూడా విచిత్రంగా వుందా మీకు?" అంటున్న సుభ ముఖం చేతుల్లోకి తీసుకుంటూ "నేను వచ్చిన



తర్వాత సంధ్య సిగ్గుపడటం మొట్ట మొదటి సారిగా చూశాను సుభా! విచిత్రం కాదామరి? ఎదుటివాళ్ళను సిగ్గు పడేటట్లు చేయడం తప్ప సిగ్గు పడటం అలవాటులేదే ఆ సీమ దొరసానికి" అంటున్న రాకేష్ నోరు మూసింది సుభ.

"అదిగో...మళ్ళీ సీమ దొరసాని అంటూ మొదలెట్టారా? అది విన్నదంటే మళ్ళీ వెనక్కు పరుగెత్తుకు వస్తుంది పోట్లాటకు. మాట్లాడకుండా పడుకోండి" అంటూ రాకేష్ కళ్ళమీద చేయిపెట్టి మూసింది.

"సరే...ఒప్పుకున్నాం. ఇక మాటలు బంద్" అంటూ సుభను రెండు చేతుల మధ్యకూ తీసుకున్నాడు రాకేష్. మౌనంగా అతని కౌగిట్లో ఒదిగిపోయి కళ్ళు మూసుకుంది సుభ.



చీకటితోనే లేచిన మాలతి కాఫీ, టిఫిన్ ఏర్పాట్లు చూడటంలో మునిగి పోయింది. ఆరు గంటలకల్లా లేచిన సాగర్ స్నానం కూడా పూర్తిచేసి హాల్లోకి వచ్చాడు. అప్పటికే తయారై కాఫీ తాగుతున్న సురేంద్రను చూసి చిన్నగా నవ్వుతూ—

"గుడ్ మార్నింగ్ అంకుల్" అన్నాడు.

ఎందుకో వులిక్కిపడ్డాడు సురేంద్ర.

ఎన్నో సంవత్సరాల తర్వాత ఆ పిలుపు కొత్తగా, వింతగా అదో రకమైన అనుభూతిని కలిగించింది. తనని తాను స్వాధీనంలోకి తెచ్చుకుంటూ, కల వరపాటును కప్పిపుచ్చుకుంటూ—

"వెరీ గుడ్ మార్నింగ్ సాగర్... కమాన్" అంటూ ఎదురు సోఫా చూపించాడు. మరో కప్పు కాఫీ తీసుకొచ్చి సాగర్ చేతికిస్తున్న మాలతి వైపు చూసి—

"మీకెందుకు శ్రమ అంటీ....నేనే అక్కడికి వచ్చివుండే వాడినిగా" అన్నాడు సాగర్.

"అలా చెప్పవోయ్ సాగర్! పిల్లలకు కూడా ఇవే బాడ్ హాబిట్స్ చేసింది మాలతి. అందుకే అలా తయార య్యారు"

"ఎలా తయారయ్యారన్నయ్యా?" అని నవ్వుతూ అడుగుతున్న మాలతి వైపు చూస్తూ—

"ఇంకెలా కావాలి మాలా? సుభ ఎక్స్‌కర్షన్‌కంటూ పోయి వుడ్‌బీని వెతుక్కుని తెచ్చుకుంది"

"ఏం .... అందులో తప్పేముంది? ఇప్పుడు సంధ్యను అమెరికా పంపు అన్నయ్యా" అంటున్న మాలతి మాటలకు తడబడి,

"నోనో...నా వుద్దేశం అది కాదు మాలా! అమెరికా మీద నాకిప్పుడు నువ్వను కునే మోజు లేదు. ఎలాగైనా అమెరికన్స్‌కు ఎటాచ్‌మెంట్స్ తక్కువ. మనలా ఒకళ్ళకోసం ఒకరు బాధపడరు" అంటూనే లేచిన సురేంద్ర ముఖంలో కనిపించిన నీలి నీడలు చూసి, ఆ టాపిక్ మార్చే వుద్దేశంతో తనూ లేచి నుంచున్నాడు సాగర్.

"అంకుల్! మీరిప్పుడు ఆఫీస్‌కెళ్తున్నారా? ఇంటర్వ్యూకు కరెక్ట్‌గా ఎనిమిది గంటలకు వస్తే చాలు కదూ" అంటున్న సాగర్ మాటలకు—

"అవును సాగర్...నాకు వేరే పనులున్నాయి. అవి చూసుకొని ఇంటర్వ్యూ బోర్డ్‌కు వస్తాను. నేను లేకపోయినా మిగతా ఆఫీసర్స్ కొశ్చన్ చేస్తారు. తెలివిగా ఆన్సర్ చేయగలిగితే ఉద్యోగం సిద్ధౌతుంది. సరిగ్గా ఎనిమిది గంటలకు అక్కడ వుండు. విష్‌యూ ఆల్ ది బెస్ట్" అంటూ చిన్నగా భుజం తట్టి ముందుకు కదిలాడు.





"యస్ అంకుల్! అయ్‌విల్ డూ మై బెష్ట్. థాంక్స్....థ్యాంకూ్య వెరీమచ్" అంటూ ఆయనతోపాటు గుమ్మం వరకూ వెళ్ళాడు. గారేజ్‌లో నుంచి కారు తీసుకొని స్వయంగా డ్రైవ్ చేసుకుంటూ వెళుతున్న సురేంద్ర వైపే చూస్తూ నిలుచున్న సాగర్ భుజంమీద చేయివేసింది మాలతి.

''పద టిఫిన్ చేద్దూగానీ. మీకూ టైమ్ అవుతోంది. ఈ రాకేష్ ఇంకా లేచినట్లు లేడు" అంటూండగానే "నేను రెడీ ఆంటీ! ఇంటర్వ్యూ విషయం మరచి పోతానా? ఆంధ్రదేశం నుంచి పిలిపించి వీడి ఆలనా పాలనా చూడలేదంటే ముందు సుభ ఫైటింగ్‌కు వస్తుంది" అంటూ వచ్చేశాడు రాకేష్.

"పద ఆంటీ... నేను కూడా ముందు టిఫిన్ చేసేస్తాను"అంటూ సాగర్ చేయి పట్టుకొని డైనింగ్ టేబులువైపు నడుస్తున్న రాకేష్‌తో "నువ్వున్నావన్న ధైర్యమే కదరా నన్నింత దూరం లాక్కొచ్చింది. మరో విషయం తెలుసా? అంకుల్ నాకు విషెస్ చెప్పి వెళ్ళారు. సరిగ్గా ఎనిమిది గంటలకు అక్కడ ఉండమన్నారు" అంటూ నవ్వుతున్న సాగర్ వేపు ఆశ్చర్యంగా చూశాడు రాకేష్.

"వాట్? నిజంగా!అంకుల్ ఇంటర్వ్యూ గురించి మాట్లాడారా? ఒరే! నీదగ్గర ఏదో మంత్రశక్తి వుందిరా...వచ్చిన ఒక్కపూటలోనే ఆంటీకి ప్రీతిపాత్రుడివైపోయి రాత్రి నా వాటాకి రావలసిన మీగడ కూడా స్వాహాచేశావు. మరో ముఖ్య విషయం ఆంటీ! సంధ్య ఎప్పుడయినా, ఎవరికయినా సారీ చెప్పగా విన్నారా? అలా చెప్పాల్సి వచ్చినా మీరు చెబితే తప్పనిసరిగా ఎవరికయినా చెప్పిందేమో కానీ...తనంతట తాను చేసిన తప్పు తెలుసుకొని, సారీ చెప్పడం మొట్టమొదటిసారిగా రాత్రే జరిగింది. రాత్రి మీరంతా పడుకున్న తర్వాత మా గదికి వచ్చి, నా ఫ్రెండ్‌కోసం నాకు సారీచెప్పి వెళ్ళింది" అంటూ గర్వంగా కాలర్ ఎగరేసుకున్నాడు రాకేష్.

"అదేం పని... సారీ చెప్పాల్సింది నాకయితే నీకుచెప్పి ఏం ప్రయోజనం?" అంటూ చిలిపిగా నవ్వుతూన్న సాగర్ వేపు చూస్తూ-

"సంధ్య చెప్పదలచుకుంటే నీకు ఈరోజు తెలుస్తుందిలే సాగర్!" అన్నాడు రాకేష్.

టిఫిన్ పూర్తిచేసి టీ తాగి, ఇద్దరూ కలిసి బైక్‌మీద ఆఫీసుకు బయలుదేరారు. ఎనిమిదికి పదినిముషాలు ముందుగానే ఆఫీసు చేరుకున్నారు. అప్పటికే దఖను నుండి నిరుద్యోగులు వచ్చి గేటుతీయని కారణంగా పేవ్‌మెంట్ మీదే పచార్లు చేస్తున్నారు.

"నన్నిక్కడ దింపేసి, నువ్వెళ్ళి నీ పని చూసుకోరా!" అంటున్న సాగర్ వేపు చూసి చెయ్యి పట్టుకొని చిన్నగా నొక్కి వదిలేస్తూ "ఆల్ రైట్..నేనుమళ్ళీ పన్నెండు గంటలకు వస్తాను. అప్పటికి ఇంటర్వ్యూ అయిపోతుంది. ఈలోపే అయిపోతే నువ్వే నాదగ్గరకురా. సెక్షన్ మేనేజర్ రాకేష్‌ను చూడాలంటే సరాసరి నాదగ్గరకు తీసుకొచ్చి వదిలేస్తాడు ప్యూన్. పక్క బిల్డింగే. ఓకేవిష్ యూ ఆల్ ది బెస్ట్. సర్టిఫికెట్స్ అన్నీ వున్నాయి కదా?" అంటున్న రాకేష్‌వేపు కృతజ్ఞతగా చూస్తూ తలవూపాడు సాగర్. చెయ్యి వూపుతూ ముందుకెళ్లాడు రాకేష్.

తనూ అక్కడున్న నిరుద్యోగుల

పక్కనే చేరి వాళ్ళు మాట్లాడుకునే మాటలు వింటున్నాడు. ఎక్కువ భాగం హిందీ, మరికొంతమంది మరాఠీ భాషలలో మాట్లాడుకుంటున్నారు.

ఎవ్వరూ తన భాష తెలిసినవాళ్లు వున్నట్లులేరు అనుకుంటూండగానే-

"మీరూ ఇంటర్వ్యూకి వచ్చారా?" అంటూ పలకరించాడొక యువకుడు నవ్వుతూ.

"అవునండీ. మీరూ ఆంధ్రదేశంనుంచే వచ్చారా?" అన్నాడు సాగర్ నవ్వుతూ.

"లేదండీ...మేం ఇక్కడే వుంటున్నాం చాలా సంవత్సరాలుగా. మీ ఫ్రెండ్ అనుకొంటాను మిమ్మల్ని డ్రాప్‌చేసి వెళుతూ తెలుగులో మాట్లాడ్డం విన్నాను. అందుకే తెలుగులో పలకరించాను. మరాఠీ, హిందీ, పంజాబీ అనర్గళంగా మాట్లాడగలను" అంటూ గర్వంగా కాలరెగరేస్తున్న అతన్ని చూస్తే నవ్వొచ్చింది సాగర్‌కు.

"అలాగా? రియల్లీ ఇటీజ్ వండర్ ఫుల్ టు నో సోమెనీ లాంగ్వేజెస్" అన్నాడు కాలక్షేపానికి ఏదో మాట్లాడాలి కనుక.

ఇంతలో గూర్ఖా వచ్చి గేటు తాళం తీశాడు. తోసుకుంటూ ముందుకెళ్ళిన అందరికీ వరండాలో వున్న ఛైర్స్ చూపించాడు ప్యూన్.

మరో పావుగంటలో ఇంటర్వ్యూ మొదలయింది. అప్పటికి ఒక్కొక్కరుగా మరో పదిమంది చేరారు. వున్నవి రెండు పోస్టులు. పోటీకి వచ్చినవారు ఇరవయి మంది. నిజానికి ఓరకంగా రెండుసీట్లకు ఇరవయిమంది తక్కువనే చెప్పాలి. అయితే ఈ కంపెనీ ఇంటర్వ్యూ కాల్ రావడం కూడా సామాన్యం కాదు. వాళ్లకు అన్ని సంతృప్తికరంగాతోచిన అప్లికెంట్స్‌నే ఇంటర్వ్యూకు పిలవడం జరుగుతుంది. అందులో మళ్ళీ వాళ్ళ తెలివితేటల్ని బట్టి, వాక్చాతుర్యాన్ని బట్టి వాళ్ళిచ్చే ఆన్సర్ సంతృప్తికరంగా బోర్డ్ మెంబర్సందరూ ఏకగ్రీవంగా అంగీకరిస్తే, వాళ్ళకు ఆ పోస్ట్ ఇవ్వడం జరుగుతుంది. ఆరుమాసాల్లో వర్క్‌లో ప్రూవ్ చేసుకోగలిగినవాళ్ళ పర్మినెంట్‌గా నిలబడతారు ఆఫీసులో. ఇదీ ఇక్కడి ప్రొసీజర్" అంటూ అంతక్రితం అనుభవం వున్న కాండిడేట్ తోటివారితో చెబుతున్నాడు. సగం హిందీ, సగం ఇంగ్లీషులో మాట్లాడ్డం వల్ల అతను చెప్పింది పూర్తిగా అర్థంకాలేదు సాగర్‌కు.

'ఏదో ఒక్కభాషలో ఏడవకూడదూ!' అనుకున్నాడు విసుగ్గా. ఒక్కొక్కరే లోపలకు వెళ్లి పదిహేను ఇరవైనిముషాల్లో తిరిగి వస్తున్నారు బయటికి. కొందరు మరో అయిదు నిముషాలు ఎక్కువ తీసుకుంటున్నారు టైమ్.

లోపలినుంచి బయటికి వచ్చినవాళ్ళ చుట్టూ మూగి ఏం జరిగిందో, లోపల ఏం ప్రశ్నలు వేశారో చెప్పమని వేధిస్తున్నారు కొందరు.

కొందరు ఏవో ప్రశ్నలడిగారని చెప్తే, మరికొందరు 'ఏం అడుగుతారు! మామూలే. ఇంటర్వ్యూలో అడిగే ప్రశ్నలన్నీ అడిగారు' అంటూ డొంక తిరుగుడుగా సమాధానం చెబుతున్నారు.

"ప్రకాష్‌రావు ... ప్రకాష్‌రావు" అంటూ ప్యూన్ వచ్చి పిలవగానే కాలర్ సర్దుకుంటూ లేచిన ప్రకాష్ సాగర్ వైపు చూసి చిరునవ్వు నవ్వుతూ ఠీవిగా లోపలికి వెళ్ళాడు.

"భాషా ప్రవీణ" అనుకొని సన్నగా





నవ్వుతున్నాడు సాగర్. పదిహేను నిమిషాల్లో బయటకు వచ్చిన ప్రకాష్ దాదాపు అడిగినవాళ్ళందరికీ దాదాపు ఆ వుద్యోగం తనకు రావడం ఖాయం అన్నట్లు చెప్పాడు. సగంమంది ముఖాలు మాడిపోయాయి. నిజంగా రిజల్ట్స్ తెలిసినట్లు అప్పుడే సాగర్‌తో కూడా ఆ విషయమే చెప్పి వెళ్లిపోయాడు ప్రకాష్.

మరో అయిదు నిమిషాలకు సాగర్‌కు పిలుపు వచ్చింది. చేతిలో వున్న ప్లాస్టిక్ బాగ్ తీసుకుని లోపలికెళ్లాడు. ఎదురుగా కూర్చుని వున్న అయిదుగుర్ని విష్ చేశాడు సాగర్. చిన్నగా నవ్వుతూ—

"టేక్ యువర్ సీట్ మిస్టర్ సాగర్" అన్నాడు సురేంద్ర నవ్వుతూ. "థాంక్యూ సర్" అంటూ వారికెదురుగా వున్న సీట్లో కూర్చున్నాడు సాగర్.

మిగతా నలుగురు పెద్దమనుషులూ తీక్షగా పరిశీలిస్తూ సాగర్‌ను ఏవేవో ప్రశ్నలు వేశారు. అన్నింటికి సంతృప్తికరంగా జవాబులిచ్చాడు సాగర్. అతని సర్టిఫికెట్స్ చూసి ఒకరికొకరు పాస్ చేసుకొన్నారు వారు. "అన్నింటా ఫస్ట్ క్లాస్ ఫస్ట్. స్పోర్ట్స్‌లో ఛాంపియన్. ఇటు చదువూ, అటు ఆటలూ అట్ ఎ టైమ్ ఎలా సాధ్యమైంది మిస్టర్ సాగర్?" సురేంద్ర వేసిన ప్రశ్నకు చిన్నగా నవ్వుతూ సమాధానం చెప్పాడు సాగర్—

"ఏదైనా సాధించాలంటే, పట్టుదల వుంటే మనిషి సాధించలేనిదంటూ ఏదీ లేదని నా నమ్మకం సార్! అంతేకాక నా ఇంట్రస్టుకు తగ్గ ప్రోత్సాహమిచ్చారు మా నాన్నగారు. అందుకే నేను కోరుకున్నవన్నీ కోరుకోవడంతోనే వూరుకోకుండా పట్టుదలగా వాటి కోసం ప్రయత్నించి సాధించడం నా ధ్యేయం సార్. అది మా నాన్నగారి ట్రైనింగ్" అంటున్న సాగర్ వైపు తృప్తిగా చూస్తూ—

"యువర్ ఫాదర్ ఈజ్ లక్కీ ఎనఫ్ టూ హావ్ ఎ నైస్ సన్ లైక్ యూ! హి షుడ్ బి ప్రౌడాఫ్ యూ" అంటున్న సురేంద్ర వైపు నవ్వుతూ చూస్తూ-

"నో సర్! అయామ్ లక్కీ ఎనఫ్ టూ హావ్ ఎ నైస్ ఫాదర్. అండ్ అయామ్ ప్రౌడ్ ఆఫ్ మై ఫాదర్ మిస్టర్ జగన్నాథ్..." సాగర్ మాట పూర్తి కాకముందే సురేంద్ర ముఖంలో రంగులు మారాయి. బహుశా తన తండ్రి పేరు సురేంద్రలో ఆ మార్పు తీసుకొచ్చి వుంటుందనుకున్నాడు సాగర్.

"ఎనీమోర్ కొశ్చన్స్ మిస్టర్ సేన్?" అన్నారు సురేంద్ర తనని తాను కంట్రోలు చేసుకుంటూ మిగతావారివైపు చూస్తూ.

నలుగురూ నవ్వుతూ తలలు అడ్డంగా వూపారు.

"మిస్టర్ సాగర్! నౌ యు కెన్ గో. యు విల్ బి ఇన్‌ఫాండ్ ది రిజల్ట్స్" అన్నారు అందులో ఒకరు.

అందరికీ నమస్కరించి బయటకు వచ్చాడు సాగర్. అప్పటికి పదకొండు కూడా కాలేదు.

తను నాన్నగారి పేరు అక్కడ తేకుండా వుండాల్సిందేమో? తమ టాపిక్ వస్తే మూడీగా అయిపోతారని ఆంటీ ముందే చెప్పినా తను మర్చిపోయాడు. అయినా అంత క్రితం అప్లికేషన్‌లో వుంది కదా నాన్నగారి పేరు. అప్పుడు సరిగ్గా గమనించి వుండరు. తన నోట వినగానే షాకులా తగిలుంటుంది. ఆలోచనలతోనే పక్క బిల్డింగ్ దగ్గరికెళ్ళి రాకేష్ కోసం కబురు చేశాడు.



రాకేష్ లోపలికి రమ్మన్నారని ప్యూన్ వచ్చి చెప్పగానే అతన్ని అనుసరించాడు.

ఏసీ రూమ్‌లో రివాల్వింగ్ ఛైర్‌లో కూర్చున్న రాకేష్ నవ్వుతూ సాగర్‌ను చూసి - "రా సాగర్! హౌవజ్ ది ఇంటర్వ్యూ?" అన్నాడు ఛైర్ చూపిస్తూ.

నవ్వుతూ జరిగిందంతా చెప్పాడు సాగర్.

"ఇంకేం... నీకు జాబ్ వచ్చినట్లే. కంగ్రాచ్యులేషన్స్ మైడియర్! ఊ... ఈ శుభ సందర్భంలో మనం ఆఫీసుకు హాఫ్‌డే లీవ్ పెట్టేసి, నిన్ను ఇంటికి తీసుకెళ్లి ఆంటీ చేత స్పెషల్ స్వీటు తినిపిస్తాం. ఆ తర్వాత ఫోంచేసి మీ వదినా, నువ్వూ, నేనూ మంచి మూడ్‌లో వుండే మరదలు మిరపకాయా కలిసి, మంచి హిందీ మూవీ చూద్దాం. అటునుంచటు జుహూ బీచ్, ఆతర్వాత మళ్ళీ ఇంటికి చేరి ఆంటీ పర్మిషన్ తీసుకొని...."

"స్టాప్ ప్లీజ్! ఇక నన్ను మాట్లాడనిస్తావా? నువ్వు ఇప్పుడు వేసిన ప్రోగ్రామ్స్‌లో ఆఫ్‌డే లీవ్ తీసుకొని ఇంటికి వెళ్లి ఆంటీ చేతి స్వీటు తినడం వరకూ వోకే! ఆ తర్వాత మాత్రం కాన్సిల్. ఎందుకంటే సాయంత్రానికి ఇంటర్వ్యూ రిజల్ట్స్ తెలుస్తాయి. అది తెలుసుకోకముందే నేనెటూ వెళ్ళదలచుకోలేదు"

"రిజల్ట్స్ త్వరగా తెలిస్తే ఆరు గంటలకు పిక్చర్‌కు వెళదాం"

"రేపు నేను దాదర్‌కు వెళ్లిపోతాను. రిజల్ట్స్ ఏమైనా ఆంటీ చేతి స్వీటు తిన్నా నన్న తృప్తి అయినా మిగులుతుంది"

సాగర్ గొంతులో ధ్వనించిన బాధకు రాకేష్ కుర్చీలోంచి లేచి సాగర్ దగ్గరగా వచ్చాడు.

"ఈ నిరాశావాదం ఎప్పుడు నేర్చుకున్నావురా? నువ్వెప్పుడూ ఇలా మాట్లాడగా నేను చూడలేదు. ఈ ఉద్యోగం నీకు రాకపోతే మరింకెవ్వరికీ రాదు. కావాలంటే బెట్ చేస్తాను. నీకున్నన్ని మెరిట్ సర్టిఫికెట్స్ ఎవడి దగ్గరున్నాయి? పైగా నీ దగ్గర వాళ్ళకు కావలసిన ఎక్స్‌ట్రా క్వాలిఫికేషన్స్ కూడా వున్నాయి. గుడ్ ఫిజిక్ వుంది. నీలాంటి హాండ్‌సమ్ యంగ్‌మాన్ వాళ్ళకంపెనీలో వుండటమంటే వాళ్ల కంపెనీకే క్రెడిట్" అంటూ భుజం తట్టాడు రాకేష్.

"ఇంక ఆపరా బాబూ! బొంబేలో భట్రాజు పొగడ్తలు నేర్చుకున్నావే... పద వెళదాం" అంటున్న సాగర్‌ను తీసుకొని ఇంటిదారి పట్టాడు రాకేష్.

ఇద్దరూ ఇల్లు చేరగానే రాకేష్ హడావుడిగా మాలతి దగ్గరకు పరుగెట్టాడు శుభవార్త చెప్పడానికి. అప్పటికే వంటగదిలో స్వీటు తయారుచేయటంలో మునిగివుంది మాలతి.

"ఆంటీ...నిజంగా మీకు దివ్యదృష్టి వున్నట్లుంది. అక్కడ మావాడు ఇంటర్వ్యూలో నెగ్గుకు వస్తాడని ముందే వూహించి, స్వీట్ తయారుచేస్తున్నారంటే మావాడి అదృష్టం ఏమని వర్ణించను?" అన్నాడు రాకేష్ సాగర్ వైపు చూస్తూ.

"అమాత్రం వూహించలేనట్రోయ్! ఎలాగూ నువ్వు స్వీట్ చేయమంటావని తెలుసు. సాగర్ ఇంటర్వ్యూలో నెగ్గుతాడనీ నమ్మకముంది. ఇంక చేయకుండా ఎలా వుంటాను?" అంటున్న మాలతి అభిమానాన్ని చూస్తున్న సాగర్ కళ్ళు అప్రయత్నంగానే తడిశాయి. ఇంతటి ప్రేమమూర్తి చేతుల్లో పెరిగి పెద్దయ్యే అదృష్టం తమకు లేకపోయిందే అనుకో




కుండా వుండలేకపోయాడు.

అప్పుడే అటుగావచ్చిన సుభను చూస్తూ, "సుభా! సంధ్య ఎక్కడా కని పించదేం? సాగర్ ఇవ్వాళ మనల్ని సినిమాకి తీసుకెళతాడట— వుద్యోగం వచ్చిన శుభ సందర్భంలో" అంటుండ గానే లోపలికి వచ్చింది సంధ్య. చిన్నగా నవ్వుతూ — "వుద్యోగం కన్‌ఫరమ్ అయినా కాకపోయినా సినిమా మాత్రం కన్‌ఫరమ్ అయినట్లేగా బావా?" అంది.

"ఏయ్ సంధ్యా! మావాడంటే ఏమి టనుకుంటున్నావ్? నూటికి నూరుపాళ్ళు వుద్యోగం కన్‌ఫరమ్ అయినట్లే. అలాగే పిక్చరూ. కనుక మంచి పిక్చర్ ఏది వుందో సెలక్ట్ చేసి పెట్టుకోండి" అన్నాడు రాకేష్.

"ఓకే...అలాగే" అంటూ వెళుతున్న సంధ్యను చూసి, "ఒరే సాగర్! ఇవ్వాళ అదృష్టం నిన్ను వరించిందిరా! అందుకే అడిగినవన్నీ వెంటనే అందుతున్నాయి. మరదలుపిల్ల మంచి మూడ్‌లో వుంది. బెస్ట్ పిక్చర్ సెలక్ట్ చేస్తుంది. పిక్చర్ గురించిన చింత మనకు లేదు. పద రూమ్‌లోకెళ్ళి కూర్చుని కబుర్లు చెప్పు కుందాం" అంటున్న రాకేష్ వైపు చూసి చిన్నగా నవ్వేడు సాగర్.

"నువ్వు వెళ్ళరా రాకేష్! కొంచం సేపు ఆంటీ దగ్గర కూర్చుని వస్తాను. ఈలోగా కొంచెంసేపు వదినగారికి కంపెనీ ఇవ్వు. నా కోసం హాఫ్‌డే లీవ్ పెట్టినందుకు పూర్తిగా నాతోనే గడిపావనే నింద నా మీదకు రానివ్వకు" అని భయంగా సుభ వైపు చూస్తూ అంటున్న సాగర్ మాటలకు రాకేష్‌తో పాటు, సుభా, మాలతీ కూడా పెద్దగా నవ్వేశారు.

"ఓకే.... అలాగేరా! పద డియర్! మన ఏకాంత మందిరానికి వెళదాం" అంటున్న రాకేష్‌ను మెల్లగా అనుస రించింది సుభ.

అనుకున్న ప్రకారంఅంతా సినిమాకు బయలుదేరారు. "ఆంటీ! మీరు కూడా రండి" అంటున్న సాగర్ మాటలకు కిలకిలా నవ్వుతూ-

"అవును ఆంటీ!సాగర్ అని ఈయనకు పేరెవరు పెట్టారో కానీ నిజంగానే సాగర మంత విశాల హృదయం అందరికీ సినిమాతో పాటు చక్కటి స్వీట్ పార్టీ కూడా ఇస్తారనుకుంటాను. అందుకే మేం ఎప్పుడు పిలిచినా 'సినిమాకా! నేనా?' అని కొట్టిపారేసే నువ్వు కూడా మౌనం దాల్చావంటే రియల్లీ హి ఈజ్ గ్రేట్!" అంటున్న సంధ్య మాటలకు నవ్వింది మాలతి.

"నువ్వన్నా అనకపోయినా సాగర్ హృదయం విశాలమే.అందుకే తప్పుచేసిన వాళ్ళను అవలీలగా క్షమించగలిగాడు" అంది మాలతి సాగర్ వైపు ఆపేక్షగా చూస్తూ.

మళ్ళీ సంధ్యకు ఎక్కడ కోపం వస్తుందో,ప్రోగ్రామంతా ఎక్కడ కాన్సిల్ అవుతుందోనని రాకేష్, సుభా భయంగా సంధ్య వైపు చూస్తున్నారు.

కానీ అలవాటుకు విరుద్ధంగా ఎందుకో సంధ్య మూడ్ ఆఫ్‌కాలేదు. పైగా కొంటెగా నవ్వుతూ-

"ఫర్వాలేదే! నిన్న వచ్చి ఈరోజుకు ఆంటీ చేత పొగడ్తలు పొందగలిగారంటే అది నిజంగా ఓ కాంప్లిమెంటే. అంత త్వరగా ఎవర్నీ మెచ్చుకోదు మా ఆంటీ. అందుకే..."ఇంకా ఏదో అనబోతున్న సంధ్యను మధ్యలోనే ఆపుతూ-



"స్టాప్ ప్లీజ్. టైమ్ అవుతోంది పిక్చర్‌కు. మొదటి నుంచీ పిక్చర్ చూడక పోతే నాకు బుర్రకెక్కదు. అందులోనూ ఏరికోరి హిందీ పిక్చర్ సెలక్ట్ చేశావు"

అంది శుభ సంధ్య చేయిపట్టి లేపుతూ.

"నేను రెడీ... నాదేం ఆలశ్యం లేదు. ఆసిస్టెంట్ మేనేజర్‌గారిదే ఆలశ్యం" అంది సాగర్ వైపు చూస్తూ కొంటెగా.

"ప్రొప్రైటర్‌గారు రెడీ అయితే ఇంక ఆలశ్యం చేయడానికి సేవకుడికి ఎన్ని గుండెలు?" అన్నాడు సాగర్ మరింత కొంటెగా సంధ్య కళ్ళలోకి చూస్తూ.

ఒక్కక్షణం మాత్రం అతని కళ్ళతో కలిసిన చూపుల్ని ప్రయత్నం మీద పక్కకు మళ్ళిస్తూ-

"మరి ఆంటీ కూడా వస్తుందా?" అని అడుగుతున్న సంధ్యకు సమాధానం సాగర్ చెప్పాడు.

"తప్పకుండా! మీరు బయలుదేరండి. అయిదు నిముషాల్లో నేను ఆంటీని తీసుకొస్తాను" అన్నాడు.

"ఓకే! నాన్నగార్ని కూడా పిలిచి వుండాల్సింది. అంతా కలిసి పిక్చర్ చూసి కొన్ని సంవత్సరాలైంది" అంటున్న సంధ్య వైపు చూస్తూ-

"మీ కోరిక అతి త్వరలో తీర్చగలనని మాటయిస్తున్నాను. ఇక తమరు బయలుదేరుతారా" అన్నాడు సాగర్.



"ఓకే! నేవెళ్ళి కారు తీస్తాను" అంటూ షెడ్‌వైపు పరుగెత్తింది సంధ్య.

చాలారోజుల తర్వాత ఆంటీ తమతో కలిసి సినిమాకు రావడంఆశ్చర్యంగానూ, అంతకుమించి ఆనందంగానూ వుంది సుభకూ, సంధ్యకూ. అందుకు కారణభూతుడైన సాగర్ మీద అభిమానం పెరిగింది.

ఎప్పుడూ ఎవర్నీ మెచ్చుకోని డాడీ నిన్న సాగర్‌నుపొగుడుతుంటే విచిత్రంగా అనిపించింది సంధ్యకు. ఒక్కరోజులో అందరికీ అతిసన్నిహితుడు కాగలిగిన అతని ప్రవర్తనా, మాటతీరూ సంధ్య మనసును పులకింప జేసిందనే చెప్పవచ్చు.

అందరినీ సినిమాకు తీసుకెళ్ళాలనగానే సాగర్ మనసులోమధనం ప్రారంభమైంది. పైగా సంధ్య పార్టీకూడా అడుగుతోంది. వాళ్ళకు పార్టీ ఇవ్వలేని తన అశక్తతకు మనసులోనే మధనపడ్డా పైకి మాత్రం కనబడనివ్వలేదు. కాని సాగర్ పరిస్థితి గ్రహించినట్లే ఆరోజు ఆఫీసు నుంచి ఇంటికి వచ్చాక సాగర్ గదికి వెళ్ళిన రాకేష్ బలవంతాన సాగర్ జేబులో మూడువందలు వుంచాడు.

"ఇదేంపని" అంటున్న సాగర్ వైపు నవ్వుతూ చూస్తూ-

"నీ మొదటి జీతం అందుకోగానే తిరిగి ఇచ్చేద్దూగానిలే. ఆడపిల్ల పార్టీ అడిగితే ఇవ్వలేకపోవడంకంటే బాధాకరమైన విషయం మరేముంటుంది" అంటున్న రాకేష్ వైపు చూసి చిన్నగా

నవ్వాడు సాగర్.

"ఆడపిల్ల కోసం అప్పుచేసి పార్టీ చేయాలనుకోడం అవివేకం. ఆ అర్హత నాకు లేనప్పుడు ప్రదర్శించుకోవడం ఏం బాగుంటుంది?" అన్నాడు.

"అవునవును...ఏంబావుంటుంది? ఒరే ఫూల్ నువ్వింకెప్పటికిరా బాగుపడేది? నాదగ్గర కూడా నీ పరిస్థితి దాచాలను కోడం ఏమిట్రా? నన్ను పరాయివాడి గానే చూస్తున్నావా?"

సాగర్ కళ్ళనిండా నీళ్ళు నిండాయి. రాకేష్ తలెత్తి సాగర్ వైపు చూసేక్షణాన అవి సాగర్ చెంపల మీదుగా జారి రాకేష్ చేతుల మీదపడ్డాయి.

"నిన్ను బాధపెట్టడం నా అభిమతం కాదు. వుద్యోగానికి ముందే అప్పు చేయడ మెందుకనుకున్నాను. ఆల్ రైట్...నీ ఇష్ట ప్రకారమే కానివ్వు. ప్రస్తుతం నిన్ను సంతోషపెట్టడమే నా ధ్యేయం. ఆ డబ్బిలాయివ్వు. సీమ మిరపకాయ కోరికా, నీ కోరికా తీర్చేస్తానివ్వాళ" అంటున్న సాగర్ జేబులో నోట్లు కుక్కుతూ వీపున ఒక్కటి చరిచాడు రాకేష్.

"బ్రేవో మై బోయ్...! ప్రొసీడ్! ఇన్నాళ్టికి నేను చెప్పిన మాట ఒకటి విన్నావు. మరొకటి కూడా విన్నావంటే బాగుపడతావు"

"ఈసారికి ఈ మాట చాలు. అన్నీ ఒక్కసారే బుర్రలోకి ఎక్కించావంటే అజీర్తి చేస్తుంది" అంటున్న సాగర్ మాటలు పూర్తికాకుండానే గదిలోకి వచ్చింది సంధ్య.

"అదేవిటి బావా! అజీర్తి చేయడం కడుపుకురాదూ! మరి మీ ఫ్రెండ్ బుర్రకు అజీర్తి అంటున్నారు కొంపదీసి..." అంటూ చెవి దగ్గర చూపుడు వేలితో స్క్రూ తిప్పినట్లు చూపిస్తున్న సంధ్య మాటలకు నవ్వుతూన్న రాకేష్‌తో శృతి కలిపాడు సాగర్.

"అవునవును. స్క్రూ లూజ్ అయిం దంటే మరి బుర్రకు అజీర్తన్నట్టే కదా!" అన్నాడు సాగర్.

"బావా! మీ ఫ్రెండ్ వచ్చిన వేళా విశేష మేమిటోగానీ అందరూ మంచి మూడ్స్‌లో వున్నారు. అత్తయ్యలో ఎప్పుడూ కన్పించని ఆనందం కనిపిస్తోంది. అత్తయ్య ఎప్పుడూ అలా నవ్వుతూ వుంటే చూడా లనిపిస్తోంది" అంటున్న సంధ్య మాట లకు రాకేష్ వింతగా చూశాడు.

ఈ పెంకిపిల్లలో కూడా అత్తయ్య ఆనందం గురించిన బాధ వుందన్న మాట. ఎందుకుండదు? తమ కోసమే తన జీవితాన్ని అంకితం చేసి, తన స్వసుఖాలు వదులుకున్న అమృతమూర్తి పట్ల హృదయం నిండుగా ఆపేక్ష నింపు కోడంలో అసంబద్ధమేముంది?

"అసలు విషయం మరిచిపోయాను. అత్తయ్య పిలుస్తోంది మీ సాగరమూర్తిని" అంటూ పరుగెత్తుతున్న సంధ్య వైపు చూసి నవ్వుతూ డైనింగ్ హాలు వైపు నడిచారు మిత్రులిద్దరూ.

చాలా సంవత్సరాల తర్వాత ఇన్నాళ్ళకు పిక్చర్‌కు బయలుదేరింది మాలతి. సంధ్య డ్రైవ్ చేస్తుంటే పక్కన సాగర్, వెనక సీట్‌లో సుభా, మాలతి, రాకేష్ కూర్చున్నారు. వెనక కూర్చో బోయిన సాగర్‌ను సుభ ఆపింది.

"ముందు కూర్చో సాగర్! ఫ్రీగా వుంటుంది" అంది. రద్దీగా వున్న హైవే మీద కూడా అతి నేర్పుగా డ్రైవ్ చేస్తున్న సంధ్యనే చూస్తున్నాడు సాగర్.

వున్నట్లుండి సంధ్య అడిగింది-




"నీలో ఎంత మార్పు వచ్చిందో తెలుసా? ఎప్పుడూ ఇంత సంతోషంగా, సరదాగా వుండవేమత్తయ్యా?" అంది మాలతి నోరు విప్పకుండానే సాగర్ సమాధానం చెప్పాడు-

"ఇక ముందెప్పుడూ కూడా ఆంటీ ఇలాగే సంతోషంగా, సరదాగా వుండేలా చూసుకునే బాధ్యత మీదే" అన్నాడు- వెనక్కి తిరిగి మాలతి వైపు చూసి నవ్వుతూ.

థియేటర్‌లో కూడా సంధ్య సాగర్ పక్కనే కూర్చోవలసి వచ్చింది. అది అంతగా ఆలోచించాల్సిన విషయంగా అనిపించకపోయినా అలవాటులేని సంధ్యలో సరికొత్త అనుభూతి కలిగింది.

ఎన్నోసార్లు బస్సులో, థియేటర్స్‌లో అపరిచిత మగాళ్ళపక్కనకూర్చోవాల్సిన సందర్భాలలో ఎప్పుడూ అలా బెరుకుగా, భయంగా అనిపించలేదు. మూర్తీభవించిన పురుషాకృతిలో తీరైన కనుముక్కు తీరుతో సాగర్ తనపక్క జంటగా నడుస్తూంటేనే మనసులో తెలియని వింత స్పందన మొదలైంది. దానికి తగ్గట్టు అనుక్షణం నవ్వుల్తో తేలించే సాగర్ మాటలూ, ప్రవర్తనా సంధ్యను బాగా ఆకట్టుకున్నాయి. తనకు తెలియకుండానే సాగర్ అంటే ఒకరకమైన ఇష్టం కలుగుతోంది.

ఆ ఇష్టాన్నే ప్రేమంటారేమో? అతను మనసారా నవ్వుతూంటే అలా ఎంతసేపైనా ఆ ముఖంలోకి చూస్తూవుండాలనిపిస్తోంది. వసపిట్టలా కబుర్లు చెప్పే సంధ్య మొత్తానికి సాగర్ సమక్షంలో అతని గురించిన ఆలోచనల్లోనే మునిగి పిక్చర్ కూడా సరిగ్గా చూడలేకపోయింది.

ఇంటర్‌వెల్‌లో సాగర్, రాకేష్ వెళ్ళి అందరికీ కూల్‌డ్రింక్స్ పట్టించుకొచ్చారు.

ఆ సాయంత్రం అందరికీ ఎంతో హాయిగా సంతోషంగా గడిచినట్లనిపించింది. సాగర్ కూడా పుట్టి బుద్ధెరిగాక తన ఆత్మీయులమధ్య అంత సంతోషంగా గడిపిన రోజు అదేననిపించింది.

ఆరోజు సాగర్ ప్రయాణమౌతుంటే మాలతికి మాటిమాటికీ కళ్ళు చమరుస్తున్నాయి. సాగర్ పరిస్థితీ అలాగే వుంది. ఇన్నాళ్ళూ ఎవరెవరో తెలియని ముందు ఈ బాధలేదు. [illegible] ఆ ఆత్మీయురాలికి దూరంగా పోవాలంటే బాధగా వుంది.

సురేంద్ర ఆఫీసుకు వెళ్ళబోతుంటే ఆయన దగ్గరగా నడిచి-

"అంకుల్! నేనీరోజు వెళుతున్నాను" అన్నాడు సాగర్.

"అంకుల్ !" ఆ పిలుపులో ఏం మహత్యముందో సురేంద్ర ఒక్కసారిగా బిగుసుకుపోయాడు. ఏదో అనాలని సాగర్ భుజంమీద చేయివేసి మెల్లగా తట్టి, పళ్ళ బిగువున తనలో వువ్వెత్తున లేచే భావతరంగాలను కంట్రోలు చేసుకుంటూ, పెదాలమీదకు నవ్వు తెచ్చుకొని-

"ఆల్ రైట్ మై బోయ్! కమ్ సూన్! ఎంత త్వరగా వచ్చి జాయిన్ అయితే అంత మంచిది. ఇల్లు దొరికేవరకూ మనింట్లోనే వుండు...వస్తాను. ఆల్ ది బెస్ట్" అంటూ గబగబా వెళ్ళిపోయాడు.

సురేంద్ర వైపే చూస్తున్న సాగర్ కళ్ళలో కదలాడిన భావాల్ని ఒక్కసారి వెనక్కు తిరిగి చూడగలిగివుంటే, సురేంద్ర అంత త్వరగా వెళ్ళగలిగేవాడు కాదు.

అంతా మౌనంగా వుండటం చూసిన సంధ్య చిన్నగా నవ్వుతూ-

"డాడీ వెళ్ళిపోయారు. కూర్చోండి" అంది సాగర్ వైపు చూస్తూ.

"పొలెం వెళ్ళి నాన్నగారికీ, చెల్లాయికీ ఈ శుభవార్త చెప్పి వెంటనే బయలుదేరి రావాలి సాగర్" అంటున్న రాకేష్ వైపు చూశాడు సాగర్.

"ఎలాగూ నెక్స్‌ట్ వీక్ వచ్చి జాయిన్ అవమని చెప్పారు అంకుల్. అప్పటికల్లా మాకో చిన్న ఇల్లు చూసి పెట్టాల్సిన బాధ్యత నీది. ఏకంగా నాన్నగారినీ, చెల్లాయినీ తీసుకొని వచ్చేస్తాను" అంటున్న సాగర్‌వైపు భయంగా చూశాడు రాకేష్.

"బాబోయ్! వారం రోజుల్లో మీకు ఫ్లాట్ చూడటమంటే సంధ్యను బాట్‌మింటన్‌లో ఓడించినంత తేలికనుకున్నావా? అందుకు ఎంత లేదన్నా మూడు నాలుగు నెలల టైమ్ పడుతుంది. అందుకే ప్రస్తుతం నువ్వొక్కడివే వచ్చేసేయ్. ఆ తర్వాత ఇద్దరం కలిసి గాలించి ఓ ఫ్లాట్ నెల. రెండు నెలల్లో సాధించగలిగితే అప్పుడు వెళ్ళి చెల్లాయినీ, నాన్నగారినీ తీసుకురావడమో లేదా పిలిపించడమోచేయవచ్చు" అన్నాడు రాకేష్.

"మా బావ ఫ్లాట్ చూసి మీవాళ్ళను తీసుకురావాలంటే అది ఈ జన్మకు సాధ్యంకాదు. మా బావ నన్ను టెన్నిస్‌లో గెలిచినంత ఒట్టు." సంధ్య మాటలకు అందరూ నవ్వారు.

మరికొంతసేపు అలా కబుర్లమధ్య గడిచిపోయింది. ఉన్నట్లుండి సంధ్య మాలతి వైపు తిరిగి–

"ఆంటీ...! నువ్వు మహాలక్ష్మి గుడి కెళ్ళాలన్నావు కదూ! ఈరోజు వెళదాం. సాగర్‌ను స్టేషన్‌లో డ్రాప్ చేద్దాం" అంది మెరిసే కళ్ళతో.

సంధ్య వైపు ఆప్యాయంగా చూస్తూ– "అలాగేనమ్మా! తప్పకుండా వెళదాం. బాబును స్టేషన్‌వరకూ పంపినట్లుంటుంది. మనం గుడికి వెళ్ళి రావచ్చు" అంటూ సంధ్య తల నిమిరింది మాలతి.

చిన్నగా నవ్వి సంధ్య వైపు చూస్తూ, "థాంక్యూ సంధ్యా!" అన్నాడు సాగర్.

సాగర్ గొంతులో ధ్వనించిన ఆత్మీయతకూ, అతని నోట తన పేరు వినిపించిన తీయకూ తనను తాను మరచిపోయి అతనివైపు చూస్తూండిపోయిన సంధ్య, అతని చూపుల్లో చిక్కుకుపోయి అలాగే వుండిపోయింది బదులుగా ఏం చెప్పకుండా.

"మరపలుపిల్లా..అరగంటలో బయలుదేరాలి. త్వరగా కానివ్వు నీ మేకప్. ఈలోగా మేం కూడా రెడీ అవుతాము" అంటూ రాకేష్‌తో పాటూ లేస్తూ "మీరూ గుడికి వస్తారా?" అంది సుభ.

"వెళ్ళేది గుడికైనా ఒక మగతోడు వుంటే అన్నివిధాలా మంచిది" అన్నాడు రాకేష్.

"వాళ్ళ ఫ్రెండ్ మూలంగానైనా రాకేష్‌ను కొంత పుణ్యం సంపాదించుకోనివ్వు. వట్టిఅప్పుడు ఎలాగూ రాడు" అంది మాలతి.

"అత్తయ్యా! త్వరగా రెడీ అవ్వండి మీరు కూడా. సాగర్‌కు ట్రైన్ టైమ్ అవుతోంది" అంటూ లేచిన సుభ రాకేష్‌ను అనుసరించింది.

సాగర్, మాలతీ మిగిలారు హాల్లో.

"ఆంటీ! నాన్నగారికి ఏం చెప్పమంటారు?'' అంటున్న సాగర్ వైపు చూసిన మాలతి కళ్ళలో సన్నటి నీటి

 

పొర కదలాడింది.

"ఇక్కడి విషయాలేమీ మీ నాన్న గారికి తెలియనీకు సాగర్. నువ్వు ఉద్యోగం సంపాదించింది సురేంద్ర దగ్గర అన్న విషయం తెలిస్తే మీ నాన్న ఆ ఉద్యోగం మనకొద్దు వొదులుకోమని అనవచ్చు. ఇన్ని సంవత్సరాలకు మళ్ళీ అందరం కలుసుకొనే అవకాశం వచ్చింది. ఆ అవకాశాన్ని ఎట్టి పరిస్థితుల్లో జారనివ్వకు సాగర్" అంది మాలతి. నిన్ను చూడగానే ఆశలు పెంచుకున్నాను బాబూ! మనందరి కలయిక నీ ద్వారానే జరగాలి. సంధ్యా,నువ్వూ ఒక్కటవ్వాలి. పార్వతి ఆశ నెరవేరాలి. మళ్ళీ మన మంతా ఒకేచోట కళకళలాడుతూ మనగలగాలి. ఇదే నా చివరి వాంఛ. అది తీరుస్తానని మాటివ్వు బాబూ!" అంటూ సాగర్ తలమీద చేయివేసి ఆప్యాయంగా నిమురుతున్న మాలతి చేతులు తన చేతుల్లోకి తీసుకున్నాడు సాగర్.

"తప్పకుండా అంటీ! మీ కోరిక తీర్చడానికి నా శాయశక్తులా ప్రయత్నిస్తాను. నాన్నగారికి ప్రస్తుతం ఇక్కడి విషయాలేమీ చెప్పను. నాకు ఉద్యోగం దొరికింది. ఇంక మీరు ఉద్యోగం మానెయ్యండని చెబుతాను... సరేనా?"

"చాలు బాబూ! నువ్వు ఆ భరోసా ఇస్తే నేను నిశ్చింతగా వుంటాను. ఇన్నాళ్ళుగా పడ్డ మానసిక వేదన అంతా నిన్ను చూసి, నీ మాటలు వినడంతో తీసివేసినట్లయింది" అంది మాలతి.

"రాధ పాట వింటే నన్ను కూడా మరిచిపోతావు అంటీ!"

"నిజమా సాగర్...రాధ బాగా పాడుతుందా?"

"నాన్నగారు దగ్గరుండి వీణ నేర్పించారు. రాధ పాడుతుంటే కళ్ళు మూసుకుని కూర్చున్న నాన్నగారి కళ్ళు అవిరామంగా వర్షిస్తాయి. అదిచూసి రాధ పాట ఆపితే 'పాడమ్మా..పాట ఆపకు. నువ్వలా పాడుతూంటే మళ్ళీ మీ అమ్మ పాడుతున్నట్లే దివ్యానుభూతి కలుగుతోంది' అంటారు అంటీ!"

"అవును బాబూ! మీ అమ్మ పాడితే అది ఓ దివ్యగానంగా వినేవాళ్ళు శ్రోతలందరూ. మళ్ళీ అంత చక్కటి కంఠం రాధ సొంతం చేసుకుందన్నమాట" అంటున్న మాలతి కంఠం సన్నగా కంపించింది.

గత విషయాలన్నీ జ్ఞప్తికివచ్చి కళ్ళు చెమర్చడంతో సోఫాలోంచి లేచింది.

"పద బాబూ! ట్రైన్ టైమ్ అవుతోంది. వెళ్ళి ముఖం కడుక్కొని రెడీ అవ్వు. ఈలోపు కాఫీ కలుపుతాను" అంటూ వంటగది వైపు వెళుతున్న మాలతినే చూస్తూ నుంచున్నాడు సాగర్.

ఆత్మబంధువులంతా ఆదరంగా వీడ్కోలు చెప్పగా ఓపక్క సంతోషం, ఓపక్క బాధా మనసునిండగా కళ్ళలో తడీ, పెదవులపై చిరుదరహాసంతో కంపార్ట్‌మెంట్ వాకిట్లో రెండు చేతులతో కువ్వలు పట్టుకొని నుంచున్నాడు సాగర్.

మాలతికి గతస్మృతులు కళ్ళముందు కదలాడి పదే పదే జగన్ జ్ఞాపకాలు అనుక్షణం మరింత తాజాగా అవుతుంటే తనలోతానే నవ్వుకుంది.

ఇప్పటికి పార్వతిని రాధలో చూసుకుంటున్న జగన్ మనసులో తనకు చోటులేకపోవడం ఎంతటి దురదృష్టం.

"ఇవిగోండి పుస్తకాలు. ప్రయాణంలో బోర్ కొట్టకుండా వుంటుంది తీసుకోండి" అంటూ రెండు పుస్తకాలు తన చేతి

కిస్తున్న సంధ్య కళ్ళలోకి గుచ్చి చూస్తూ చిరునవ్వుతో–

"థాంక్స్ ఎ లాట్ సంధ్యా!" అన్నాడు సాగర్.

సాగర్ చూపులతో తన చూపులు కలవగానే కలవరపడి చూపులు తిప్పేసుకుంటూ, గంభీరత నటిస్తూ రాకేష్‌వైపు తిరిగి–

"బావా! మరి నీ ఫ్రెండ్ వచ్చేసరికి ఇల్లు చూసి వుంచుతావన్నమాటేగా? ఆయన వాళ్ళ నాన్నగారినీ, చెల్లాయినీ తనతోనే తీసుకురావచ్చుగా!" అని అడిగింది కొంటెగా.

"లంకంత మీ కొంపవుండగా ఇంకా ఇల్లు చూడవలసిన శ్రమ నాకేం మరదలా! అతిథి మర్యాదలు చేయడానికి ఒకళ్ళకు ఇద్దరు అక్కాచెల్లెళ్ళున్నారు. ఇంక నాకేం భయం?" అని రాకేష్ సుభ వైపు చూసి కొంటెగా కన్నుగీటాడు.

"అంతా నీలా మావగారింట్లో వుంటానికి ఇష్టపడవద్దూ!" అన్నాడు సంధ్య వైపు చూస్తూ.

ఆ మాటలకర్థం సంధ్యకు అర్థం కాలేదు. కానీ అర్థమైన మాలతి – "ఇప్పుడలాగే అంటావు సాగర్! రేపు నీ పెళ్ళయింతర్వాత భార్యను నొప్పించలేక మావగారిని తృప్తిపరచడానికి నీకిష్టం లేకున్నా మామగారింట ఇల్లరికాన్ని ఒప్పుకోక తప్పదు" అంది.

"మీరలా అంటే ఇంక తప్పేదేముంది ఆంటీ! మీ ఆజ్ఞను శిరసావహించక తప్పదు" అంటూ చిన్నగా తలవంచి నమస్కరించాడు సాగర్.

గార్డ్ విజిల్ వేశాడు. ఉలిక్కిపడి తలపైకెత్తి సాగర్‌వైపు చూసింది సంధ్య. అనురాగం నిండిన కన్నులతో తనవైపే చూస్తున్న అతన్ని చూస్తుంటే ఇతని కోసమే తానిన్నాళ్లూ నిరీక్షించినట్లుగా అనిపించింది. చలించకూడదనుకున్న తన మనసు విచిత్రంగా ఇతన్ని చూసిన మరుక్షణంనుంచి స్పందించడం మొదలు పెట్టింది. తనలో కలిగిన ఈ మార్పు తనకే వింతగా వుంది.

ఎవరివైపైనా సూటిగా చూడగలిగిన తను ఇతనివైపు చూడాలంటే భయంవేస్తోంది. అందమైన, అనురాగం నిండిన ఆ కళ్ళలో చిక్కుకున్న చూపులు విడివడటం కష్టమైపోతోంది. చుట్టుపక్కల వున్న మనుషుల్నీ, పరిసరాల్నీ మరచి అదేదో లోకంలోకి వెళ్లిపోతోంది. తన మనసు దాచుకోవాలని ప్రయత్నించలేదు. అందుకే అతనివైపు చూసిన ప్రతిసారీ దొంగలా పట్టుబడిపోతోంది అందరి మధ్యా. ఆలోచనల్లో మునిగిన సంధ్య బండి కదలడంతో నవ్వుతున్న సాగర్ వైపే చూస్తూ చెయ్యి వూపింది. కానీ ఆమె పెదాలమీద నవ్వులేదు. అతి ప్రియమైనదేదో తననుంచి దూరమవుతున్న అనుభూతి కలిగింది.



పల్లె చేరిన సాగర్ ముఖం చూడగానే కనిపెట్టింది రాధ–అన్నయ్యకు ఉద్యోగం వచ్చిందని. నవ్వుతూ ఎదురొచ్చిన చెల్లెలి చేతికి తను తెచ్చిన స్వీట్ పాకెట్స్

ఇస్తూ- "రాధీ... నీ పూరీల మహాత్యం! నాకు వుద్యోగం వచ్చింది" అన్నాడు నవ్వుతూ.

స్నానం చేసి అప్పుడే లోపలికి వస్తున్న జగన్నాథరావుకు సాగర్‌కు వుద్యోగమొచ్చినట్లు తెలియగానే ఆనందంతో కళ్ళు చెమర్చాయి.

ఇన్నాళ్ళకి సాగర్ ముఖాన స్వచ్ఛమైన చిరునవ్వు చూడగలిగాడు.

రాకేష్ తనను ఆదరించిన విధం, అక్కడ వాళ్ళ ఆంటీ, అంకుల్‌తో పరిచయం, వాళ్ళందరి ఆత్మీయతా గలగలా మాట్లాడేస్తున్న సాగర్‌ను చూస్తే జగన్నాథరావుగారికి విచిత్రంగా అనిపించింది. ఒక కుటుంబాన్ని గురించిన పొగడ్త సాగర్ నోట వినడం అదే మొదటిసారి ఆయనకు. అదీకాక తండ్రి దగ్గర సాగర్‌కి ఎప్పుడూ అంత ఎక్కువగా మాట్లాడే అలవాటు లేదు. అందుకే సాగర్ వాక్ ప్రవాహానికి మధ్యలోనే ఆనకట్టవేస్తూ, "మొత్తానికి బొంబాయి ప్రయాణం నీలో చాలా మార్పు తీసుకొచ్చిందిరా సాగర్! బొంబాయి మహత్యమో, రాకేష్ మహత్యమో, ఆ ఇంటివారి ఆప్యాయతల మహత్యమో... ఏదైనాకానీ నీలో ఓకొత్త వుత్సాహాన్నీ, నీ మొఖంలో సరికొత్త కాంతినీ నింపాయి" అంటున్న జగన్నాథ రావుగారి మాటలతోగానీ, తనెంత వుద్రేకంగా, ఉత్సాహంగా మాట్లాడాడో అర్థంకాలేదు సాగర్‌కు. అర్థమవ్వగానే సిగ్గుపడ్డాడు.

ఓ ప్లేటులో మిఠాయిలు, మంచి నీళ్లూ పట్టుకొచ్చిన రాధ "నాన్నా! అన్నయ్యకు వుద్యోగం వచ్చిన శుభ సందర్భంలో రాకేష్ అన్నయ్య పంపించాడీ స్వీట్" అంది. రాధ వైపు చూసి ఆశ్చర్యంగా-

"అది రాకేష్ ఇచ్చాడని నీకెవరు చెప్పారే!" అంటున్న సాగర్ వైపు కొంటెగా చూసింది రాధ.

"నాకు దివ్యదృష్టి వుందిలే. అందుకే ఇకనుంచీ నాదగ్గర అబద్ధమాడే ముందు కాస్త ఆలోచించి అబద్ధాలాడటం మంచిది" అంటూ కాఫీ తేవడానికి లోపలికి వెళ్లింది. ఆ వెనకే వంటగదిలోకి వెళ్లి రాధ చెవి పట్టుకున్నాడు సాగర్.

"అసలు నీకెలా తెలిసింది?" అంటూ స్వీట్ పాకెట్ తీసి ఇటూ అటూ తిప్పుతున్న సాగర్‌కు పక్కనే పడివున్న పేపర్ కనిపించింది.

"ప్రియమైన చెల్లాయి రాధకు రాకేష్" అని వుంది.

అది చూసి పెద్దగా నవ్వేస్తూ, "ఓరి రాస్కెల్" అని స్వగతంగా అనుకొని "పోన్లే... ఏ అన్నయ్య కొంటే ఏం నీకు కావలసింది స్వీట్స్‌గా" అన్నాడు.

"ఆ...నాకు కావలసింది స్వీట్ కాదు" అంటూ కాఫీ గ్లాసు అందిస్తున్న రాధ తల మీద చేయి వేసి నిమురుతూ "ఇంక నీకేం కావల్సినా నిర్భయంగా అడుగు రాధీ... నాన్నగారిని వుద్యోగం మానేసి ఇంక విశ్రాంతి తీసుకోమని అడుగుతాను. మన కోసం ఇన్నాళ్ళూ పడ్డ శ్రమ చాలు. ఇంక ఆయన్ని కష్టపడనివ్వను. ఆ కంపెనీలో స్టార్టింగే మంచి జీతం ఇస్తారు. ముందు ముందు ఇంకా పెంచుతారు. ఇక మన కష్టాలు గట్టెక్కినట్లే. నేను వెంటనే వెళ్లి జాయిన్ అవ్వాలి. ఆ తర్వాత సాధ్యమైనంత త్వరలో ఇల్లు చూసి, మిమ్మల్ని తీసుకెడతాను" అంటున్న సాగర్ వైపే



చూస్తున్న రాధ కళ్లలో నీళ్లునిండాయి.

"అన్నయ్యా! సంపతన్నయ్య కూడా నీలా ఆలోచించి వుంటే మన పరిస్థితి ఇంత అధ్వాన్నంగా వుండేదా?" అంది.

"ఇప్పుడవన్నీ ఎందుకమ్మా! ఇంక అవన్నీ మర్చిపో. నువ్వు అక్కడ మ్యూజిక్ స్కూల్లో చేరి నీ సంగీతానికి మరింత మెరుగులు దిద్దుకోవచ్చు. నీకు తోడుగా సుభ వదినా, సంధ్యా వున్నారు. అందర్నీ మించిన, అమ్మను మరిపించే



ఆంటీ వున్నారు. నువ్వు వాళ్ళందర్నీ చూశావంటే, ఎంత సంతోషపడతావో చెప్పలేను. ఎవరికివారే ఎంతో ఆత్మీయంగా, ఆప్యాయంగా మాట్లాడతారు" అంటూ కలల్లో తేలిపోతూ అక్కడి విషయాలు చెబుతున్న అన్నవైపు చిత్రంగా చూసింది రాధ.

"నువ్వు వాళ్ళింట్లోనే వున్నావా అన్నయ్యా? సంధ్య ఎవరు? ఆంటీ ఎవరు?" అని అడిగింది కుతూహలంగా. సుభ పేరు అంతక్రితమే వినివుండటం వల్ల సుభ రాకేష్ భార్యని తెలుసు. మరి ఈ సంధ్యా, ఆంటీ ఎవరు! వాళ్ళను గురించి కూడా అన్న అంత గొప్పగా చెబుతున్నాడంటే వాళ్ళు చాలా మంచివాళ్ళై వుండాలి.

అన్నను అంతగా ఆకర్షించిన ఆ కుటుంబ సభ్యులను చూడాలనే ఆత్రుత రాధలో పెరిగిపోయింది.

ఆరోజంతా సంతోషంగా గడిచిపోయింది రాధకు. అన్నకు బొంబాయిలో పెద్ద వుద్యోగం వచ్చిందన్న వార్త తన ప్రియసఖి శోభతో చెప్పి మురిసిపోయింది. శోభ కూడా ఆ వార్త విని తన ఆనందాన్ని వ్యక్తపరిచింది. అన్న తెచ్చిన స్వీట్స్ శోభకు ఇచ్చి-"అన్నయ్య ప్రత్యేకంగా నీకోసం తెచ్చాడు" అని చెప్పింది. ఆ మాట విన్న శోభ బుగ్గలు సిగ్గుతో ఎర్రబడటం చూసి-

"సిగ్గంతా ఇప్పుడే ఒలికించకు. ముందుముందు ఇంకా అవసరం రావచ్చు" అంటున్న రాధ మాటలకు శోభ అక్కడినుంచీ లేచి పారిపోయింది. చెయ్యి పట్టుకొని పారిపోతున్న శోభను ఆపుతూ-"అన్నయ్య పేరు చెబితేనే పరవశించిపోయే నీ మనసు నా దగ్గర ఇంకా దాచాలని ప్రయత్నమా?" అంది నవ్వుతూ.

"ఇన్నాళ్ళూ అన్నయ్యకు ఉద్యోగం లేదు. మీ నాన్నగారి అంతస్థును అందుకోలేకపోయినా, వాడూ వుద్యోగస్థుడయ్యాడు. తన కుటుంబాన్ని పోషించగల అర్హతను సంపాదించుకున్నాడు. ఇప్పుడు మీ నాన్నగారు అభ్యంతరం చెప్పరనే ఆశిద్దాం. మీ నాన్నగారికి నువ్వు చెబుతావా? మా నాన్నగారికి చెప్పి అడిగించమంటావా? మరీ ఆలశ్యం చేస్తే అన్నయ్య ఏ బొంబాయి సుందరినో వరిస్తే ప్రమాదం" అంటూ చిన్నగా నవ్వుతున్న రాధవైపు భయంగా చూస్తూ-

"రాధా! మా నాన్నగారు ఒప్పుకుంటా

రన్న నమ్మకం నాకు లేదు. మీ నాన్న గారు వచ్చి అడిగితే ఆయన ఏమైనా అని అవమానిస్తే... ఊహూ వద్దు. సమయం చూసి నేనే ఎలాగో అమ్మకు చెప్పి నాన్న గారికి చెప్పిస్తాను. ఆ తర్వాత అదృష్టం ఎలా వుంటే అలా జరుగుతుంది" అంది శోభ.

"అన్నట్లు ఈ మిఠాయి తీసుకెళ్ళి అత్తయ్యకు ఇచ్చి దానితో పాటు అన్నయ్యకు ఉద్యోగం వచ్చిన విషయంకూడా చెప్పు. నువ్వు చెప్పబోయే మాటకు నాందిగా ముందీ శుభవార్త చెప్పు" అంటూ స్వీట్స్ ఇచ్చింది రాధ. స్వీట్స్ అందుకుని నవ్వుతూ వెళుతున్న శోభకు ఎదురుగా సాగర్ రావడంతో ఒక్క క్షణం గడపలో అలాగే నిలబడి పోయింది శోభ.

రాధ నవ్వుతూ–

"ఫర్వాలేదు...మంచి శకునం. వెళ్ళు శోభా!" అనడంతో సిగ్గుగా చూపులు కిందకు వాల్చి తన పక్కనుంచి దూసుకొని పరుగెడుతున్న శోభ వైపు ఆశ్చర్యంగా చూస్తూ–

"ఏవిటే రాధీ! ఇవ్వాళ మీ సఖి ముఖంలో ఎక్కడలేని ఆనందం కనిపిస్తోంది ఏవిటి విశేషం?" అన్నాడు రాధ పక్కన వున్న పీట ఎదురుగా జరుపుకొని కూర్చుంటూ.

"అంతావిశేషమే! రెండు రోజులాగు... నీకూ తెలుస్తుంది" అంది రాధ టీకి నీళ్ళు పెడుతూ.

"ఏవిటమ్మా... అంత విశేషం? దాని కోసం రెండు రోజులాగాలా? పోన్లే..నువ్వే దాచుకో. నాకేం వద్దు. కానీ శోభకు స్వీట్స్ ఇచ్చావా?"

"ఆహా! స్వీట్స్ ఇచ్చాను. తనకోసం ప్రత్యేకంగా నువ్వు తెచ్చావనీ చెప్పాను"

"ఛ! అలా ఎందుకు చెప్పావే?"

"మరింకెలా చెప్పను! ఆరోజు... బొంబాయి వెళ్ళేరోజు అంత కష్టపడి పూరీలు చేసి పెడితే, ఇద్దరికీ పీచు మిఠాయి తెచ్చి పెడతానన్నావుగా! అదికూడా తేలేదంటే శోభ ఏమనుకుంటుంది? 'మీ అన్నయ్య ఎంత పిసినారివాడే రాధా' అని నవ్వుతుంది"

"ఓకే....ఓకే....మంచిపని చేశావు. ఇక వుపన్యాసాలు ఆపి, త్వరగా ఓ కప్పు టీ ఇచ్చావంటే, నాన్నగారి దగ్గరకెళ్ళి మాట్లాడగలిగే శక్తి వస్తుంది"

"ఏమిటో అంత శక్తి కావలసిన అవసరం? ఏదైనా ముఖ్య విషయమా?"

"వూ! నీ పెళ్ళి విషయం" అన్నాడు సాగర్ నవ్వుతూ.

"నాదెందుకవుతుంది. బహుశా అయితేగియితే నీదే అయివుండాలి" అంటున్న రాధ నెత్తిన మొట్టుతూ–

"అదికాదే పిచ్చిమొద్దూ...ఇదినాన్నగారికి సంబంధించిన విషయం"

"ఏవిటన్నయ్యా!" కుతూహలంగా అడిగింది రాధ.

"రాధీ! ఇన్నాళ్ళూ నాన్నగారు మన గురించీ, మన భవిష్యత్ గురించీ స్కూలే పనితో విశ్రాంతి తీసుకోవలసిన వయసులో క్షణం తీరికలేకుండాగడిపారు. ఇక ఆయనకు పూర్తి విశ్రాంతి ఇవ్వాలి. నాన్నగార్ని వుద్యోగం మానేయమని చెప్పాలి. నాకు వుద్యోగం దొరికిన తర్వాత కూడా ఆయనింకా కష్టపడటం నాకిష్టంలేదమ్మా! ఆ విషయం చెప్పాలని నిన్నటి నుంచీ ప్రయత్నం. కానీ.... నాన్నగారి దగ్గరకెళ్ళి ఆమాట ఎత్తడానికి భయమేస్తోంది. ఇన్నాళ్ళూ స్కూలే




జీవితంగా గడిపారు. ఇప్పుడు సడెన్‌గా మానేయాలన్నా ఆయనకు బాధ కలగ వచ్చు. అదే ఎలా చెప్పాలా అని ఆలో చేస్తున్నాను రాధా"

సాగర్ మాటలు విన్న రాధ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"ఇంక నాన్నగారికి విశ్రాంతికావాలి. ఆయన ప్రశాంతంగా కూర్చొనే సమయం కూడా ఆయనకు మిగలటం లేదన్నయ్యా. ఈ బాధలనుంచి విముక్తు డయ్యేలా మళ్ళీ ఆయన్ని మార్చాల్సిన బాధ్యత మనమీదుందన్నయ్యా" అంటూ టీ కప్పు సాగర్ చేతికి అందించింది రాధ.

"మనం బొంబాయి వెళ్ళిన తర్వాత చూడు పరిస్థితులెంత మారి పోతాయో! నాన్నగారికి పూర్తి విశ్రాంతే కాదమ్మా - ఆయనకిన్నాళ్ళూ దూరమైన మనశ్శాంతి కూడా దొరుకుతుంది. అవకాశంలేక ఆగిపోయిన నీ సంగీత శిక్షణ మళ్ళీ మొదలౌతుంది" కలల్లో తేలిపోతూ చెబుతున్న సాగర్ మాటలు వింటూ రాధ కూడా భవిష్యత్‌నుగురించి బంగారు కలల్లో తేలిపోసాగింది. ఇంతలో పొయ్యి మీద పెట్టిన పాలు పొంగడంతో వులిక్కి పడి పాలు దింపి, మరో కప్పులో టీ పోసి సాగర్‌కిచ్చింది.

కప్పు అందుకున్న సాగర్ తండ్రి గదివైపు అడుగువేశాడు. జగన్నాథరావు గారు ఇంట్లో వుండే సామాన్యంగా వరండా పక్కగా ఇంటిముందున్న గదిలో వుంటారు. పిల్లల కాంపోజిషన్ నోట్సులు దిద్దుతూనో, పేపర్లు దిద్దు తూనో వుంటారు. ఏదీలేకపోతే పడక కుర్చీలో వాలి గత స్మృతుల్లో మునిగి పోతారు. టీ కప్పుతో సాగర్ ప్రవేశించే సమయానికి ఆయన ఏవో పేపర్లు దిద్దుతున్నారు.

"టీ తీసుకోండి నాన్నా!" అంటూ వచ్చిన సాగర్ చేతిలోని కప్పుఅందుకొని -

"రాధేంచేస్తోంది బాబూ!" అన్నారు.

"రాధేదో పనిలో వుంది నాన్నా! ఇవేమిటి... పరీక్షపేపర్లా?" అన్నాడు ఆ పక్కనే వున్న స్టూల్ మీద పేపర్స్‌తీసి కూర్చుంటూ!

"అవునురా! హాఫియర్లీ ఎగ్జామ్స్ అయ్యాయి కదూ... అవే దిద్దుతున్నాను. మరి ఈ సంవత్సరం పిల్లలు ఎక్కువ కావడంతో పేపర్స్ దిద్దటానికిఎక్కడి టైమూ చాలడంలేదు. ఆ... అన్నట్టు నువ్వెప్పుడు బయలుదేరాలి? కొంచం ముందుగాచెప్పు" అంటున్న జగన్నాథరావుగారి వైపు చూసిన సాగర్ కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

ఆయన వయసుకు మించి శ్రమించ డంతో మరింత వయసు పెరిగినట్లు కని పిస్తున్నారు. పెద్దగా గుండ్రంగా మెరిసే ఆ కళ్ళు నీరసంగా వున్నాయి. తల సగం వరకు నెరిసిపోయింది. చేతులమీదుగా సన్నగా తేలిన నరాలు,ముఖాన అలసట, సరైన పోషణలేక చిక్కిన శరీరం. తండ్రి, సురేంద్ర ఒకే వయసువాళ్ళు కానీ మావయ్య ఎలావున్నారు? సూటూ బూటూ వేసుకొని దొరబాబులా వున్నా డాయన. ఆయనకు పెళ్ళయిన ఓ కూతురూ, పెళ్ళికెదిగిన మరో కూతురూ వున్నారని చెబితే తప్ప ఆయన వయసు తెలీదు.

ఆయనకంటే బాధలు లేవు. భార్య తన పిల్లల్ని వదిలేసి తనదారి తను చూసుకున్నా, తన ఆలనా పాలనా చూసి పిల్లల్నిసంరక్షించేందుకుఆయనకు ఓ తోబుట్టువుంది కనుక బాధలూ, బాధ్యతలూ ఆయనను కృంగదీయలేదు.

పైగా అన్నింటికీ మూలమైన ఆర్థిక సమస్య ఆయనకు లేదు. అందుకే అంత నిండుగా హుందాగా వున్నాడు.

కానీ తన తండ్రి....ముగ్గురు పసి వాళ్ళను, తల్లిలేని వాళ్ళను స్వయంగా తనే పెంచుతూ, వాళ్ళ బరువు బాధ్యతలతోపాటు, ఆర్థిక ఇబ్బందుల్ని ఎదుర్కొంటూ తమను ఇంతవాళ్ళను చేయడానికి సర్వశక్తుల్నీ వెచ్చించవలసి వచ్చింది.

మాలతి ఆంటీని పెళ్ళిచేసుకొని వుంటే తండ్రి ఇన్ని అవస్థలు పడవలసి వచ్చేది కాదు. ఆంటీ మాటల్నిబట్టి ద్వితీయ వివాహం చేసుకోవడం తండ్రికి ఇష్టం లేదని అర్థమైంది. తండ్రి మాట వచ్చినపుడు ఆంటీ కళ్ళలో మెదిలిన ఆ ఆరాధనా భావం చూస్తే తనకర్థమైపోయింది. ఆంటీ జీవితమంతా అవివాహితగా వుండటానికి కారణం తన తండ్రేనని. మూగగా ఆరాధించే ఆమె మనసును నాన్న అర్థంచేసుకొని వుండరు. కానీ తండ్రి కూడా తన తల్లిని అలాగే ఆరాధించి వుండవచ్చు. అందుకే ఆమె చనిపోగానే ఆ స్థానాన్ని మరొకరికి ఇవ్వడానికి ఆయన మనసు అంగీకరించి వుండకపోవచ్చు.

"ఏవిటి బాబూ! ఏమైనా అడగాలని వచ్చావా?" ఆప్యాయంగా అడుగుతున్న తండ్రిని చూశాడు సాగర్.

"అవును నాన్నా! ఇంక మీరు కష్టపడటం నాకిష్టం లేదు. వుద్యోగం మానేయండి. నాకొచ్చే జీతం మన ముగ్గురికీ చాలు. ఇక మీరు విశ్రాంతి తీసుకోండి హాయిగా" అన్నాడు గబగబా.

పెద్దగా నవ్వారు జగన్నాథరావుగారు.

"ఓరి పిచ్చివాడా! ఇందుకా ఇంత సేపు ఆలోచించావు. వుద్యోగం లేకుండా నేను హాయిగా ఎలా వుంటానురా? నీకొచ్చే వెయ్యి రూపాయలూ బొంబాయి సిటీలో ఏమూలకు? అయినా ఇప్పుడే మేమెందుకురా! కొన్నాళ్ళు నువ్వు ఫ్రీగా వుండు. ఈలోపు రాధకేదో సంబంధం చూసి పెళ్ళిచేస్తే ఆ బాధ్యత తీరిపోతుంది. ఆ తర్వాత ఆలోచిద్దాం"

"అలా కాదు నాన్నా! మీరు...."

"చూడు సాగర్! నీకు సిటీ లైఫ్ గురించి తెలీదు. ముఖ్యంగా బొంబాయి అంటే మాటలు కాదు. ఇక్కడ రెండు వందలతో హాయిగా గడిచిపోతే అక్కడ రెండు వేలైనా అంతంతమాత్రంగానే వుంటుంది"

"నాకు వుద్యోగం రాగానే మీ వుద్యోగం మానిపించి పూర్తిగా విశ్రాంతి ఇవ్వాలనీ, చెల్లాయికి మంచి సంబంధం చూసి పెళ్ళిచేయాలనీ, దానికిష్టమైతే ఇంకా చదివించాలనీ...ఎన్నో అనుకున్నాను. అన్నీ ఒక్క మాటతో కొట్టిపారేశారు మీరు! నాతో రానంటే నాకీవుద్యోగమే వద్దు. ఇక్కడే ఏదో చిన్న వుద్యోగం చేస్తూ మీతోపాటే వుంటాను" సాగర్ కళ్ళలో నీళ్ళు తిరగటం చూసిన జగన్నాథరావు చలించిపోయారు.

"ఛ... పిచ్చిమాటలు మాట్లాడతావేంటిరా! వచ్చిన మంచి అవకాశాన్ని ఎవరైనా చేజేతులా జారవిడుచుకుంటారా? మళ్ళీ చిన్నదైనా వుద్యోగం దొరకటం ఎంతకష్టమో ఇన్నాళ్ళ అనుభవంలో తెలిసే ఇంత మంచి, వుద్యోగం పోగొట్టుకుంటానంటే నేనేం చెప్పను!"

అప్పుడే లోపలికి వచ్చిన రాధ మెల్లగా తండ్రి కుర్చీ దగ్గర కింద మోకాళ్ల మీద కూర్చుంది.




"ఇంక నువ్వేం చెప్పకు నాన్నా! ఇన్నాళ్లూ మీ మాట మేం విన్నాం. ఇక నువ్వు మా మాట వినాలి. ముఖ్యంగా ఇప్పుడు సాగరన్నయ్య మాట విను" అంటున్న రాధ ముఖంలోకి చూసిన జగన్నాథరావుగారు సాగర్ వైపు చూశారు. కన్నీళ్లు తండ్రికి కనిపించకుండా దాచే ప్రయత్నంలో మొఖం పక్కకు తిప్పుకున్నాడు సాగర్.

"అన్నా చెల్లెళ్లిద్దరూ కూడబలుక్కొని ముసలివాడిని ఓడించారురా! సరే... మీ ఇష్ట ప్రకారమే కానివ్వు. కానీ ఒక్క విషయం. నీకు బొంబాయిలో ఇల్లు దొరకడానికి రెండుమూడు నెలలైనా పట్టవచ్చు. అందుకని ప్రస్తుతం నువ్వొక్కడివే వెళ్లు. ఈలోపు ఇక్కడ పిల్లల యాన్యువల్ పరీక్షలు కూడా పూర్తవుతాయి. మధ్యలో వదిలేసి రావడం సాకిష్టంలేదు. ఈ సంవత్సరం పరీక్షలైన తర్వాత మానేస్తాను...సరేనా?"

సంతోషంతో వెలిగిపోయింది సాగర్ మొఖం.

"అలాగే నాన్నా! మీ ఇష్టం. మీరు ఒప్పుకున్నారు అంతేచాలు. ఇల్లు దొరకడం కూడా పెద్ద సమస్య కాదు. రాకేష్ చేతుల్లో చాలామంది మనుషులున్నారు. వాళ్లు తలుచుకుంటే నెలలోపే ఇల్లు చూస్తారు. అప్పటివరకూ రాకేష్ తమ ఇంట్లోనే వుండమన్నాడు. అక్కడ ఎక్కువ రోజులు వుండటం నాకూ ఇష్టం లేదు. కానీ రాకేష్ వాళ్ళ ఆంటీ నేను వేరే ఎక్కడైనా వుంటానంటే బాధపడతారు. ఆమె మాట్లాడుతుంటే ఎంతో ఆత్మీయంగా వుంటుంది నాన్నా! ఆవిడ పరాయిమనిషి అనిపించదు. అమ్మ ప్రేమ ఎలాంటిదో తెలియని నాకు, వున్న మూడురోజుల్లో ఆమె చూపించిన ఆప్యాయత చూస్తే అమ్మ వుంటే ఇలాగే వుంటుంది కాబోలు అనిపించింది"

"పరాయి బిడ్డను కన్నతల్లిలా ఆదరించిన ఆమె ఎవరు బాబూ?"

"రాకేష్ భార్యకు మేనత్త. ఆమెదో పెద్ద కథ..."

"అన్నయ్యా..నువ్వింతగా చెబుతున్న ఆ అమ్మను ఎప్పుడు చూస్తానా అని వుంది" అంది రాధ.

"ఆంటీ కూడా నిన్ను చూడాలనీ, నీ పాట వినాలనీ చాలా ఆత్రుతతో ఎదురు చూస్తోంది" అన్నాడు సాగర్.

"అయితే ఆంటీకి నన్ను గురించి చెప్పావన్నమాట!" అంది రాధ సంతోషంగా.

"ఆహా! నిన్ను గురించీ, నీ పాటను గురించీ, నువ్వు గొంతెత్తగానే అవసరం పడే ఆస్ప్రో బిళ్ళల గురించీ...." అంటూ ఇంకా ఏదో అనబోతున్న సాగర్‌ను కొట్టబోయిన రాధకు అందకుండా నవ్వుతూ బయటకు పారిపోయాడు సాగర్.

సాగర్ బొంబాయి వెళ్ళడానికి మళ్ళీ సిద్ధమవుతున్నాడు. అంతకుముందే శోభ సాగర్ ఉద్యోగం విషయం తల్లికి చెప్పడం, ఆమె వెళ్ళి శోభ తండ్రి చెవిలో ఆ వార్త వేయడం, ఆయన వచ్చి జగన్నాథరావుగారికి సాగర్‌ను తమ అల్లుడిగా చేసుకోవాలని ఉందన్న మాట చెప్పడం జరిగాయి.

ఆ ఊరికే ధనవంతుడైన రాజారావు గారు స్వయంగా వచ్చి తమ కుమార్తెను ఆ ఇంటి కోడలిగా చేసుకోమనడం జగన్నాథరావుగారికి సంతోషాన్ని కలిగించాల్సిన విషయమే. కానీ ఆయన

కెందుకో కలగవలసినంత ఆనందం కలగలేదు. ఏ మూలో ఒక్కసారి సురేంద్రా, అతని పిల్లలూ మనసులో మెదులుతూనే వున్నారు.

సంపత్ పెళ్ళిరోజునా అలాగే జ్ఞాపకం వచ్చారు. కానీ అప్పటికే సంపత్, సుభద్రలు ప్రేమించుకుని వుండటంతో మనస్ఫూర్తిగా తన అంగీకారం తెలిపారు. ఇప్పుడు శోభ విషయంలో కూడా ఆయనకు వేరే అభ్యంతరాలేమీ కనిపించ లేదు కాదనడానికి. శోభ యోగ్యురాలు, చక్కనిది. మీదుమిక్కిలి రాధకు ప్రియమైన స్నేహితురాలు కనుక ఇంట్లో చక్కగా కలిసిపోతుంది. కానీ ఏ మూలో కనీసం సాగర్‌కైనా సురేంద్ర కూతుర్ని చేయాలని వుంది. అయినా అదెలా సాధ్యం? ఇన్ని సంవత్సరాలూ తను ఎక్కడవున్నాడో కూడా తెలుపకుండా ఇప్పుడు సడన్‌గావెళ్ళి తను ఏమని అడగ గలడు సురేంద్రను? ఇంకా అతని పిల్లలకు పెళ్ళికాలేదన్న గ్యారంటీ ఏముంది?

అసలు వాళ్ళెక్కడ వున్నారో మార్గరెట్ తోపాటుఅమెరికావెళ్ళిపోయారో? తనూ, సురేంద్రా ఇలా విడిపోయేవారేనా? బంధుత్వంకంటే తమమధ్య స్నేహం ఎంతటి తియ్యటిది? మావగారు రమణ రావుగారు తనను కన్నకొడుకుకంటే మిన్నగా చూడటం మార్గరెట్ కు కన్నుకుట్టుగా తయారైంది. అందుకే లేనిపోనివి కల్పించి సురేంద్ర మనసు విరిచేసింది. అతను భార్యావిధేయుడే అయినా తన విషయంలోమాత్రం ఎప్పుడూ జాగ్రత్తగా మందలిస్తూనే వుండేవాడు మార్గరెట్ ను.





మాలతితో కూడా ఒక్కమాటన్నా చెప్పకుండా వచ్చేశాడు తను. ఆ తర్వాత తన విషయాలు వాళ్ళకు తెలియవు. వాళ్ళ విషయాలు తనకూ తెలియవు. అప్పుడప్పుడూ ఏదో సందర్భంలో ఆ జ్ఞాపకాలు వచ్చినా బలవంతంగా వాటిని అణచుకొని ఇతర కార్యక్రమాలమీదకు మనసు మళ్లించేవాడు. సాగర్ బొంబాయి ప్రయాణంతో ఇంతకాలానికి సురేంద్రా, పిల్లలూ జ్ఞాపకంవస్తున్నారు. తన అడ్రస్ సురేంద్రకు తెలియదుకానీ ఫాక్టరీ ఓనరైన సురేంద్ర అడ్రస్ తనకు తెలుసుకదా! అయినా ఇన్నేళ్ళలో ఎన్నడూ తన విషయాలు అతనికి తెలియజేయలేకపోయాడు. ఏదో అభిమానం అడ్డొస్తోంది మళ్ళీ సురేంద్రను తనంతతాను పలకరించడానికి. అతనికేమో తన వునికి తెలియదు. మరి సమస్యకు పరిష్కారమెలాగు? అది అంతే...కనీసం సాగర్‌కు కూడాసురేంద్ర అడ్రస్ చెప్పాలనిపించలేదు. లేనిపోని బంధుత్వం కలుపుకొద్దావా అని అవమానిస్తే వాడు తట్టుకోగలడా?

తన సమాధానం కోసం ఎదురుగా కూర్చున్న రాజారావుగారిని కూడా మరచి ఆలోచనల్లో మునిగిపోయాడాయన. రాధ కాఫీలు తీసుకొచ్చి ఇద్దరికీ ఇస్తూ "నాన్నా.. మావయ్యగారు మీతో మాట్లాడటానికే వచ్చారు" అంది నవ్వుతూ. తనూ చిన్నగా నవ్వుతూ కాఫీ కప్పు రాజారావుగారి కందించి, తనూ ఓ కప్పు తీసుకున్నాడు.

"నాకు తెలుసమ్మా... రాజారావు గారూ! శోభ ఈ ఇంటి కోడలు అవుతుందంటే నాకూ సంతోషమే. కానీ ఈ విషయంలో సాగర్‌తో మాట్లాడి కానీ నేను ఏ విషయం చెప్పలేను. పెళ్ళి అనేది నూరేళ్ళ పంట అంటారు. రెండు

జీవితాలకు సంబంధించిన విషయంలో మన అభిప్రాయాలకంటే ముందుగా మనం తెలుసుకోవలసింది పిల్లల అభిప్రాయాలు. రేపు జీవితాంతం కలిసి జీవించవలసిన వాళ్ళు వాళ్ళే కనుక, నేను వాళ్ళ అభిప్రాయాలకు ప్రాధాన్యమిస్తాను. నా తరపున ఎట్టి అభ్యంతరం లేదు. అబ్బాయితో మాట్లాడి రేపు ఏ విషయం చెప్తాను. పైగా రేపే వాడు బొంబాయి వెళ్ళి జాయిన్ అవ్వాలంటున్నాడు" అన్నారు.

"అన్నయ్యను అడగఖ్ఖర్లేదు నాన్నా! అన్న కిష్టమే, శోభకూ ఇష్టమే" అంది రాధ నవ్వుతూ.

"రాధా! నీ మాటే నిజమైతే ఇంకా సందేహించవలసిందేముంది? వెంటనే ముహూర్తాలు పెట్టించేయడమే బావగారూ మన పనల్లా" అంటూ పెద్దగా నవ్వుతున్న రాజారావుగారు, అప్పుడే బయటనుండి లోపలికొస్తున్న సాగర్‌ను చూసి–"అదిగో మాటల్లోనే అతనూ వచ్చేశాడు. రావోయ్ అల్లుడూ...నీ కోసమే చూస్తున్నాం" అన్నాడు.

రాజారావుగారి కొత్త సంబోధనకు అర్థాన్ని వెదుక్కుంటూ అయోమయంగా తండ్రి వైపూ, రాధ వైపూ చూశాడు. రాధ కొంటెగా నవ్వుతోంది. తండ్రి ముఖంలోనూ చిరునవ్వు కనిపిస్తోంది. విషయం అర్థంకాక బలవంతాన ముఖాన నవ్వు పులుముకొని విషయమేమిటో మీరే వివరించండన్నట్లు తండ్రి పక్కన కూర్చొని రాజారావు వైపు చూశాడు.

అతనూ విషయమేదో చెప్పటమే తన ధ్యేయమన్నట్లుగా ఏమీ నాన్చకుండా డైరెక్టుగా తన అభిప్రాయం సాగర్‌కు చెప్పాడు.

"చూడు సాగర్! నీకు మా శోభ తెలుసుగా...తెలియద మేవిటి–చాలాసార్లు చూసి వుంటావు. మా శోభని నీకిచ్చి పెళ్ళిచేయాలని నిశ్చయానికి వచ్చాను. ముసుగులో గుద్దులాటలు నాకు నచ్చవు. మాకున్న ఆస్తిపాస్తుల వివరాలు మీకూ తెలుసు. కట్నకానుకలకు ఏమీ లోటుండదు. మీ నాన్నగారు నిన్నడిగి నీ అభిప్రాయం తెలుసుకొని కానీ నాకు మాటివ్వనన్నారు"

సాగర్ తండ్రి వైపు కృతజ్ఞతగా చూశాడు.

"కానీ మీ చెల్లెలు రాధ చెప్పేసింది. నీకూ, శోభకూ కూడా ఇష్టమేననీ... అభ్యంతరం ఏం వుండదనీ..."

రాజారావుగారి మాటలకు ఇబ్బందిగా కదిలాడు సాగర్. నవ్వుతూ చూస్తున్న రాధ నెత్తిన మొట్టాలన్న కోరికను అణచుకుంటూ నెమ్మదిగా మాట్లాడాడు–

"నాకు ఇప్పుడప్పుడే పెళ్ళి చేసుకోవాలని లేదండీ! కనీసం ఇంకో రెండు సంవత్సరాల వరకూ ఆ వుద్దేశం లేదు. ముందు మా రాధ పెళ్ళి కావాలి. ఆ తర్వాతే నా విషయం ఆలోచిస్తాను"

"రాధ పెళ్ళి అయిన తర్వాతే నీ పెళ్ళని నువ్వు నిశ్చయించుకుంటే దానికి రెండు సంవత్సరాలు ఆగవలసిన పని లేదు. మా తమ్ముడి కొడుకు శేఖర్ వున్నాడు. నేను చెబితే కాదనరు. రెండు పెళ్ళిళ్ళూ ఒకే పందిట్లో చేసెయ్యవచ్చు. ఏమంటారు బావగారూ?" అంటున్న రాజారావుగారి వైపు చిరునవ్వుతో చూస్తూ 'దీనికేమంటావురా?' అన్నట్లు సాగర్ వైపు దృష్టి మరల్చారు.

వెంటనే ఏం సమాధానం చెప్పాలో తోచలేదు సాగర్‌కు. రాధవైపు చూశాడు.



రాధ నుంచున్న చోటు ఖాళీగా వుంది. తన పెళ్ళి ప్రసక్తి రాగానే ఇంట్లోకి పారిపోయింది రాధ.

"ఏమైనా మరో రెండు సంవత్సరాల వరకూ నాకు పెళ్ళి చేసుకోవాలని లేదండీ"

"అలాగంటే ఎలాగయ్యా? ఇప్పుడు నీకు అభ్యంతరమేమిటి? చక్కటి వుద్యోగంతో పాటు, పెళ్ళి కూడా చేసుకున్నావంటే హోటల్ మెతుకులు తినే బాధ తప్పుతుంది. ఇప్పుడు నిశ్చయం చేసుకున్నామంటే ఆ తర్వాత ముహూర్తాలు పెట్టుకొని త్వరలో రెండు శుభకార్యాలూ ఒకే పందిట్లో ముగించవచ్చు. ఇంకా నీకేమైనా కావాలంటే..." అంటూ ఇంకా ఏదో చెప్పబోతున్న రాజారావుగారి మాటల్ని మధ్యలోనే తుంచేస్తూ లేచి నుంచున్నాడు సాగర్.

"క్షమించండి. శోభకు మీరు వేరే సంబంధం చూడటం మంచిది. నాకా

వుద్దేశమే లేదు. మీకభ్యంతరం లేకుంటే మా రాధకు ఆ సంబంధం కుదర్చండి... వస్తాను" అంటూ గబగబా మళ్ళీ బయటకు వెళ్ళిపోతున్న సాగర్ వైపు గుడ్లప్పగించి చూస్తూ కూర్చున్న రాజారావు, ఒక్కసారే స్పృహలోకి వచ్చాడు. దానితోపాటు జరిగిన అవమానం భరించలేకపోయాడు. దిగ్గున లేచి నుంచుని జగన్నాథ్ వైపు కోపంగా చూశాడు.



"మాష్టారూ! చూశారా మీవాడి దురుకుతనం. మాకీమాత్రం బోడి సంబంధం దొరకదనా మీవాడి అభిప్రాయం? ఏదో వూళ్ళో సంబంధం, తెలిసినవాళ్ళు, అమ్మాయికూడా ఇష్టపడుతుంది కదా అని వచ్చాను కానీ మాకు ఇంత గొప్ప అల్లుడు దొరకదని కాదు. నెల తిరిగేసరికి తాతలాంటి సంబంధం చూసి మా అమ్మాయి పెళ్ళి చేయకపోతే నా పేరు రాజారావే కాదు" అంటూ పెద్ద పెద్ద అడుగులేసుకుంటూ వెళ్ళిపోయాడు.

తండ్రిని సమీపించిన రాధ ముఖం చిన్నబోయింది.

"ఏం జరిగింది నాన్నా! ఇంతలోనే మావయ్య ఎందుకంత కోపంగా అరుస్తున్నారు? అన్నయ్య ఏమైనా అన్నాడా?" అని అడుగుతున్న రాధను దగ్గరకు తీసుకొన్నారు జగన్నాథరావు.

"ఏం జరగలేదమ్మా! కలిగినవాళ్ళకు ఆనందం వచ్చినా, ఆవేశం వచ్చినా పట్టలేరు. సాగర్‌ను అల్లుడిని చేసుకోవాలని 'బావగారూ!' అని పిలుస్తూ వచ్చిన రాజారావు సాగర్ తనకు శోభను చేసుకోవడం ఇష్టంలేదని చెప్పడంతో రెచ్చిపోయి ఏమేమిటో మాట్లాడి వెళ్ళిపోయాడు"

"శోభని పెళ్ళిచేసుకోవడం తనకిష్టం లేదన్నాడా అన్నయ్య!"

"అవునమ్మా! వాడి మనసులో ఏముందో? నేనలా రచ్చబండవరకూ వెళ్ళి వస్తాను. వాడికిష్టంలేకపోతే బలవంతం

చేయడం మంచిపనికాదు. నువ్వెళ్ళి పని చూసుకోమ్మా" అంటూ లేచి వెళ్ళి పోతున్న తండ్రి వైపు చూసి వస్తున్న నిట్టూర్పును అణచుకుంటూ గుమ్మం వరకూ వెళ్ళి అలాగే చూస్తూ నుంచుంది రాధ.

శోభను పెళ్ళాడటం ఇష్టంలేదన్నాడా అన్నయ్య? పాపం....శోభ ఎంత బాధ పడుతోందో ఈ విషయం విని? శోభ సాగర్‌ను చేసుకుని తమఇంటికొస్తుందనీ, తమ స్నేహబంధం మరింత పటిష్టమవు తుందనీ ఎన్ని కలలుకంది తను! అన్నీ అన్నయ్య ఒక్కమాటతో తునాతునకలై పోయాయి.

రాజారావు మావయ్యకు బాగా కోపం వచ్చినట్లుంది. రాదుమరి...అంతటివ్యక్తి స్వయంగా పిల్లనిస్తానని తమ ఇంటికి వస్తే ముఖాన కొట్టినట్లు నిర్మొహమాటంగా మీ అమ్మాయిని పెళ్లాడటం నాకిష్టం లేదంటే ఏ తండ్రి బాధపడదు? అయినా అన్నయ్య ఎందుకలా అన్నాడు? శోభ అంటే ఇష్టంగానే వుండేవాడే. మధ్య మధ్య ఎప్పుడైనా శోభ మీద జోకులు కూడా వేసేవాడు. ఏమైనా అన్నయ్య అంత తొందరపడి అలా చెప్పివుండ కూడదు. శోభకేం తక్కువైందని కాదనాలి? తనంటే ఇష్టం మాత్రమే కాదు–ప్రేమాభిమానాలు పెంచుకున్న శోభను కాదంటే ఆమె పరిస్థితి ఏమౌతుంది అన్న ఆలోచనైనా లేదా? సాగరన్నయ్య అంతటి నిర్దయుడా? ఇంటికి రానీ ఇవ్వాళ అన్నయ్యతో అసలు మాట్లాడకూడదు అని గట్టిగా నిర్ణయించుకున్న రాధ నెమ్మదిగా వంటగది వైపు కదిలింది.

పని చేస్తోందన్న మాటేగానీ మనసంతా దిగులుగా వుంది. మాటి మాటికి శోభ ముఖం గుర్తొచ్చి బాధగా వుంది. బహుశా ఇంక శోభ తమ ఇంటికి రాదు. ఇంక తనకు కనిపించదు. ఏదన్నా అన్నాడంటే రాజారావు మావయ్య పట్టుదలగా చేసితీరతాడు. తండ్రి మాట కాదనలేక మనసులో మమతను చంపు లేక శోభ మనసెంత క్షోభిస్తుందో!

ఇంటికి తిరిగి వచ్చిన సాగర్‌ను ఎన్నిసార్లు పలకరించినా రాధ సమాధానం చెప్పకపోయేసరికి కోపం వచ్చింది.

"సరే కానివ్వు నీకంత కష్టంగావుంటే మాట్లాడకు. రేపెలాగూ వెళ్ళిపోయే వాడినేగా" అంటూ వెనుదిరిగిన సాగర్‌ను చూస్తే మళ్ళీ జాలేసింది రాధకు. అయినా అది బయటకు ప్రదర్శించదలచుకోలేదు.

"రేపెలాగూ వెళ్ళిపోతున్నావు కనుక ఇక్కడివాళ్ళతో సంబంధం కలుపు కోవడం మెందుకులే అనేనా శోభను కాదన్నావు?'' సాధ్యమైనంత కోపంగా అంటున్న రాధ వైపు చూసిన సాగర్ చిన్నగా నవ్వుతూ

"అమ్మయ్య...ఎలాగో మౌనవ్రతం వదిలావు. నీ కోపానికి కారణం శోభను నేను పెళ్ళిచేసుకోనన్నాననా? అయితే నీకో కథ చెప్పక తప్పదు" అంటూ వంట గదిలో పీట వాల్చుకొని కూర్చున్న సాగర్ నెమ్మదిగా సురేంద్ర మావయ్య విషయం, అతని పిల్లల విషయం– ముఖ్యంగా తమని ఏకం చేయాలని తహతహలాడుతున్న పిన్ని మాలతీదేవి విషయం వివరంగా చెప్పాడు. ఆమె కోరిక నెరవేరాలంటే తను సంధ్యను పెళ్ళిచేసుకోవడం ఎంత అవసరమో చెప్పాడు. మొదటి చూపులోనే తనని అన్ని విధాలా ఆకట్టుకున్న సంధ్య సౌందర్య దేవతకాదు. ఆ ఇంటికి అన్ని




విధాల తగిన కోడలని వివరించాడు. అది తమ తల్లి ఆఖరి కోరిక అని చెబుతున్న సాగర్ వైపు చూస్తున్న రాధ కళ్ళ నుంచి రెండు కన్నీటి చుక్కలురాలాయి.

"మన గతంలో మనకు తెలీని ఇంత కథ వుందా? అయితే నువ్వు మళ్ళీ నాన్నగారి మనసు మార్చి మళ్ళీ మన కుటుంబాలు ఒక్కటయ్యేలా చేయగల ననే అనుకుంటున్నావా అన్నయ్యా!"

"అవును రాధా! మాలతీ ఆంటీ సహ కారంతో మావయ్యను జయించగలనన్న నమ్మకం, సంధ్యను సాధించగలనన్న పూర్తి నమ్మకం వుంది. నువ్వుమాత్రం నేను చెప్పిన విషయాలు నీ మనసులోనే వుంచుకో. ఎట్టి పరిస్థితుల్లోనూ నాన్న గారికి తెలీనీకు. నేను పనిచేయబోయేది సురేంద్ర అంకుల్ దగ్గర అని తెలిస్తే నాన్నగారు ఒప్పుకోకపోవచ్చు. అందుకే కొంతకాలం ఈ విషయం రహస్యంగా వుండనివ్వు" అంటున్న సాగర్ మాటలకు నవ్వుతూ తల వూపింది రాధ.



అనుకున్న సమయానికి బొంబాయ్ చేరిన సాగర్‌ను రాకేష్ వచ్చి ఇంటికి తీసుకెళ్ళాడు. ఈసారి ఆ ఇంటికి వెడుతుంటే పరాయి ఇంటికి వెళుతున్న భావం కలగలేదు. అంతా తమవాళ్ళు. తమ ఆత్మీయులు. అనివార్య కారణాలవల్ల అతిదూరంగా విసిరివేయబడ్డ ఆత్మబంధు వులు అనిపించింది సాగర్‌కు. కొద్దిరోజు ల్లోనే సురేంద్ర అభిమానాన్ని కూడా సంపాదించగలిగాడు.

ఈలోపు మరో విచిత్రం జరిగింది. అనుకోకుండా మార్గరెట్ అమెరికా నుంచి దిగింది తన తమ్ముడు విల్సన్‌ను వెంట బెట్టుకొని. అతనికి ఇండియన్ గర్ల్‌ను పెళ్లి చేసుకోవాలని కోరికట. తెల్లకోతిలా వున్న విల్సన్‌ను చూసి ఏదో ఒకటి అని ఏడిపిస్తూండేది సంధ్య. అసలే సీమ మిరపకాయ. తల్లి ఎంత దగ్గరగా రావాలని ప్రయత్నించినా, ఆమెను ఎవరో దూరపుచుట్టంలా చూడగలిగారే కానీ, ఆప్యాయంగా దగ్గర చేరలేకపోయారు సుభా, సంధ్యా ఇద్దరూ. వాళ్ళకు వూహ తెలిసిన తర్వాత మాలతీ ఆంటీ ఆత్మీయత, ఆదరణా తప్ప అమ్మను గురించిన ఏ తియ్యటి స్మృతీ మదిలో మిగలలేదు. పైగా తమ ఇద్దర్నీ నిర్దాక్షిణ్యంగా వదిలి అమెరికా వెళ్ళిపోయిన ఆమెమీద వాళ్ళకు ప్రేమా, ఆత్మీయతలాంటి భావాలు కలగలేదు. దూరంగానే వుండిపోయారు.

సురేంద్ర కూడా ఓ స్నేహితుడిలా అంతదూరం నుంచి వచ్చిన మార్గరెట్‌ను ఆదరించగలిగాడేగానీ అభిమానం కురి పించలేకపోయాడు. అన్నేళ్ళ తర్వాత ఆమె మాట్లాడే మాటలు, ఆమె వ్యక్తపరిచే అభిమానం అన్నీ కృత్రిమంగా కనిపిస్తు న్నాయి వాళ్ళకు.

మాలతి మంచి మనసుతో వదినను ఆహ్వానించింది. ఆమె చేసుకున్న రెండో వివాహం కూడా విఫలమెందని తెలిసి బాధపడింది. మార్గరెట్‌లో పెద్ద మార్పేమీ లేదు. పిల్లల అభిమానం సంపాదించా లని ప్రయత్నిస్తున్నట్లు కనిపించింది



ఎందుకో. అభిమానమనేది క్రమక్రమంగా పెరగాల్సిందే కానీ హఠాత్తుగా, హత్తుకున్నంత మాత్రాన మనుషులు దగ్గరైనా, మనసులు దగ్గర కాలేవన్న చిన్న సూత్రం మార్గరెట్ కు తెలియదు. అందుకే హఠాత్తుగా తను కురిపించే ప్రేమ వర్షంలో తడిసిపోతారనుకున్న కూతుర్లిద్దరూ అంటీముట్టనట్టు తిరుగుతూంటే రోషం వచ్చింది. దానికి కారణం మాలతి అని తన కోపాన్ని ఆమె మీదకు ప్రసరించింది. నిండుకుండ మాలతికి మార్గరెట్ మన స్తత్వం తెలిసిందే కనుక ఏమన్నా పట్టించుకోలేదు. కానీ సంధ్య ముందు మాలతిని అవమానిస్తే మాత్రం సంధ్య ఒంటికాలు మీద లేచేది తల్లిమీద.

మళ్ళీ ఇంట్లో మనశ్శాంతి కరువైంది సురేంద్రకు. సంధ్యను విల్సన్‌కు ఇచ్చి పెళ్ళిచేయమని పోరడం మొదలుపెట్టింది మార్గరెట్. సురేంద్ర ఒక్కటే మాట చెప్పాడు. "సంధ్య అంగీకరిస్తే నా అభ్యంతరం ఏమీ లేదు. ఆ విషయంలో సంధ్యకు పూర్తి స్వేచ్ఛనిచ్చాను. అది ఆమే డిసైడ్ చేసుకుంటుంది అన్నాడు. మొదట తల్లి బాధపడుతుందేమోనని విల్సన్‌కు పూరు చూపించడానికి అంగీకరించినా, అతని వాగుడు, మితిమీరిన చనువూ చూసి అతనితో బయటికి వెళ్ళనని తెగేసి చెప్పింది సంధ్య.

"అతన్ని నువ్వు పెళ్ళిచేకోబోతున్నావు. మీరు ఒకర్ని ఒకరు అర్థం చేసుకోవడం అవసరం" అంటున్న మార్గరెట్ వైపు నవ్వుతూ చూసిన సంధ్య

"మమ్మీ! అతన్ని పెళ్ళి చేసుకోబోతున్నానని నేనెప్పుడూ చెప్పలేదే! నువ్వేలా నిర్ణయించావా? నీ కలాంటి అధికారం నేను ఇవ్వలేదే!" అంది.

డైనింగ్ టేబులు మీద ఎదురుగా కూర్చున్న రాకేష్ ప్రశంసాపూర్వకంగా చూశాడు సంధ్య వైపు. తల వంచుకొని మౌనంగా టిఫిన్ చేస్తున్న సాగరి కూడా ఇంచుమించు అదే భావంతో సంధ్య వైపు చూసి చటుక్కున చూపులు తిప్పుకున్నాడు. సుధా, సురేంద్రా మౌనంగా తల వంచుకుని టిఫిన్ చేయడమే తమ ధ్యేయమన్నట్లుగా వున్నారు. మార్గరెట్ అలాంటి విషయాలు మాట్లాడేటప్పుడు కావాలనే అక్కడి నుంచి తప్పుకుంటుంది మాలతి.

కూతురు మాటలతో మార్గరెట్ కు తల తిరిగిపోయింది. కూతుర్నేమీ అనలేక సురేంద్ర వైపు కోపంగా చూస్తూ- "మీ పిల్లలకు నేర్పిన మర్యాదలివేనా? చిన్నా పెద్దా లేకుండా మాట్లాడుతోంది. అమెరికాలో సివిల్ ఇంజనీర్ నా తమ్ముడు. వాడికేం తక్కువైందని కాదంటున్నావు? చక్కటి పర్సనాలిటీ... అందమైన వుద్యోగం. అంతకంటే అందమైన ఫ్లాట్... ఏం లోపం వుందని కాదంటున్నావు?" అంది.

"మమ్మీ! అంత కోపమెందుకు? విల్సన్‌కు ఏ వంకా లేదు...నిజమే. కానీ ఏ వంకా లేకపోవడమనే క్వాలిఫికేషన్ చాలదు ఈ సంధ్యకు. ఫస్ట్ ఆఫ్ ఆల్ హి మస్ట్‌బీ యాన్ ఇండియన్. ఐ డోంట్ వాంట్ టు మారీ యాన్ అమెరికన్... అండర్‌స్టాండ్" అంటూ లేచిపోయింది సంధ్య.

సురేంద్ర పెదవులమీద సన్నటి చిరునవ్వు మెరవడంచూసి మార్గరెట్ కోపంగా లేచిపోయింది టిఫిన్ వదిలేసి.

ఆ సాయంత్రం సురేంద్రతో షైటింగ్‌కు వచ్చిన మార్గరెట్‌తో నిదా




నంగా మాట్లాడాడు సురేంద్ర. "మార్గరెట్! సంధ్య చిన్నపిల్లకాదు. తన అభిప్రాయాలు తనవి. అలాకాదు ఇలా చేయమని చెప్పడం నాకెప్పుడూ అలవాటు లేదు. ఆ సంగతి నీకూ తెలుసు. నా అభిప్రాయాలు ఎవరి నెత్తినా రుద్దను. తనకు అమెరికన్‌ను పెళ్ళిచేసుకోవడం ఇష్టంలేదని తెగేసి చెప్పిందంటే, దాని వెనకో బలవత్తరమయిన కారణం వుండి వుండాలి. దాన్ని నువ్వు అర్థంచేసుకోవాలి. టేకిట్ ఈజీ. విల్సన్‌కు ఇండియన్ అమ్మాయే కావాలనే కోరిక వుంటే ఇక్కడే ఓ మంచి అమ్మాయిని చూద్దాం"

"నాట్ నెససరీ! బ్లడీ ఇండియా! బ్లడీ ఇండియన్స్. నేనప్పుడే చెప్పాను విల్సన్‌కు. అయినా వినలేదు. అమెరికా వెళ్ళి అమర సౌఖ్యాలు అనుభవించే అదృష్టం అందరికీ లభిస్తుందా! ఆ సంధ్యకు బ్లడ్ ఒక్కటేకాదు బుద్ధులన్నీ ఇండియన్ బుద్ధులే. నా పిల్లలని చెప్పుకోడానికే ఇన్సల్ట్‌గా వుంది" అంటున్న మార్గరెట్ వైపు ఓ క్షణం దీక్షగా చూసారాయన.

"మార్గరెట్! ఒకప్పుడు ఇండియా అన్నా, ఇండియన్స్ అన్నా నీకు ఆరాధన అన్నావు. అప్పుడు ఎంతో ఆనందపడ్డాను. ఆ తర్వాత కొద్ది కాలానికే అదే ఇండియా బ్లడీ ఇండియా అయిపోయింది. ఆ ఇండియన్ బ్లడ్ కలిసిన నీ బిడ్డలు బ్లడీ ఇండియన్స్ అయ్యారు. భగవంతుడి దయవల్ల వాళ్ళు తమ మాతృభూమి పట్ల కావల్సినంత అభిమానం పెంచుకున్నారు. వాళ్ళను నీ బిడ్డలుగా చెప్పుకోవలసిన అగత్యం లేదు. అలా చెప్పుకొని నువ్వు ఇన్సల్ట్‌గా ఫీలవ్వాల్సిన అవసరం అంతకన్నాలేదు. అయామ్ ప్రౌడ్ ఆఫ్ మై చిల్డ్రెన్. ఇఫ్ యూ డోంట్ లైక్ దెమ్ యూ మే గోటు యువర్ మదర్‌లాండ్" అంటూ చకచకా నడిచి గారేజ్ దగ్గరకు వెళ్ళి కారు బయటకు తీసుకొని వెళ్ళిపోతున్న సురేంద్ర వైపే చూస్తూ నుంచున్న మార్గరెట్ కోపంగా వెను తిరిగి ఇంటిలోకి నడిచింది.

వేగంగా కారు నడుపుతున్న సురేంద్ర మెదడులో ఆలోచనలు సుడులు తిరుగుతున్నాయి. మళ్ళీ ప్రశాంతంగా సాగుతున్న జీవితంలోకి ఈ మార్గరెట్ రాక అంతులేని ఆవేదన కలుగజేస్తోంది. ఏమన్నా పెదవి కదపని మాలతి మార్గరెట్ మాటలకు మనసులో ఎంతో బాధపడ్డా తనముందు బయటపడదు. ఇన్నాళ్ళూ కన్నబిడ్డల్నీ, తననీ పూర్తిగా మరచి, మరో పెళ్ళి చేసుకున్న మార్గరెట్ మళ్ళీ అతనికి విడాకులిచ్చి ఇండియా ఎందుకొచ్చినట్లు? విల్సన్ కోసమేనా? కాదు... మళ్ళీ తన నుంచి ఏదో ఎక్స్‌పెక్ట్ చేస్తోంది. కానీ తను....తను మళ్ళీ మార్గరెట్‌ను భార్యగా స్వీకరించగలడా? వూహూఁ...అది ముగిసిపోయిన కథ. మళ్ళీ దానికి లింక్‌లు కల్పించి పొడిగించినా కథ కల్పితంగానే వుంటుంది కానీ వాస్తవం కాలేదు. దీనిలో జీవముండదు. అయినా హేమంతంలో ప్రవేశించిన తనకింకా వసంతమేమిటి? నో... నెవర్! ఇంక మార్గరెట్‌కు తన జీవితంలో చోటులేదు. మార్గరెట్ తననూ, పిల్లల్నీ నిర్దాక్షిణ్యంగా వదిలిపోవడం వల్ల కదూ మాల జీవితమంతా తమ కుటుంబం కోసం కన్యగా వుండిపోవలసి వచ్చింది. ఆ పిల్లల్ని తన గుండెలకు హత్తుకొని మాల కాపాడి వుండకపోతే ఈపాటికి తన పరిస్థితి ఎలా

వుండేదో?

కారు ఆఫీసు దగ్గరకు రాగానే స్లోచేసి హారన్ కొట్టాడు. గూర్ఖా వచ్చి తలుపు తీశాడు. సర్రున దూసుకుపోయింది కారు ఆ ఆవరణలోకి. ఆలోచనలతోనే ఆఫీసులో అడుగుపెట్టాడు సురేంద్ర. దానికేదో పరిష్కారం ఆలోచించాలి. మార్గరెట్‌ను సాధ్యమైనంత త్వరగా పంపించేయాలి. రోజులు గడుస్తున్నకొద్దీ తనకు సన్నిహితం కావడానికి ప్రయత్నిస్తోంది. తన పిల్లల తల్లిగా ఆమెను ఆదరించ గలిగాడే కానీ మళ్ళీ తన మనసు దోచుకున్న మార్గరెట్‌గా మమత కురిపించలేదు. అది జరగనిపని. మనసులోని అతి సున్నితమైన అనురాగతంత్రులను అతి నిర్దాక్షిణ్యంగా తెంచివేసి వెళ్ళిపోయి అవి మళ్ళీ ఆమే సరిచేయాలని చూసినా అది అసాధ్యమైన పనే...తెగిన తీగెలు సరిచేయాలని చూసినా సాధ్యమయ్యే పని కాదు. కాకపోతే మరో కొత్త తీగె వేసుకోవచ్చుకానీ తనకు ఆ అవకాశం కూడా లేదు. 'ఇటీజ్ టూ లేట్ టు గెట్ ఎ న్యూ వైర్' అనుకున్న సురేంద్ర చిన్నగా నవ్వుకొని పైపు వెలిగించుకున్నాడు.

అవును...తన కూతురికి తోడు వెదకాల్సిన సమయంలో తన తోడు గురించి ఆలోచిస్తున్నాడు తను. వాటే సిల్లీ హార్ట్ ఇట్ ఈజ్. ఇన్నాళ్ళూ తనలో ఏ ఆశలకూ, కోరికలకూ చోటు లేకపోయింది. ఈనాడు మార్గరెట్ వచ్చి తనలో నశించిపోయాయనుకున్న కోర్కెలకు చిగురుతొడిగిందా? లేదు... మొట్టమొదటిసారిగా అమెరికాలో మార్గరెట్‌ను చూసి చలించింది తన మనసు.

అదృష్టమో, దురదృష్టమో అనుకోకుండా ఇద్దరూ దగ్గరయ్యారు. ఒకరి భావాలొకరికి విప్పి చెప్పుకున్నారు. ఒక్కటయ్యారు. కొన్నేళ్ళే అయినా స్వర్గం చూపించింది మార్గరెట్. అనుకోకుండా ఆమెలో ప్రవేశించిన అసంతృప్తి తమ జీవితాల్లో శాంతిని తినేసింది. ఫలితం పిల్లల్నీ, తననీ వదిలి తన సుఖం తను చూసుకుంది మార్గరెట్. ఆమె తమకు దూరమైనా ఆమె స్మృతుల్లోనే తనిన్నాళ్లూ మనగల్గాడంటే అతిశయోక్తి కాదు. కానీ మళ్ళీ ఆమెను జీవితంలోకి ఆహ్వానించగల విశాల హృదయంవున్నా ధైర్యంలేదు. కారణం ఆమె ఏమాత్రం మారలేదు. ఆ భావాల్లో మార్పులేదు. ఇండియన్స్ అంటే చిన్నచూపు పోలేదు.

"మే అయ్ కమిన్‌సర్!" అన్న స్వరం వింటూనే ఉలిక్కిపడి సర్దుకొని కూర్చున్నాడు సురేంద్ర.

"యస్....కమిన్!" అన్నాడు ఠీవిగా కుర్చీలో వెనక్కు వాలుతూ.

"సర్! ఈ కంపెనీస్ నుంచి ఆర్డర్స్ వచ్చాయి. మీరొక్కసారి చెక్ చేస్తే..." అంటూ ఓ ఫైల్ ముందుంచిన సాగర్ వైపు నవ్వుతూ చూస్తూ ఫైల్ అందుకొని ఆర్డర్స్ చూశాడు.

"వెరీగుడ్ ప్రోగ్రెస్! చాలా త్వరగా పికప్ అయ్యావు సాగర్. ఇంత త్వరగా ఇన్ని కంపెనీలనుంచి ఆర్డర్స్ తెప్పించ గలిగావంటే అది నీ సామర్థ్యమనే చెప్పాలి. వెల్‌డన్ మై బోయ్! అయామ్ ప్రౌడ్ ఆఫ్ యూ!" అంటూ చిరునవ్వుతో కావలసిన సంతకాలుపెట్టి ఫైల్ సాగర్ చేతికి ఇచ్చాడు. నవ్వుతూ ఫైల్ అందుకున్న సాగర్—

"థాంక్యూ సర్! అంతా మీ ఆశీర్వాద బలమే" అంటూ ఫైల్ తీసుకొని వెళ్ళి




పోయాడు.

వెళుతున్న సాగర్‌వైపు చూస్తున్న సురేంద్ర మనసులోనే అనుకున్నాడు- 'చాకులాంటి కుర్రాడు. మంచి భవిష్యత్ వుంది' అని.

అదే సమయంలో కాంటీన్‌లో కూర్చున్న రాకేష్, సాగర్‌ల మధ్య సంభాషణ ఇలా సాగుతోంది-

"మా వగారి మెప్పుపొందావంటే కోటలోపాగా వేశావన్నమాటే. ఆయన అంత త్వరగా ఎవ్వర్నీ మెచ్చుకోరు. ఇన్నాళ్ళైంది ఒక్కసారైనా నన్ను మెచ్చుకున్న పాపాన పోలేదు. పైగా ఒకటి రెండు సందర్భాలలో అక్షింతలు వేశారు"

"బాగానే వుంది...కానీ ఎన్నాళ్ళిలా? నాకు ఇల్లు వెదికిపెట్టే ఉద్దేశం ఉందా లేదా? ఆంటీ తిన్నంతపెడుతుంటే తింటూ కూర్చోడానికి నాకు సిగ్గుగా ఉందిరా. పైగా మీ సీమ మిరపకాయ ఏమనుకుంటుందో"

"ఆ...ఆ ఆపరా బండి. సీమ మిరపకాయ అనుకోవడమేమిటీ మధ్య? మొన్న వాళ్ళ సీమ అమ్మతో తెగేసి చెప్పిందిగా 'నేను దేశవాళీ సరుకునే చేసుకుంటాను. మీ చచ్చు అమెరికన్ వద్దూ' అని. ఆ సమాధానం చాలదా నీకు? అసాధ్యమనుకున్న మామగారి హృదయ మందిరంలో తిష్టవేసుకున్నావంటే నీ ఇంటి ప్రాబ్లమ్ ఇట్టే తీరిపోతుంది"

"రాకేష్! నీ బుర్ర చాలా పదును అని ఒప్పుకున్నానుకానీ ముందు బుద్ధిగా ఇల్లు వెదికే పని మొదలుపెట్టు. త్వరగా నాన్నగారినీ, చెల్లాయినీ తీసుకురావాలి. ఆతర్వాత మిగతా ఆలోచనలు"

"అంటే..దొరగారు రెడీ అన్నమాట. నాకు తెలుసులేరా! మా ఆంటీ అభిమానం సంపాదించిన రోజే అనుకున్నాను ఇది ఇలాగే జరుగుతుందనీ, జరగాలనీ. ఇక మా సీమ మిరప నీ మీద ప్రత్యేక వీక్షణలు జరపటం మన దృష్టిని దాటిపోలేదనుకో. ఎనీహౌ లక్కీగైవిరా. చిరునవ్వుకైనా నోచుకోలేదని తెగ బాధపడుతున్నాడు ఆ విల్సన్. ఈరోజు ఉదయం మామగారు అత్తగారికి హాట్ హాట్‌గా డోస్ ఇచ్చినట్లున్నారు. 'మేం వెళ్ళిపోతాం బ్రదర్! సంధ్యా ఈజ్ నాట్ విల్లింగ్ టూ మారీ మీ!' అంటూ ఏడుపు మొఖం పెట్టాడు గురుడు. 'నీకు కావలసింది ఇండియన్ అమ్మాయికదా నేను ఎరేంజ్ చేస్తాను...డోంట్ వర్రీ. సంధ్య ఒప్పుకోకపోతే ఏం? బోల్డుమంది అమ్మాయిలున్నారు' అని ధైర్యంచెప్పి వచ్చాను"

"నిజంగా సంబంధం చూస్తావా అతనికి" అని అడిగాడు సాగర్.

"ఏం... చూస్తే తప్పేముంది? వెయ్యి అబద్ధాలాడైనా ఓ పెళ్ళి చేయమన్నారు. ఒక్క అబద్ధం ఆడి మన మరిడయ్య కూతురుతో రేపీపాటికి పెళ్ళిచేసి చూపిస్తాను చూడు" అంటున్న రాకేష్ మాటలకు పగలబడి నవ్వుతున్న సాగర్ పక్కన నవ్వు ఆపడంతో వెనుదిరిగి చూసిన రాకేష్ తన వెనకే నుంచున్న సంధ్యనూ, సుభనూ చూసి హడావుడిగా లేస్తూ-

"ఏమిటి మీరిలా వచ్చారు? పదండి రూమ్‌లోకెళ్దాం. పదరా సాగర్" అంటూ ముందుకు నడవడంతో అంతా అతన్ని అనుసరించారు.

రూమ్ చేరినా మౌనం వీడని సుభనూ, సంధ్యనూ మార్చి మార్చి



చూస్తూ—

"ఏమిటి సుభా...ఏం జరిగింది? ఎందుకలా వున్నారు?" ఆదుర్దాగా అడుగుతున్న రాకేష్‌కు ఎవ్వరూ సమాధానం చెప్పకపోవడంతో—

"ఏమిటండీ...ఎందుకలా వున్నారు? అంకులేమైనా అన్నారా?" అని అడిగాడు సాగర్.

తల అడ్డంగా వూపారు ఇద్దరూ.

"ముందు మీరిలా కూర్చోండి" అంటూ వాళ్ళను కూర్చోబెట్టి బైటకు వెళ్ళి కాఫీ తెమ్మని ప్యూన్‌కు చెప్పివచ్చి కూర్చున్నాడు సాగర్.

"ఏం జరిగింది సంధ్యా! మీరైనా చెప్పండి. ఏం చెప్పకుండావుంటే విషయం మాకెలా తెలుస్తుంది?"

కళ్ళెత్తి సాగర్ వైపు చూసిన సంధ్య కళ్ళనిండా నీళ్ళు నిండాయి. రాకేష్, సాగర్‌లిద్దరూ ఒక్కసారిగా చలించిపోయారు. అంతంతమాత్రానికి కంటతడి పెట్టే స్వభావం కాదు సంధ్యది. చాలా ధైర్యస్తురాలు. ఏదో విపరీతం జరిగినట్టుంది.

"బావా! మమ్మీ విల్సన్‌ను పెళ్ళి చేసుకోకపోతే ప్రాణత్యాగం చేస్తానని పట్టుబట్టి కూర్చుంది. ఏం చెయ్యాలో, ఆమెకెలా చెపితే అర్థమౌతుందో తెలీడం లేదు. రాకరాక ఇన్ని సంవత్సరాలకు మమ్మీ ఇండియా వచ్చింది. వస్తూనే తనతో విల్సన్ అనే సమస్యను వెంట తెచ్చింది. ఇన్ని సంవత్సరాల తర్వాత తిరిగి వచ్చిన మమ్మీ నా కారణంగా ప్రాణత్యాగం చేస్తానంటే డాడీ ఎంత బాధపడతారు?" సంధ్య కళ్ళలో మళ్ళీ నీళ్ళు తిరిగాయి.

"ఛా...ఏవిటిది. నువ్వెంతో ధైర్యస్థురాలివనుకున్నా. నువ్వలా బేలగా బాధపడటం ఏవిటి సంధ్యా? పరిష్కారమార్గం ఆలోచించి పరిస్థితిని అదుపులోకి తెచ్చే మార్గం ఆలోచించాలిగానీ, ఇలా మామూలు ఆడపిల్లలా కన్నీరు కార్చటం... నో నో ఇట్ డస్ నాట్ సూట్స్ యూ సంధ్యా!" అంటున్న రాకేష్ వైపు సాగర్ వైపు మార్చి చూసింది సంధ్య.

"నాకు ఏమీ తోచడంలేదు బావా!



ఈ దుర్భర పరిస్థితినుంచి నన్ను మీరే రక్షించాలి. ఏదో వుపాయం మీరే ఆలోచించండి"

"సమస్య మా ముందుంచావు. ఇక పరిష్కార మార్గం ఏదో మేమిద్దరం కలసి ఆలోచిస్తాం. నువ్వు నిశ్చింతగా వుండమ్మా. సుభా...నువ్వు కూడానా? సంధ్యకు ధైర్యం చెప్పడం పోయి తనతో పాటు ఏడుస్తూ కూర్చున్నావన్నమాట. అబ్బబ్బ ఏం ఆడవాళ్ళండీ..."

"ఊ... ఇక ఆపు! ఛాన్సు దొరికింది కదాని వూరికే వదినగారి మీదకు దండెత్తకు. ముందు జరగవలసింది ఆలోచించు. ఇందాక నువ్వు చెప్పావే అది ఈ సాయంకాలమే అమలుపరిస్తే ఎలా

వుంటుంది?"

"భేషుగ్గా వుంటుంది. మాలక్ష్మిని తీసుకొని రమ్మని మరిదయ్యకు చెప్పు" అంటున్న రాకేష్ వైపు విచిత్రంగా చూస్తున్న సుభా, సంధ్యల వైపు చూసి వివరించాడు సాగర్ –

"మన విల్సన్ చక్రవర్తిగారి కోసం ఓ ఇండియన్ క్వీన్‌ను సెలక్ట్ చేసి పెట్టాము. అందుకు అతని అంగీకారం కూడా లభించిందట. ఈ సాయంత్రం నెమ్మదిగా షికారు తీసుకొచ్చి అతని అభీష్టాన్ని నెరవేర్చడమే తరువాయి. మీరు నిశ్చింతంగా వుండండి. విల్సనే స్వయంగా మీ సమస్య తీరుస్తాడు. ఇంక ఆ తర్వాత మీ మమ్మీ బెదిరించడానికి ఛాన్సులేదు. పాపం! ఆమెగారి ప్లాన్ అట్టర్‌ఫ్లాప్ అయి తీరుతుంది. ఈ బ్లడీ ఇండియన్స్‌కు సెంటిమెంట్స్ ఎక్కువన్న నగ్నసత్యం తెలుసు ఆమెకు. అందుకే ఆ సెంటిమెంట్స్ యూజ్ చేసి నిన్ను జయించాలని చూసింది సంధ్యా. కానీ సెంటిమెంట్స్‌తో పాటు ఎ లిటిల్ బిట్ సెన్సాఫ్ హ్యూమర్ కూడా ఎక్కువని ప్రూవ్ చేద్దాం" అంటూ నవ్వుతున్న సాగర్‌ను చూసిన సంధ్య పెదాల మీద కూడా నవ్వు విరిసింది. సాగర్ కూడా రాకేష్‌లాగే ఆత్మీయుడిగా, ఆప్తుడిగా అనిపించాడా క్షణంలో.

కాఫీలు తాగి కొంచెంసేపు కూర్చొని మనసుకు మరింత ధైర్యాన్ని నింపుకొని బయలుదేరి ఇంటికి వెళ్ళారు సుభా, సంధ్యలు.

అనుకున్న ప్లాన్ ప్రకారం మరిదయ్యతో మాట్లాడారు. మరిదయ్య విషయం వినగానే మొదట భయపడ్డాడు. విల్సన్‌తో చెప్పి ప్రతినెలా కొంత డబ్బు పంపే ఏర్పాటు చేస్తామన్నారు. అతనికి భారతీయులంటే విపరీతమైన మోజు వుండటంవల్ల లక్ష్మిని ప్రేమగా చూసుకుంటాడనడంలో సందేహం లేదు. అతని పరిస్థితి, పొజిషన్ బట్టి లక్ష్మికి ఏ లోటూ వుండదు. మొదటినుంచీ లక్ష్మికి గొప్పగా బతకాలన్న కోరిక వుండటంవల్ల ఈ పెళ్ళి ఆమెకుఆనందదాయకమే అవుతుంది అన్నారు. ఎన్నో రకాల చెప్పిన మీదట మరిదయ్య ఆ పెళ్ళికి ఒప్పుకున్నాడు. లక్ష్మి తన అదృష్టానికి మురిసిపోయింది. ఛామన ఛాయలో పెద్దకళ్ళతో అమాయకంగా ముగ్ధమోహనంగా వున్న లక్ష్మి విల్సన్‌కు మరింత ఆకర్షణీయంగా కనిపించింది. సంధ్యనే పెళ్ళాడాలన్న పట్టుదల అతనికేం లేదు. ఇండియాను గురించీ, ఇండియన్సును గురించీ, వారికుండే సెంటిమెంట్స్ గురించీ మార్గరెట్ చెబుతుంటే విసివిసీ అవన్నీ వంటపట్టించుకున్నాడు. ఎలాగైనా తను పెళ్ళంటూ చేసుకుంటే ఇండియన్ గర్ల్‌నే చేసుకోవాలని నిర్ణయించుకున్నాడు. తన నిర్ణయాన్ని బలపరిచి, మరింతవూపిరిపోసింది మార్గరెట్. సురేంద్ర ఎదురుగా ఇండియాను గురించీ, ఇండియన్స్ గురించి ఇన్సల్టింగ్‌గా మాట్లాడినా మానసికంగా మార్గరెట్‌కు ఇండియా మీద అభిమానం పోలేదు. అందుకే తనకు దూరపు బంధువైన విల్సన్‌కు ఇండియా అమ్మాయి ఆశపెట్టి ఆ వంకతో అతన్ని తీసుకొని ఇండియా వచ్చింది. కానీ ఇక్కడ పరిస్థితి...తనకు అనుకూలంగా లేదు. ముమ్మూర్తులా తన లాగే వుండే సంధ్య ఆశలూ, ఆశయాలు తనకు పూర్తిగా వ్యతిరేకంగా వుండటం, తనంటే ఏమాత్రం లక్ష్యం లేకపోవడం, కన్నతల్లిగా తనమీద ఎలాంటి ప్రత్యేక

 

అభిమానం చూపించక పోవడం మార్గరెట్‌ను విపరీతంగా బాధించాయి. ఎలాగైనా పట్టుపట్టి విల్సన్ మారేజి సంధ్యతో అయ్యేలా చూస్తే...ఇంక తన మాటకు తిరుగు వుండదు. మళ్ళీ ముసు పదిలా సురేంద్ర మీద సర్వహక్కులూ తన సొంతంఅవుతాయి అని వూహా గానాలు చేస్తోంది మార్గరెట్.



సరిగ్గా అదే సమయంలో సాగర్, రాకేష్‌ల సారథ్యంలో శుద్ధ భారతీయ పద్ధతిలో చకచకా జరిగిపోయిన ఏర్పాట్ల మధ్య, మహాలక్ష్మి గుళ్ళో విల్సన్ లక్ష్మి మెడలో తాళి కడుతున్నాడు. అతి కొద్ది మంది మిత్రులకు ఈ విషయం చెప్పాడు రాకేష్. వాళ్లు ఆ వివాహానికి హాజరై వధూవరులను ఆశీర్వదించారు. భాష తెలీకపోయినా లక్ష్మి కళ్ళలో మెరుపుల్ని గుర్తించగలిగిన విల్సన్ తృప్తిగానవ్వుతూ లక్ష్మి చేయి మృదువుగా నొక్కాడు. నోటితో చెప్పలేని ఎన్నో భావాల్ని అతని ముఖంలో ఆ మృదువైన వెచ్చటి స్పర్శలో గ్రహించగలిగింది లక్ష్మి. పెళ్లి సమయానికి వచ్చిన సంధ్యా, సుభలు అందించిన కానుకలు అందుకున్న విల్సన్ కృతజ్ఞతలు చెప్పాడు.

"లక్ష్మీ! రేపటినుంచి నువ్వు ఇంగ్లీషు నేర్చుకోవాలి. లేకపోతే విల్సన్ ఇబ్బంది పడిపోతాడు" అంటున్న సాగర్ మాటలకు నవ్వుతూ తల వంచుకున్న లక్ష్మి వైపే మురిపెంగా చూస్తున్న విల్సన్ వైపు చూస్తూ-

"మిష్టర్ విల్సన్! యూ షుడ్ లెర్న్ తెలుగూ లాంగ్వేజ్, ఆర్ మరాఠీ. దెన్ ఓన్లీ యూ కెన్ టాక్ టు లక్ష్మి" అంటూ నవ్వుతున్న సంధ్య వైపు చూసి-

"డెఫినెట్‌లీ ఐ విల్ లెర్న్ ఇండియన్ లాంగ్వేజస్. బట్ యూ షుడ్ హెల్ప్‌మీ టూడూసో. గెట్ మీ ఏ గుడ్ టీచర్" అన్నాడు విల్సన్ సంధ్య వైపు చూసి నవ్వుతూ.

ఆ తర్వాత విల్సన్, లక్ష్మిలను హోటల్ రూమ్‌లో వదిలి సుభా, రాకేష్, సంధ్యా, సాగర్‌లు డిన్నర్ కాగానే ఇంటికెళ్ళిపోయారు.

ఆ రాత్రి సాగర్ ఎంత ప్రయత్నించినా నిద్రపట్టలేదు. విల్సన్ అమెరికన్ అయ్యుండీ తాము చెప్పినట్లు విని లక్ష్మి మెళ్ళో తాళి కడుతూంటే ఆ దృశ్యం చూస్తున్న తన కళ్ళకు ఆ స్థానంలో తనూ, సంధ్యా వున్న అనుభూతికలిగింది. తమ పెళ్ళి అలాగే జరుగుతుందా? అందుకు ముందుగా సంధ్య మనసు పూర్తిగా జయించాలి. ఆ తర్వాత మావయ్య ఏమీ చేయలేడు. ఆయన మాటల్ని బట్టి పెళ్ళి విషయంలో తన కూతురికి పూర్తి స్వేచ్ఛ ఇచ్చారని అర్థ మౌతోంది. ఇంక సంధ్య నిర్ణయానికి తిరుగులేదు.

సంధ్య తన మనస్సేమిటో విప్పి చెప్పేంత వరకూ తను తొందరపడ కూడదు. ఈ నెల్లాళ్ళుగా సంధ్య ప్రవర్తనలో చాలా మార్పు వచ్చింది. అంత క్రితంలా ఇప్పుడు ప్రతి చిన్న విషయా

నికి కోపం తెచ్చుకోవడం మానేసింది. సంధ్య సంధ్యలా చల్లగా మారిపోయింది అంటున్నాడు రాకేష్. సంధ్య తనతో కళ్లు కలిపి నవ్వినప్పుడు ప్రపంచంలో మరింకేమీ ఆ మృదు మధుర మంజుల హాసానికి సరిరావనిపిస్తుంది.

అతి తక్కువ సమయంలో తన హృదయాన్నాక్రమించి పూర్తిగా తన వాడిని చేసుకోగలిగిన సంధ్య అనురాగ వాహినిలో తేలి, జీవనరాగం మృదు మధురం కాగలిగే శుభముహూర్త మెప్పటికో...అనుకుంటూ కళ్లు మూసుకున్నాడు సాగర్.

తెల్లవారింది. ఎవరికివారు నిత్య కృత్యాల్లో మునిగిపోయారు. సురేంద్ర ఆఫీసుకు బయలుదేరుతుంటే అతని రూమ్ లోపలికి వెళ్ళి అడిగింది మార్గరెట్ "ఏం ఆలోచించారు?" అని.

"ఏ విషయం మార్గరెట్?" అన్నాడు సురేంద్ర అర్థం కాక.

"అప్పుడే మరచిపోయారా? సంధ్యా, విల్సన్ మారేజి విషయం"

"అందులో నా ప్రమేయం లేదని చెప్పానుగా, పూర్తిగా సంధ్య ఇష్టాయిష్టాల మీద ఆధారపడిన విషయం. తనకిష్టమైతే నాకు అభ్యంతరం లేదు" అన్నాడు అద్దంలో చూసి టై సరిచేసుకుంటూ.

"మే ఐ కమిన్ అంకుల్" అన్న మాట విని వెనుదిరిగి చూశారిద్దరూ. ఎదురుగా సిగ్గుపడుతూ నుంచున్న అమ్మాయి పక్కన చిరునవ్వుతో నుంచున్న విల్సన్ వైపు ఆశ్చర్యంగా చూశారిద్దరూ.

"దిస్ ఈజ్ మై వైఫ్ లకిన్‌మీ" అని చెబుతున్న విల్సన్ వైపు గుడ్లప్పగించి చూస్తున్న మార్గరెట్ షాక్ నుంచి తేరుకోకముందే ఆశ్చర్యంగా, ఆనందంగా ముందుకు నడిచిన సురేంద్ర చిరునవ్వుతో విల్సన్ చేయి అందుకొని మృదువుగా నొక్కి షేక్ చేశారు.

"వెరీ గుడ్ సెలక్షన్ మై బోయ్. అయ్ విష్ యూ ఎ వెరీ హాపీ మారీడ్ లైఫ్. కంగ్రాచ్యులేషన్స్" అన్నారు.

"థాంక్యూ అంకుల్!" అంటున్న విల్సన్ వైపు నిరసనగా చూస్తూ గబగబా ఆ గది దాటి బయటకు వెళ్ళిపోయింది మార్గరెట్.

తన ప్లానంతా పాడుచేశాడు విల్సన్. తను ఎంతగానో వూహించుకున్న విషయాన్ని నిముషంలో ముగించి, తనకున్న ఒక్క ఛాన్సూ లేకుండా చేశాడు. ఇంక ఏ ముఖం పెట్టుకుని సురేంద్ర ఇంట్లో ఉండగలదు? కోపంతో బుసలుకొడుతున్న మార్గరెట్ వైపు భయం భయంగా చూస్తున్న లక్ష్మి వైపు చూసి చిన్నగా నవ్వుతూ "పదమ్మా లోపలికెళ్ళు...ఆమె కోపం ఎంతోసేపు ఉండదు" అంటున్న సురేంద్ర వైపు కృతజ్ఞతగా చూసి చటుక్కున వంగి అతని కాళ్ళకు నమస్కరించింది లక్ష్మి. ఆమె చేస్తున్న పని చూసిన విల్సన్ కూడా వంగి సురేంద్ర కాళ్ళకు నమస్కరించాడు.

పెద్ద సమస్యను అతి సులభంగా పరిష్కరించిన విల్సన్‌ను చూస్తుంటే ఎంతో సంతోషంగా వుంది సురేంద్రకు. సరిగ్గా అప్పుడే గదిలోకి వచ్చిన రాకేష్, సుభ, సంధ్యలకు వాళ్ళను చూపించి–

"అమ్మాయిని లోపలకు తీసుకెళ్ళండమ్మా!" అన్నారు.

లక్ష్మిని తీసుకొని లోపలికెళ్ళారు సుభా, సంధ్యా. అప్పుడే అటుగావచ్చిన స




సాగర్ వాళ్ళను చూసి,

"హల్లో!" అంటూ రాకేష్ వైపు నడిచాడు.

విశ్రాంతిగా సోఫాలో వొరిగిన సురేంద్ర కళ్ళలో మెరుస్తున్న సంతృప్తి చూస్తూ-

"అంకుల్! విల్సన్ మారేజ్ నిన్న సాయంత్రం జరిగింది. మీకు తెలిస్తే ఏమంటారోనని తెలియజేయలేదు. సాగర్, సంధ్యా, సుభా, నేనూ దగ్గరుండి చేయించాము. ఆ అమ్మాయి ఎవరో కాదు...మన మరిదయ్య కూతురమాలతి. ఓ పేద పిల్లకు గొప్ప జీవితం లభించింది ఈ పెళ్ళితో. విల్సన్ కోరుకున్నట్లు అందమైన ఇండియన్ అమ్మాయి అతని భార్య అయ్యింది. మీకు తెలీకుండా మేము చేసిన ఈ శుభకార్యం మీకు సంతోషమే కలిగిస్తుందన్న విశ్వాసంతో చేశాము"

నెమ్మదిగా వివరాలన్నీ చెబుతున్న రాకేష్ వైపు ఆనందంగా చూస్తూ, ఆశ్చర్యాన్ని అణచుకుంటూ-

"నాకు చాలా సంతోషంగా వుంది. ముఖ్యంగా సంధ్య అభిప్రాయం తెలిసిన తర్వాత ఆమెను అమెరికన్ని పెళ్ళి చేసుకోమని బలవంతం చేయడం నాకెంత మాత్రం ఇష్టంలేదు. మార్గరెట్‌కు ఎన్ని విధాల చెప్పినా తను ఎవర్నీ అర్థంచేసుకోడానికి ప్రయత్నించలేదు. మొత్తానికి మీ యువతరం అంతా కలిసి ఈ సమస్యకు ఓ అందమైన పరిష్కారం చూపించారు. నాకు చాలా సంతోషంగా వుంది" అన్నారు సురేంద్ర.

మరో నాలుగు రోజుల్లో కొత్త జంట కోసం హనీమూన్ ఏర్పాట్లన్నీ ఘనంగా చేయించి వారికి టికెట్స్ హేండ్ఓవర్ చేశాడు సురేంద్ర. విల్సన్ ఎన్నో విధాల థాంక్స్ చెప్పుకున్నాడు. మరో రిక్వెస్ట్‌గా తమతోపాటు రాకేష్, సుభను కూడా రమ్మని మరీ మరీ కోరడంతో కొన్నాళ్ళవరకైనా వాళ్ళకు ట్రాన్స్‌లేటర్స్ అవసరమని గ్రహించి సురేంద్రగారు నవ్వుతూ వాళ్ళ ప్రయాణానికి కూడా అంగీకరించారు.

రెండు జంటలూ హైదరాబాద్ ఎక్స్‌ప్రెస్ ఎక్కారు. వాళ్ళకు సెండాఫ్ ఇవ్వడానికి వచ్చిన సంధ్యా, సాగర్, మరిదయ్యలు ప్లాట్‌ఫాం మీద కబుర్లు చెబుతున్నారు.

"మొత్తానికి హనీమూన్‌కు సెకెండ్ ఛాన్సు దొరికిన అదృష్టం నీదేరా రాకేష్" అంటూ నవ్వుతున్న సాగర్ వీపున చరిచి-

"డోంట్ వర్రీ మై బోయ్! నీక్కూడా డబుల్ ఛాన్స్ ఇప్పిస్తాలే" అంటూ కన్నుగీటాడు రాకేష్.

గార్డ్ విజిల్ వేయడంతో కంపార్ట్‌మెంట్‌లోకి గెంతిన రాకేష్-

"మా హనీమూన్ పూర్తయ్యి వచ్చేసరికి నీ కథ క్లైమాక్స్‌కు రావాలి సాగరా! ఆల్ ది బెస్ట్" అంటుండగానే రైలు స్పీడ్ అందుకుంది.

నవ్వుతూ చేతులు వూపుతున్న సంధ్యకు ఏదో వెలితిగా, బాధగా అనిపించింది. అన్ని రోజులు అక్కను వదలి ఎప్పుడూ వుండలేదు. మొదటిసారి వాళ్ళు హనీమూన్‌కు వెళ్ళినా సుభకు జ్వరం రావడంతో వారం రోజుల్లో తిరిగి వచ్చేశారు. ఆ తర్వాత తనకు వూహ తెలిసి అక్కను వదిలిపెట్టి వున్న సందర్భాలు చాలా తక్కువ. అందుకేనేమో ఈ వెలితీ, బాధ!

ఆలోచనల్లో మునిగిన సంధ్య సాగర్

పిలుపుతో వులిక్కిపడి ఈ లోకంలోకి వచ్చింది.

"బండి వెళ్ళిపోయింది. ఇంక మనం వెళదామా? లేక ఇక్కడే...." అంటూ నవ్వుతున్న సాగర్ వైపు చూసి చిన్నగా నవ్వింది.

"పదండి వెళదాం!" అంటూ ముందుకు నడిచింది.

"మరి నే గిట్టనే ఆ పిచుకాడికెళ్ళిపోత నమ్మా" అంటూ మరిదయ్య చెప్పగానే తల వూపింది సంధ్య.

"మిమ్మల్ని ఆఫీసు దగ్గర డ్రాప్ చేసి వెళ్ళనా?" స్టీరింగ్ ముందు కూర్చుంటూ అడుగుతున్న సంధ్య వైపు వోరగా చూస్తూ ఆమె పక్కనే కూర్చున్న సాగర్ తల అడ్డంగా వూపాడు.

"మిమ్మల్ని ఇంటిదగ్గర వదిలేసి కారు తీసుకు రమ్మన్నారు అంకుల్" అంటున్న సాగర్ వైపు సాభిప్రాయంగా చూసి కారు స్టార్ట్ చేసింది సంధ్య.

పక్కన మరో మనిషి వున్నాడన్న ఆలోచన కూడా లేకుండా ఆలోచనల్లో మునిగిపోయింది సంధ్య. అలవాటుపడిన దారిన మెల్లగా సాగిపోతోంది కారు. అప్రయత్నంగానే పక్కకు తిరిగి సంధ్య వైపు చూసిన సాగర్ చూపుల్ని మరో వైపు మరల్చలేకపోయాడు. దీర్ఘాలోచనలో మునిగి,తదేకంగా ముందుకు చూస్తూ డ్రైవ్ చేస్తున్న సంధ్య ముగ్ధమోహన రూపం చూసినకొద్దీ చూడాలనిపిస్తోంది. చెక్కినశిల్పంలా, సన్నటిమెడా, ఆకళ్ళూ, ఆ ముక్కూ సంధ్యకు పెద్ద ఎస్సెట్స్.

సంధ్యను ఇంట్లో వదిలి కారు తీసుకొని ఆఫీసుకు వెళ్ళిపోయాడు సాగర్. రాకేష్ లేని లోటు బాగా తెలుస్తోంది. అనుక్షణం ఏదో జోక్ చేస్తూ నవ్వుతు నవ్విస్తూ వుండే రాకేష్ లేని కొరత ఇంట్లో అందరికీ తెలుస్తోంది. ముఖ్యంగా సాగర్‌కు. సాధ్యమైనంతసేపు మాలతి ఆంటీతో కబుర్లు చెబుతున్నాడు. సాయంత్రం తనూ, సంధ్యా షటిల్ ఆడుతున్నారు ఇష్టం వచ్చినంత సేపు.సంధ్యకు సాగర్ దగ్గర చనువు పెరిగింది. అందుకు మాలతీదేవి ప్రోత్సాహం కూడా వుంది. ఒక్కోరోజు మరీ బోర్‌గా వుండే పిక్చర్ ప్రోగ్రాం పెట్టేది సంధ్య. ఆఖరి నిముషంలో సాగర్, సంధ్యే మిగిలేవారు. మిగతావాళ్ళు ఏదో వంకతో తప్పుకునేవారు. సంధ్యకు సాగర్ అంటే ఇప్పుడిప్పుడే ఓ అభిప్రాయం ఏర్పడుతోంది.

తను అతన్ని ప్రేమిస్తోందా? ఏమో? కానీ అతనంటే ఇష్టం, అభిమానం పెరుగుతున్నాయి. గ్రాడ్యువల్‌గా అవే ప్రేమవాహినిగా రూపాంతరం చెందుతాయేమో! చెందితే నష్టమేముంది? డాడీ ఒప్పుకుంటారా? ఎందుకొప్పుకోరు. సాగర్‌లో ఏంలోపం వుంది? ఆయనకు కావలసిన అన్ని అర్హతలూ వున్నాయి... ఒక్క ఆస్తి తప్ప. అది తమకు కావలసినంత వుంది. ఇంకా డాడీకి అభ్యంతరం ఏముంటుంది?తను ఒక్కసైడే ఆలోచిస్తోంది. సాగర్ గురించి ఆలోచించడం లేదు. అతని మనసేవిటో? అతని అభిప్రాయం తెలుసుకునేదెలా? ఆంటీకి చెబితే? అమ్మో! ఆంటీకి తెలిస్తే ఆటపట్టిస్తుంది. నెమ్మదిగా తనే సాగర్‌ను అడగాలి.

అతను తనంతట తను ఎలాగూ అడగలేడు. తనే ధైర్యంచేయాలి. అతని అభిప్రాయం కూడా తెలుసుకున్న తర్వాత డాడీకి చెప్పాలి. అంతవరకూ ఆలోచించిన సంధ్య సాగర్ ఆఫీస్ నుంచి రావడంతో గబగబా రెడీ అయి అతని గది




లోకి వెళ్ళి "ఈరోజు మనం బీచ్‌కు వెళుతున్నాము...గెట్‌రెడీ" అంటూండగానే కాఫీతో లోపలికి వచ్చింది మాలతి.

"సాగర్‌ను కాఫీ అయినా తాగనివ్వమ్మా! పాపం ఇప్పుడే ఆఫీసు నుంచి వచ్చాడు. రాకేష్ లేకపోవడంవల్ల సాగర్‌కు పని ఎక్కువైందట" అంది మాలతి.

"అలాగని నీతో చెప్పుకున్నారా అత్తయ్యా! కావాలంటే నేను హెల్ప్ చేస్తానులే బావ వచ్చేంతవరకూ. ఊ... త్వరగా రండి" అంటూ తన రూమ్‌వైపు పరుగెత్తుతున్న సంధ్యను చూసి ఇద్దరూ నవ్వుకున్నారు.

వెళుతున్న సాగర్ వైపు చూస్తూ—

'వీడు అచ్చం వాళ్ళ నాన్న నోట్లోంచి వూడి పడ్డట్లే వుంటాడు. అయితే జగన్ నుండి...తనకు ప్రాప్తించని ఆప్యాయత, ఆత్మీయత వీడి దగ్గర తనకు లభిస్తున్నాయి' అనుకుంటూ నెమ్మదిగా వంటగది వైపు కదిలింది మాలతి.

"సాగర్! కారు డాడీ తీసుకెళ్ళారు క్లబ్బుకు. మనం స్కూటర్‌పై వెళ్ళాల్సిందే" అంటున్న సంధ్య వైపు చూసి నవ్వుతూ—

"నాకేం అభ్యంతరం లేదు. ఎటు తిరిగి నా పక్కన కూర్చోడానికి నీకే కొద్దిగా ధైర్యం అవసరం" అన్నాడు సాగర్.

"ఓ యస్! ధైర్యానికేం పుష్కలంగా వుంది. పదండి" అంటూ బయలుదేరింది సంధ్య.

సంధ్యతో బీచ్‌కు బయలుదేరిన సాగర్ స్కూటర్ వెనుక తన భుజం మీద ఓ చేయివేసి, నిర్భయంగా తనమీద భారాన్నివేసి కూర్చున్న సంధ్య వైపు చూసి సన్నగా నవ్వుకున్నాడు.

"సంధ్యా...ఏ బీచ్‌కు?" అడుగుతున్న సాగర్ వైపు అదోలా చూస్తూ

"లవ్వర్స్ బీచ్‌కు" అంది సన్నగా నవ్వుతూ.

"లవర్స్ బీచా? అదెక్కడుందో నాకు తెలియదేమరి...దారి చూపించాల్సిన బాధ్యత నీదే" అన్న సాగర్ వీపున సన్నగా ఓ దెబ్బ వేసి—

"బీచ్‌కు దారి చూపిస్తే చాలా? లవర్‌ను కూడా వెదికిపెట్టాలా?" అంది సంధ్య.

"ఆ శ్రమ నీకివ్వనులే సంధ్యా! నేనే వెదుక్కున్నాను. బీచ్‌కు దారి చూపించావంటే అప్పుడప్పుడూ వెళ్ళడానికి అనువుగా వుంటుంది" అన్న సాగర్ మాట అపశ్రుతిలా వినిపించింది సంధ్యకు.

తనేమేమో ఊహించి ఈ షికారుకు బయలుదేరింది. కానీ సాగర్ ఇప్పుడన్న మాట ఏమిటి? ఇంతక్రితమే లవర్‌ని వెదుక్కున్నాడా? మరి .... మరి తను భవిష్యత్ గురించీ, సాగర్ గురించీ ఊహించుకున్నదంతా...? నయం తను తొందరపడి మనసు బయటేసుకోకపోవడం నయమే అయ్యింది. అతని మనసు ముందే తెలియడం కూడా మంచిదే అయ్యింది. తను అతన్నడిగి లేదనిపించుకుంటే ఎంత అవమానంగా వుండేది. ఆ శ్రమ తప్పించాడు.

ఇంతలో స్కూటర్ ఆగింది.

"ఏమిటిసంధ్యా! ఒక్కసారేమౌనవ్రతం మొదలుపెట్టావు? సడన్‌గా ఏ లోకాల్లోకి వెళ్ళి పోయావు!" అంటూ నవ్వుతున్న సాగర్‌ను వదిలి సిగ్గుగా ఒదిగి నిల్చుంటూ జీవితంలో మొట్టమొదటిసారిగా ఏదో తెలిని అనుభూతికి లోనౌతూ "అయామ్

సారీ... ఏదో ఆలోచిస్తూ వుండిపోయాను" అంటూ తల దించుకున్న సంధ్య వైపు కొత్తగా అప్పుడే చూస్తున్నట్లు చూశాడు సాగర్.

"లవర్స్ బీచ్ అనగానే కలలో తేలిపోతే ఎలా? పద వెళదాం" అంటూ స్కూటర్ పార్క్ చేసి ముందుకు నడుస్తున్న సాగర్‌ను అనుసరించింది సంధ్య.

తనముందు నడుస్తున్న ఆ అందమైన యువకుడిని చూస్తూ నడుస్తున్న సంధ్య మనసు అంతకంతకూ భారమౌతోంది. ఇంతవరకూ జీవితంలో తను కోరుకున్న దేదీ పొందకుండా లేదు. కానీ జీవితానికి అతి ముఖ్యమైన పెళ్ళి విషయంలో తను కోరుకున్నవాడు తనకు దొరకడేమో అన్న ఆలోచనే భరించలేనిదిగా వుంది.

తనని అనుసరించి తన అడుగులో అడుగులేస్తున్న ఈ అమ్మాయి, ఈ సౌందర్యరాశి తన జీవితాన్ని ఆనంద నిలయం చేయగల అనురాగ రాశి కౌగలిగితే తనకంటే అదృష్టవంతుడు వేరొకడుండడు. తమ ఇద్దరి కలయిక, హేమంతంలో ప్రవేశించినా వసంతాన్ని చవిచూడని పిన్ని మాలతీదేవి జీవితానికి వసంతాన్ని ప్రసాదిస్తుంది.... సాగర్ ఆలోచనల ధోరణి అలా వుంది.

"ఇక్కడ కూర్చుందామా సంధ్యా?" ఎవ్వరూ లేనిచోట సముద్రానికి దగ్గరగా కూర్చోబోతూ అడిగిన సాగర్ మాటకు బదులుగా మౌనంగా కూర్చుంది సంధ్య.

అతను సంధ్యా అని చనువుగా పిలిచినప్పుడల్లా ఏదో తెలియని వింత అనుభూతి కలుగుతోంది. అతను తనకెంతో ఆత్మీయుడనిపిస్తోంది. కానీ ఇందాక అతను అన్న ఒక్కమాటతో తన కోరికలన్నింటినీ మరచిపోక తప్పదనిపిస్తోంది.

అతనన్నమాట.... ఏదో సరదాగా అన్నాడేమో? మరో అమ్మాయితో అతనికి ప్రేమ... ఆ భావనే భరించలేక పోతోంది పాడు మనసు. పోనీ ఆ అదృష్ట వంతురాలెవరో అతన్నే అడిగితే?

ఆలోచనల్లో మునిగి సాగరగర్భంలోకి సుదీర్ఘంగా చూస్తున్నది సంధ్య. అస్తమయ సూర్యుని అరుణ కిరణాలు పడి మరింత కాంతులీనుతున్న ఆ నున్నటి చెక్కిళ్ళ వైపే చూస్తూ మెల్లగా పిలిచాడు సాగర్ "సంధ్యా!" అంటూ!

పక్కకు తిరిగిన సంధ్య అంతులేని అనురాగంతో తన వైపే చూస్తున్న ఆ కళ్ళనుంచి చూపులు మరల్చుకోలేక పోయిందో క్షణం. అంతలోనే తనని తాను స్వాధీనంలోకి తెచ్చుకుంటూ మెల్లగా నవ్వి—

"ఊ! మీరో లవర్ని వెదుక్కున్నానని చెప్పారు... మాకెవ్వరికీ చూపించ లేదేం? ఎక్కడ వున్నారు? నాకు చూపిం చరూ?" అంది.

సంధ్యవైపే తదేకంగా చూస్తూ-

"నీకు చూపించకుండానా! తప్పకుండా చూపిస్తాను. అయితే ఆ అమ్మాయి ఎవరో కాదు... మా మావయ్య కూతురే! చిన్నప్పుడే సెటిల్ అయిన మాచ్"

"మీకు తెలియని వయసులో పెద్దలు నిర్ణయించిన విషయాలకు అంతటి ప్రాధాన్యం ఇస్తారా? మీకంటూ ఓ మనసూ, వ్యక్తిత్వం లేదా? పెళ్ళి చేసుకోగలరేమో గానీ, ప్రేమకెక్కడ అవకాశం వుంది ఆ పెళ్ళిలో?" కొద్దిగా ఆవేశంగా ధ్వనిస్తున్న సంధ్య వైపు చిత్రంగా చూస్తూ-

"ఏం... ఎందుకులేదు? ప్రేమించకూడదని రూలెక్కడుంది? పెద్దలు నిర్ణయించినంత మాత్రాన ప్రేమించకూడదా? నాకా అమ్మాయి అన్ని విధాలా నచ్చింది" అన్నాడు సాగర్. ఓ క్షణం ఆగి-

"నేనూ ఆ అమ్మాయికి నచ్చివుంటాననే అనుకుంటున్నాను. ఇంక అభ్యంతరాలెవరికి? ఈ పెళ్ళివల్ల ఎన్నో లాభాలు వున్నాయి"

"ఓహో! మీరు లాభ నష్టాలు కూడా బేరీజు వేస్తారన్నమాట... శభాష్! ఈ తరం యువతకు ఆదర్శప్రాయులు. ఎంత కట్నం ముట్టజెబుతానన్నారేం మీ మావగారు?" వ్యంగ్యంగా అడుగుతున్న సంధ్య వైపు చూసి కొంటెగా అన్నాడు సాగర్-

"మావగారిని ఇంతవరకూ ఏం అడగలేదు. అమ్మాయితోనే ఇంకా మాటలు పూర్తి కాలేదు. ఇంకా ప్రేమ ఘట్టమే పూర్తి కాలేదు. అది పూర్తయిన తర్వాత పెళ్ళి మాటలు. అంతవరకూ లవర్స్ బీచ్ దర్శన మాత్రాన మనసు నింపుకోవాలి" అంటున్న సాగర్ వైపు పరీక్షగా చూసిన సంధ్యకు అనుమానం కలిగింది.

"ఏవిటి మీరనేది?"

"ఇంకా అర్థం కాలేదా సంధ్యా? నా మనసున నిలిచిన అనురాగరాశివి నువ్వే! నువ్వు అవునంటేనందనం మన జీవితాలు. కాదంటే - వూహూ... నేను వూహించలేకున్నాను. నిన్నే నా జీవిత భాగస్వామిని చేసుకోవాలనే కోరిక రోజు రోజుకూ పెరిగిపోతోంది. అందుకే ఈరోజు ఎలాగైనా నా మనసు చెప్పాలనుకున్నాను. నీ మనసేవిటో తెలుసుకోవాలనుకున్నాను. అందుకే ఇందాకటి నుంచీ మరో కథ చెబుతూ నీ ఆవేశాన్ని, నీ అంతరంగంలో చెలరేగే ఘర్షణనూ గమనిస్తున్నాను. నువ్వు నేకోరుకున్నంతగా రియాక్ట్ అయ్యావు. మరో అమ్మాయిని నా లవర్‌గా వూహించడం నీకెంత బాధగా వుందో ఇప్పుడే అర్థమైంది. దానితో నీ మనసూ అర్థమైంది. అంతేనా? నా వూహ అక్షరాలా నిజమే కదూ సంధ్యా? నీ మనసు కోరుకునే మనిషి ఎవరో నీనోటితో వినాలనివుంది... చెప్పవూ?" అంటూ సంధ్య చేయి తన చేతుల్లోకి తీసుకున్న సాగర్ మాటలతో సంధ్యకు ఆనందంతో నోట మాట పెగల్లేదు.

చిన్నగా నవ్వుతూ సాగర్‌వైపే తదేకంగా చూస్తున్న సంధ్యకు దగ్గరగా జరుగుతూ- "చెప్పు సంధ్యా! నీ మనసుకు నచ్చిన మనిషెవరో చెప్పవూ?"

నెమ్మదిగా లేచి నుంచున్న సంధ్య సముద్రానికి దగ్గరగా నడవడంచూసి, తనూ అనుసరించాడు.




"నీ సమాధానం వినాలి సంధ్యా"

"అదిగో.... ఎదురుగా కన్పిస్తుంటే నన్ను దుగుతారేం సాగర్" అంటూ కిలకిలా నవ్వుతున్న సంధ్య నవ్వుతో శృతికలుపుతూ అతితెలివిగా ఆమె చెప్పిన సమాధానానికి తృప్తిపడుతూ—

"సంధ్యా! నీకు తెలీని కథ వుంది. మన జీవితాల్ని గురించి కథ తెలిసినా, అసలు వాస్తవాలన్నీ నీకు తెలిసే అవకాశాలు లేవు. ఈరోజు నీకా కథ చెబుతాను.... ఇలారా" అని తమ జీవితాల్లో జరిగిన సంఘటనలన్నీ ఒక్కొక్కటే వివరించాడు సాగర్. మాలతీ ఆంటీ ప్రేమ కథ కూడా వదిలిపెట్టలేదు. తనకు తమ కోసం ఆమె చేసిన త్యాగాన్ని వివరిస్తుంటే సంధ్య కళ్లు సజలాలయ్యాయి. మనసువిప్పి సాగర్ చెప్పిన విషయాలన్నీ విన్న సంధ్యకు సాగర్ తనకు బావేనన్న నిజం ఎంతో ఆనందాన్ని కలిగించింది. తన కోరిక నెరవేరడానికింక ఏ అడ్డూ లేదని తృప్తిపడింది.

వారంరోజులు సన్నిహితంగా గడిచిపోయాయి.

అనుకోకుండా ఓరోజు క్లబ్‌నుంచి త్వరగా తిరిగివచ్చిన సురేంద్ర రాగానే అడిగాడు— "సంధ్య ఏదమ్మా?" అని మాలతిని.

"పిక్చర్‌కెళ్ళిందన్నయ్యా" అంది మాలతి.

"ఒంటరిగానా?"

"సాగర్‌తో కలిసి వెళ్ళింది" భయంగా జవాబిచ్చింది మాలతి.

"ఊ! ఈమధ్య సంధ్యకు నువ్వు పూర్తిగా స్వేచ్ఛ ఇచ్చినట్లున్నావు. అందుకే ఎప్పుడు చూసినా సినిమాలూ, షికార్లూ అంటూ తిరుగుతోంది. ఈ వరస నాకేం నచ్చలేదు. సంధ్య రాగానే నాకో సారి కనిపించమనిచెప్పు" అంటూ తన గదివైపు వెళుతున్న సురేంద్రని చూస్తూ ఓ నిట్టూర్పు విడిచింది మాలతి.

సంధ్య రాగానే ఏమంటాడో అన్నయ్య? ఆ పిల్లకి పౌరుషం ఎక్కువ. ఏం సమాధానం చెబుతుందో? దానికి అన్నయ్య రియాక్షన్ ఎలా వుంటుందో? మంచి మూడ్‌లో వుండి అన్నయ్య సంధ్యా, సాగర్‌లను ఆశీర్వదిస్తే సమస్య లేదు. అందుకు విరుద్ధంగా జరిగిందా... వాళ్ళిద్దర్నీ ప్రోత్సహించి నిరాశపరిచిన పాపం తనకు చుట్టుకుంటుంది.

ఆలోచనలతోనే వంట పూర్తిచేసింది మాలతి.

మార్గరెట్ విల్సన్ తనకు చెప్పకుండా మారేజ్ చేసుకుని వచ్చిన దగ్గర్నుంచీ చాలా మారిపోయింది. సంధ్యమీద ప్రేమ మరింత పెంచుకుంది. ఎలాగైనా ఇండియాలోనే వుండిపోవాలని తాపత్రయపడ్తు తోంది. "పాపం! వుండనీ మాలతీ...ఇక మనసు మార్చుకోదనుకుంటాను. మనిషిలో చాలా మార్పు వచ్చింది. ఆ మార్పే మనం కోరుకున్నది. పిల్లల్ని చూసుకుంటూ వాళ్ళ దగ్గరే వుండాలని వున్నట్లుంది" అన్నాడు సురేంద్ర.

మునుపటిలాగాక మార్గరెట్ తనతో ప్రేమగా మాట్లాడుతోంది. తెలుగు నేర్చుకుని మాట్లాడటానికి విశ్వ ప్రయత్నం చేస్తోంది. "సాగర్ సంధ్యల జంట ముచ్చటగా వున్నదికదూ!" అన్నది నిన్న. అంటే ఈ విషయంలో మార్గరెట్ కూడా సంధ్య పక్షమే వహిస్తుంది. ఇంక అన్నయ్య అంగీకరించక ఏం చేస్తాడు!

కానీ సాగర్ ఒక్క విషయంలో చాలా పట్టుదలగా వున్నాడు— "మావయ్య

వచ్చి నాన్నగారిని అడగాలి ప్లీజ్. అప్పుడే ఈ పెళ్ళి సాధ్యమవుతుంది. ఆయన స్వయంగా వెళ్ళి నాన్నగారిని అడిగి ఆయన అంగీకారం తీసుకోవాలి. అంతవరకూ నా సమ్మతి నేను తెలియ జేయను. ఆయన్ని అవమానించినవారే వెళ్ళి అర్థించాలి. అందుకు అవసరమైన ప్రయత్నాలు నేను చేస్తూనే వున్నాను" అంటున్నాడు సాగర్.

ఏది ఎలా జరగాలనివుందో? ఈరోజు సంధ్య తండ్రికిచ్చే సమాధానాన్ని బట్టి వుంటుంది. ఏ పరిస్థితుల్లోనూ సంధ్య సాగర్‌ను వదులుకోడానికి సిద్ధ పడదు. అది నిశ్చయం. ఎలాగోలా మళ్ళీ రెండు కుటుంబాలు ఒక్కటి కాగలిగితే ఈ జీవితంలో ఇంక తను కోరుకునేదేమీ వుండదు. మార్గరెట్ వచ్చి పలకరించ డంతో ఆలోచనలకంతరాయం కలిగింది మాలతికి.

సంధ్యా, సాగర్ సినిమానుంచి వచ్చి నట్లున్నారు. ఆలోచనల్లోపడి తనకు టైమ్ తెలియలేదు. వాళ్ళకు భోజనాలు పెట్టింది. భోంచేసి మళ్ళీ కబుర్లలోపడ్డ సంధ్యకు తండ్రి పిలిచినట్లు చెప్పింది. సంధ్య ఏమీ తొణకలేదు. ఆంటీ చెప్పిన మాటలు విని నవ్వుతూ తండ్రి గదిలోకి వెళ్ళింది. అంతక్రితమే భోంచేసి ఏదో పుస్తకం చదువుతూ పడుకొని వున్నారు సురేంద్ర.

"హల్లో డాడీ...పిలిచారట" అంటూ లోపలికి వస్తున్న సంధ్యను చూసి లేచి కూర్చుంటూ-

"అవునమ్మా! ఇలారా...కూర్చో. ఈమధ్య నువ్వు కంటికి కనిపించడమే గగనమైపోయింది. ఆర్ యూ సో బిజీ?" అంటున్న సురేంద్రవైపు నవ్వుతూచూసి, పక్కనే కూర్చుకుంటూ-

"నో డాడీ!ఇంట్లో అక్క కూడాలేదు కదూ! మరీ బోర్‌కొడితే బీచ్‌కో, షాపింగ్‌కో, పిక్చర్‌కో వెళుతున్నాను. ఏదైనా ముఖ్యమైన పని వచ్చిందా నాతో" అంది సంధ్య నవ్వుతూ. అప్పటికప్పుడు ఆలోచించి పెట్టుకున్న మాటలు సంధ్యతో చెప్పే అవకాశం అలా వచ్చినందుకు సంతోషపడుతూ-

"అవునమ్మా! చాలా ముఖ్యమైనపని. నా ఫ్రెండ్ రాఘవ తెలుసుకదూ నీకు?"

"యస్ డాడీ! రాఘవ అంకుల్ తెలియకపోవడమేమిటి? ఆయన కూతురు లత నా క్లాస్‌మేట్ కదా" అంది సంధ్య - అతని ప్రసక్తి ఎందుకా అని ఆశ్చర్య పోతూ.

"అదేనమ్మా...ఆ రాఘవ తమ్ముడి కొడుకు రాజా ఐ.ఎ.యస్.చేసి మొన్ననే జాబ్‌లో జాయిన్ అయ్యాడట. పది లక్షల ఆస్తికి ఒక్కడే వారసుడు. చక్కని అమ్మాయి కావాలని చూస్తు న్నారట. రాఘవ నీ పేరు సజెస్ట్ చేశాడట. చాలా మంచి ఆపర్చ్యునిటీ. మనం అనుకోకుండా కలిసివచ్చింది. అదృష్టదేవత అందర్నీ వరించదమ్మా! అది నీలాంటివాళ్ళనే వరిస్తుంది" అంటున్న సురేంద్ర మాటలకు సంధ్య మొఖంలో రంగులు మారాయి.

"అందుకే వచ్చేవారం నిన్ను చూసు కోడానికి వస్తామంటే రమ్మని చెప్పాను. నీకు ఎలాంటి అభ్యంతరం వుండదనే అనుకుంటున్నాను. రాజా విద్యావంతుడు, బుద్ధిమంతుడూ.ఒక్క ఆడపిల్ల కోరుకునే అన్ని అర్హతలు అతనికి వున్నాయి...." ఇంకా ఏదో చెప్పబోతున్న సురేంద్రను మధ్యలోనే ఆపింది సంధ్య.




"సారీ డాడీ! నేను సాగర్‌ను పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకున్నాను" దృఢంగా పలుకుతున్న సంధ్య మాటలతో ఒక్కసారిగా తల తిరిగిపోయింది సురేంద్రకు.

"సంధ్యా ... మతి వుండే మాట్లాడు తున్నావా? సాగర్‌ను పెళ్ళి చేసుకోవాలనుకున్నావా?"

"అవును డాడీ! అనుకోవడమే కాదు- ఇంక ఇప్పుడు అతన్ని తప్ప మరొకర్ని పెళ్ళిచేసుకోలేని పరిస్థితుల్లో వున్నాను. మీరు... మీరు సాధ్యమైనంత త్వరగా వాళ్ళ వూరు వెళ్ళి వాళ్ళ నాన్నగారితో మాట్లాడి రావాలి. ఇంక ఇప్పుడు మరో ఆలోచనకు అవకాశం లేదు" అంది తల వంచుకొని.

"ఏం... అంత దూరం పోగలిగిన వాళ్ళకు ఇంకా పెద్దవాళ్ళ పర్మిషన్ ఏం అవసరం? ఆ పెళ్ళి కూడా కానిచ్చేస్తే పోయేదిగా"

"అందుకు సాగర్ ఒప్పుకోలేదు నాన్నా! వాళ్ళ నాన్నగారి అంగీకారం లేకుండా నన్ను పెళ్ళిచేసుకోలేనన్నాడు. అతనికి తండ్రి మీద వున్న గౌరవం అలాంటిది. ఆయన సమ్మతిలేకుండా ఏదీ జరగటానికి వీల్లేదన్నాడు"

"ఓహో... అతనికి పితృభక్తి అధికం అని చెప్పి అతని గొప్పదనాన్ని చాటే నీకు, తండ్రి పట్ల వీసమెత్తు బాధ్యత వుందనిపించలేదు కదూ! దీనికంతటికీ నేను ఇచ్చిన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కారణం కదూ? నీ మీద ఎన్ని ఆశలు పెట్టుకున్నాను సంధ్యా? నువ్విలా ప్రవర్తించగలవని వూహించలేకపోయిన నేనెంతటి మూర్ఖుడిని" బాధగా కణతలు రుద్దుకుంటూ- "సరే...అన్నీ మీరే నిర్ణయించుకున్నారు. ఇంకా నాదేం వుంది? కానీ ఒక్క సందేహం- ఒకవేళ వాళ్ళ నాన్న మీ పెళ్ళికి ఒప్పుకోకపోతే ఏం చేస్తారు?" సురేంద్ర గొంతులో ఆవేదన ధ్వనించింది.

సంధ్యకు ఎలాగో అనిపించింది. తండ్రి త్వరగా లొంగిరావాలంటే తను అలాగే చెప్పాలి. తనూ, సాగర్ హద్దులు మీరారని తెలిస్తే గత్యంతరం లేక వెంటనే పెళ్ళి ఏర్పాట్లు చేస్తాడు. ఊరికే మేం ప్రేమించుకున్నాం అంటే తన అంతస్తుకు తగదని ఏవేవో కబుర్లు చెప్పవచ్చు. ముందు ఆయన్ని జగన్నాథ్ అంకుల్ దగ్గరకు పంపాలి. ఇద్దరూ ఒకర్ని ఒకరు చూసుకుంటే మనసులో వున్న సందేహాలన్నీ తీరతాయి.

తండ్రి మాటకు జవాబుగా చిన్నగా నవ్వింది సంధ్య.

"ఆయన తప్పకుండా ఒప్పుకుంటారు నాన్నా! నాకా నమ్మకం వుంది. సాగర్ ఇష్టాన్ని ఆయన కాదనరు. ఏదియేమైనా సాగర్ మీద నాకు పూర్తి విశ్వాసముంది. అతను తండ్రి అభిప్రాయానికి గౌరవమిస్తాడన్నంత మాత్రాన అతని వ్యక్తిత్వాన్ని శంకించాల్సిన పనిలేదు డాడీ" నిర్భయంగా, నిశ్చింతగా చెబుతున్న సంధ్య వైపు విచిత్రంగా చూశాడు సురేంద్ర. తన కళ్ళముందు పెరిగిన ఈ సంధ్య ఎంతగా ఎదిగింది? తన నిర్ణయాలు తను చేసుకోవడంలో ఎంత నిర్భయం?

తనవైపే తదేకంగా చూస్తున్న తండ్రి వైపు చూసి సన్నగా నవ్వుతూ లేచి నుంచున్న సంధ్య-

"ఇంక నిద్రొస్తోంది డాడీ! వెళ్లనా?" అంది గారాబంగా ఎప్పటిలా.

"ఓకే! వెళ్ళు...వెళ్లమ్మా! నేను రేపు సాగర్‌తో మాట్లాడతాను" అంటున్న తండ్రి వైపు కృతజ్ఞతగా చూస్తూ-

"గుడ్ నైట్ డాడీ! థాంక్యూ" అంటూ నిష్క్రమించింది సంధ్య.

ఆ మర్నాడే సాగర్‌ను పిలిచి అతని వివరాలు అడిగాడు సురేంద్ర. సంధ్యను పెళ్ళిచేసుకోడానికి తనకు అభ్యంతరాలేవీ లేవని, కానీ తన తండ్రిని ఒక్కసారి అడిగితే ఆయన సంతోషపడతారనీ వినయంగా చెబుతున్న సాగర్ మీద అభిమానం పొంగింది. తన కూతురు కేర్‌లెస్‌గా మాట్లాడింది. నువ్వు వెళ్ళి సాగర్ నాన్నగారిని అడగాలని డిమాండ్ చేసినట్లు చెప్పింది. అదే విషయాన్ని ఇతనెంత నమ్రతగా చెప్పాడు. చిన్నగా నవ్వుకున్నాడు సురేంద్ర. తన కూతురు కనక తనమీద వున్న చనువుతో ఆర్డర్ వేసింది. కాబోయే మావగారు కనుక సాగర్ వినయంగా చెప్పాడు. అదే తేడా! సాగర్ చెబుతున్న వివరాలు వింటుంటే ఒక్కసారి జగన్నాథ్ జ్ఞాపకమొచ్చాడు.

ఎప్పటి జగన్నాథ్? తను తొందరపడి అతన్ని అవమానించకుండా వుంటే ఈనాటికి తను మరొకర్ని అర్థించవలసిన అగత్యం రాకపోయేది. ఎక్కడ వున్నారో? ఎలా వున్నారో? తన తండ్రి పేరు చెప్పగానే ఆలోచనల్లో మునిగి పోయిన సురేంద్ర వైపు పరీక్షగా చూస్తూ-

"అంకుల్! మా నాన్నగారికి స్కూల్ మాష్టారుగా ఆ ఊళ్ళో మంచి పేరుంది" అంటూ తండ్రిని గురించి మరికొన్ని వివరాలు చెప్పాడు సాగర్. సాగర్ తండ్రిని గురించి వింటున్నకొద్దీ జగన్నాథ్ జ్ఞాపకాలు, ఆ వెంటనే పార్వతి, జరిగిపోయిన సంఘటనలు ఒక్కొక్కటే స్మృతిపథాన మెరిశాయి సురేంద్రకు.

మరో వారం రోజులు గడిచాయి ప్రశాంతంగా. సురేంద్ర బాగా ఆలోచించి సాగర్ తండ్రిని కలిసి మాట్లాడి రావడానికే నిశ్చయించుకున్నాడు. మరో నాలుగు రోజులకు రాకేష్, సుభా తిరిగి వచ్చారు. విల్సన్, లక్ష్మి మరికొన్ని రోజులపాటూ ఊటీలో గడిపి తిరిగివస్తామన్నారట. సుభ ఆరోగ్యం అంత బాగుండలేదని తామిద్దరూ తిరిగి వచ్చినట్లు చెప్పాడు రాకేష్.

సుభ గర్భిణితో వుందని తెలిసి అందరూ ఆనందపడ్డారు.

రాకేష్ రాగానే ఆఫీసు రాకేష్‌కు అప్పజెప్పి తను సాగర్ తండ్రిని కలిసి మాట్లాడి వస్తానని బయలుదేరాడు సురేంద్ర. మొదట రాకేష్‌ను తనతో తీసుకెళదామనుకున్నా సురేంద్ర తనొక్కడే వెళ్ళి రావాలని నిశ్చయించుకున్నాడు. బొంబాయిలో రెండు పెద్ద పెద్ద ఫాక్టరీలకు అధిపతి కొన్ని లక్షల రూపాయల ఆస్తి, అంతస్థూ వున్న తన కూతురిని కోడలిగా చేస్తానంటే వద్దనే మందభాగ్యుడెవరుంటారు? ఆ మాష్టారు తన ప్రపోజల్ వినగానే ఎగిరి గంతు వేయడూ? చిన్నగా మీసం సరి చేసుకుంటూ తనలో తానే నవ్వుకున్నాడు సురేంద్ర. నిజానికి సాగర్ తనకన్ని విధాలా నచ్చాడు. అతనిలో తను కోరుకునే లక్షణాలన్నీ వున్నాయి. కాకపోతే ఆస్తి అంతస్థులు కొరవడినా అల్లుడు కావడంతో అవలీలగా అవి అతన్ని వరిస్తాయి. ఇంక తన కూతురి కోరిక తీర్చడంకన్నా తను కోరుకునే

దేముంది? ఏమూలో పార్వతి కోరిక మెదలినా ఎక్కడున్నాడో తెలీని జగన్‌ను ఎలా కలుసుకోగలడు? అతని కొడుకులకింకా పెళ్ళి అయివుండదని గ్యారంటీ ఏమిటి? ఇంతకీ వాళ్ళను కలిసే యోగం లేకపోయింది. బాధగా నిట్టూర్చిన సురేంద్ర సాగర్ తండ్రితో మాట్లాడవలసిన మాటలు నెమరువేసుకుంటూ బెర్త్ మీద విశ్రాంతిగా పడుకున్నాడు. సాగర్ స్టేషన్‌కు వచ్చి, తనను జాగ్రత్తగా రైలెక్కించి తమ ఊరికి ఎలా వెళ్ళాలో, అక్కడ తమ ఇంటిని కనుక్కోవడం ఎంత తేలికో అన్నీ వివరంగా చెప్పాడు సురేంద్రకు.



ఊళ్ళో అడుగుపెట్టిన సురేంద్ర ఎయిర్‌బాగ్ చేతిమీద వేసుకొని నడక సాగించాడు. బాగా పల్లెటూరిలా వుంది. బజార్లో కనిపించినవాళ్ళంతా తనవైపు వింతగా చూస్తున్నారు. ఆజానుబాహువూ, స్ఫురద్రూపి అయిన సురేంద్ర సూట్‌లో మరింత అందంగా, హుందాగా కన్పిస్తుంటే ఎవరీ కొత్తమనిషి? అని అంతా అతని వైపే చూస్తున్నారు. రచ్చబండలా వున్న మూడు రోడ్ల కూడలిలోని చెట్టుకింద నలుగురు మనుషులు కూర్చొని లోకాభిరామాయణం మాట్లాడుకుంటుంటే వాళ్ళ దగ్గరకెళ్ళి అడిగాడు సురేంద్ర.

"జగన్నాథరావు మాష్టారి ఇల్లెక్కడో చెప్పగలరా?"

అతనివైపే పరీక్షగా ఆశ్చర్యంగా చూస్తున్న ఓ వృద్ధుడు లేచి దారినే వెళుతున్న పదేళ్ళ కుర్రాడిని కేకవేసి –

"ఒరే రామూ! ఈ బాబుగార్ని జగన్నాథం మాష్టారింటికి తీసుకెళ్ళరా" అని చెప్పి–

"వాడు తీసుకెళతాడు..వెళ్ళండిబాబూ" అంటూ సురేంద్రకు చెప్పాడు.

సురేంద్ర కుర్రాడిని అనుసరించాడు.

సురేంద్ర అటు వెళ్ళగానే 'అతనెవరై వుంటాడు? తమకు తెలిసి మాష్టారికి బంధువులెవరూ లేరే" అని ఆలోచనలో పడ్డారు అక్కడ కూర్చున్న వాళ్ళంతా. తలా ఓ రకంగా ఊహాగానాలు మొదలు పెట్టారు.

ఎదురుగా వున్న ఓ పెంకుటిల్లు చూపించి "అదే ఇల్లు" అని చెప్పి, "రాధక్కా! మీ ఇంటికి చుట్టాలొచ్చారు" అంటూ లోపలికి పరుగెట్టాడు ఆ కుర్రాడు.

వాకిట్లో నుంచుని అందమైన పూల చెట్లతో పరిశుభ్రంగా వున్న పరిసరాలను పరికిస్తున్న సురేంద్ర–

"ఎవరు కావాలండీ!" అంటూ నమ్రతగా అడుగుతున్న అమ్మాయి వైపు తిరిగి చూస్తూనే అలాగే చూస్తుండిపోయాడు.

ఎవరీ అమ్మాయి? అచ్చు అచ్చు తమ పార్వతిలా కనిపిస్తున్న ఈ అందాల అపరంజి బొమ్మ ఎవరు? తనడిగిన ప్రశ్నకు ఏబదులూ చెప్పకుండా గుడ్లప్పగించి చూస్తున్న ఆ అపరిచిత వ్యక్తివైపు ఆశ్చర్యంగా చూస్తూ–"మిమ్మల్నేనండీ...ఎవరు కావాలి మీకు? నాన్నగారికోసం వచ్చారా?" అనడంతో పులిక్కపడి ఈ లోకంలోకి వచ్చాడు.

"ఈ ఇల్లు జగన్నాథరావుగారిదే నామ్మా?" అన్నాడు సురేంద్ర తడబడుతూ.

"అవునండీ! ఆయన మా నాన్నగారే. నాన్నగారి కోసం వచ్చారా? ఇప్పుడే వచ్చేస్తారు" అంటూ లోపలికి దారితీసింది రాధ. ఎవరై వుంటారీయన? అన్నయ్య 'తొందరలో మావయ్యను అక్కడికి పంపిస్తాను. నాన్నగారినీ, ఆయన్నీ జాగ్రత్తగా చూసుకునే బాధ్యత నీదే. ఇన్నేళ్ళ తర్వాత కలుసుకునే బావా మరుదుల రియాక్షన్స్ ఎలా పరిణమిస్తాయో చెప్పలేం. ఒకవేళ ఏదైనా ఆవేశాలకు లోనైనా వాళ్ళనుమళ్ళీ మూడ్సుకుతీసుకురావలసిన బాధ్యత నీదే రాధా!' అంటూ రాసిన దగ్గర నుంచీ మావయ్య ఏ క్షణంలో వస్తారో అని ఎదురు చూస్తూనే వుంది. కొంపదీసి ఈ సూటూ బూటూ వేసుకొని వచ్చిన పెద్దమనిషి మావయ్య కాదు కదా!

ఈయనను చూస్తే తమ తండ్రి కంటే చిన్నవాడిలా కనిపిస్తున్నాడు. తండ్రి వయసుకు మించిన వృద్ధాప్యాన్ని కొనితెచ్చుకున్నారు - బాధ్యతల బరువుతో. మావయ్య ఆయనకంటే చిన్నవాడుగా కనిపించినా ఆశ్చర్యమేముంది? ఆయన్ని ముందు గదిలో కుర్చీలో కూర్చోబెట్టిన రాధ గబగబా వంటగదిలోకెళ్ళి అప్పుడే కలిపి వుంచిన కాఫీ



కప్పులో పోసి పట్టుకొచ్చింది. ఇంటిని పరీక్షగా చూస్తున్న సురేంద్ర "కాఫీ తీసుకోండి" అంటున్న రాధ మాటలతో చిన్నగా నవ్వుతూ కప్పు అందుకొని–

"నీ పేరేమిటమ్మా?" అన్నారు.

"రాధిక...మీ పేరేమిటండీ?" అని అడుగుతున్న ఆ అమ్మాయి కళ్ళలో కుతూహలాన్ని గమనించి పెద్దగా నవ్వి.

"నా పేరా? సురేంద్రమ్మా! సాగర్ మా ఫాక్టరీలోనే జాబ్ చేస్తున్నాడు" అనడంతో అంతక్రితం వున్న కొద్దిపాటి సందేహం కూడా తీరిపోయింది రాధికలో.

"ఓ..మీరా?నమస్కారం మావయ్యా. సాగరన్నయ్య అన్ని విషయాలూ రాశాడు" అంటున్న రాధ వైపు నవ్వుతూ చూసి–

"అయితే నా పని మరీ తేలికైందన్న మాట! మాష్టారిని నేనేం అడగాల్సిన పని లేదన్న మాట" అన్నాడు.

"వూహూ! మీ పని మీకలాగే వుంది. అన్నయ్య అన్ని విషయాలూ నాకు

రాశాడు మావయ్యా. నాన్నగారికేం తెలీదు. అన్నీ మీరే చెప్పాలి" అంటూ చనువుగా తనతో మాట్లాడుతున్న రాధను చూస్తుంటే చిన్నప్పటి పార్వతి పదే పదే గుర్తొస్తోంది.

"ఎవరితోనమ్మా మాట్లాడుతున్నావు?" అంటూ పంచెకట్టుతో ఛాతీ మీద తెల్లటి తుండుతో తుడుచుకుంటూ వచ్చిన నడివయసు వ్యక్తిని చూస్తూనే ఒక్కసారిగా చేతిలో కప్పు జారిపడింది. సురేంద్రను చూస్తూనే జగన్నాథ్ ముఖంలో అనేక భావతరంగాలు కదలాడాయి. నిశ్చలంగా నిలబడి ఒకరివైపు ఒకరు చూస్తూ నుంచున్న ఇద్దరివైపూ ఆశ్చర్యంగా నిలబడి చూస్తోంది. ఇద్దరి కళ్ళలోనూ నీళ్లు తిరగటం చూసిన రాధ కళ్లు కూడా సజలాలయ్యాయి.

మరుక్షణం "జగన్... ఎన్నాళ్ళకు కనిపించావు" అంటూ ముందుకు వురికిన సురేంద్రను రెండు చేతులతో చుట్టేశారు జగన్నాథరావుగారు. ఎన్నో సంవత్సరాల తర్వాత కలుసుకున్న ఆప్త మిత్రులిద్దరిలో వువ్వెత్తున లేచే భావతరంగాల్లో ఎన్నో ప్రశ్నలూ, మరెన్నో జవాబులూ, క్షమార్పణలూ పొంగిపొర్లుతున్నాయి. వాటిని బయటకు చెప్పే భాష ఇద్దరికీ రావడంలేదు. మూగగా ఒకరినొకరు చూసుకుంటూ ఆత్మీయంగా తడుముకున్నారు.

"నాన్నా!" అన్న రాధ పిలుపుకు ఈ లోకంలోకి వచ్చిన జగన్నాథరావుగారు ఆనందంగా రాధ వైపు చూస్తూ –

"అమ్మా! ఈయన ఎవరో తెలుసా మీ మావయ్యమ్మా... మీ మావయ్య. సురేన్! ఇదే నీ మేనకోడలు రాధ. చూడు ఎంత పెద్దదైందో" అంటుండగానే రాధను దగ్గరకు తీసుకొన్నాడు సురేంద్ర.

"బొంబాయిలోని అంత పెద్ద ఫాక్టరీకి మేనేజింగ్ పార్టనర్‌గా వున్న వ్యక్తిని ఇంత దూరంగా ఇలాంటి చిన్న వుద్యోగంలో చూస్తాననీ, చూడగలననీ వూహించలేకపోయానమ్మా!" అంటున్న సురేంద్ర కళ్ళవెంట నీరూరింది.

"అమ్మా... రాధా! మావయ్యకు కాఫీ కలిపి తీసుకురామ్మా!

"నువ్వు కూర్చో సురేన్... కూర్చో" అంటూ మంచంమీద సురేంద్రను కూర్చోబెట్టి తనూ పక్కనే కూర్చున్నాడు జగన్నాథం. కిందపడిన కాఫీ కప్పుతీసి అక్కడ శుభ్రంచేసింది రాధ.

"జగన్! నా మీద ఎంత కోపమైనా ఇన్నేళ్ళు కనిపించకుండా వుండి బాధించడానికి నీకు మనసెలా ఒప్పింది! కనీసం పార్వతి ఆఖరి కోరికైనా నీకు గుర్తురాలేదా? అందుకోసమైనా నువ్వు నన్ను కలవలేకపోయావంటే నీ మనసులో నా మీద కోపం ఇంకా తగ్గలేదన్నమాట. అఫ్‌కోర్స్.... నేను నీ విషయంలో తొందరపడి ఆవేశంగా మాట్లాడి నిన్ను అవమానించాను. కానీ ఆతర్వాత నేనెంత ఆవేదన అనుభవించానో నాకే తెలుసు. మిమ్మల్ని జ్ఞాపకం తెచ్చుకొని బాధపడని రోజు లేదు..."

సురేంద్ర మాటల్ని మధ్యలోనే ఆపాడు జగన్నాథం. "గతించిన విషయాల గురించి ఆలోచించి ఇప్పుడు మనసు పాడుచేసుకోడమెందుకు సురేన్! పిల్లలెలా వున్నారు? మా చెల్లాయి ఎలా వుంది. మాల ఎలావుంది? ఎక్కడుంది?" అంటూ ప్రశ్నలమీద ప్రశ్నలు వేశాడు.

"జగన్! అంతా బాగానే వున్నారు.

మన ఫాక్టరీ రెండో బ్రాంచ్‌కూడా ఓపెన్ చేశాం. పెద్దమ్మాయి సుభకు పెళ్ళైంది. మార్గరెట్ ప్రస్తుతం ఇండియా లోనే వుంది. ఇంక ఇక్కడే వుండి పోవా లని కోరికట. చిన్నమ్మాయి సంధ్య ఈ సంవత్సరమే డిగ్రీ మూడవ సంవత్సరం లోకి వచ్చింది.

ఇక మాల...దాని బతుకే అన్యాయమై పోయింది. నాకోసం నా పిల్లలకు సేవచేస్తూ, ఏకాకిగా మిగిలిపోయింది. పెళ్ళిమాట తలపెట్టలేదు. అప్పుడు నిన్ను చేసుకోమన్నపుడు సుముఖత చూపించని మాల నువ్వు పిల్లల్ని తీసుకొని వెళ్ళి పోయిన తర్వాత పూర్తిగా తన జీవితాన్ని మా కుటుంబానికి అంకితం చేసింది. తన దగ్గర పెళ్ళిప్రసక్తి ఎత్తవద్దని కట్టడి చేసింది. అంతే....అలాగే వుండిపోయింది ఈనాటివరకూ"

"కాఫీ రెడీ మావయ్యా!" అంటూ వచ్చిన రాధను చూస్తూ కాఫీ అందు కున్నారిద్దరూ.

"ఇలా కూర్చోమ్మా!" అంటూ తన పక్కన రాధకు చోటుచూపిస్తూ కాఫీ తాగటం మొదలుపెట్టిన సురేంద్ర మాటలు పొడిగించాడు.

"జగన్! ఎలాగో విడిపోయిన మనల్ని ఒక్కటిగా చేర్చాడా భగవంతుడు. ఇప్పుడు నిన్నో వరమడగటానికి వచ్చాను. ఇక్కడికి వచ్చేంతవరకూ సాగర్ నా మేనల్లుడే అయివుంటాడని వూహించలేదు. రాకేష్ ఫ్రెండ్‌గా పరిచయమై బ్రిలియంట్ కాండిడేట్‌గా అందరి ప్రశంసల్ని పొంది,ఇంటర్వ్యూలో ప్రథముడిగా నెగ్గి కొత్తగా నేను ఆరంభిం చిన ఫాక్టరీలో జాబ్ సంపాదించాడు. నేనెవరో తెలీకుండానే నా ఇంట్లో ప్రవేశించి, మా మనసుల్లోకి అవలీలగా చొచ్చుకుపోయాడు. ముఖ్యంగా మీ కోడలు సంధ్య సాగర్‌ను తప్ప మరొకర్ని పెళ్ళిచేసుకోనని పంతంపట్టి కూర్చుంది. అందుకే ఆడపిల్ల తండ్రిగా నిన్ను అర్థించడానికి వచ్చాను జగన్! సాగర్‌కు సంధ్యను చేసుకోవాలన్నది మొదటినుంచీ మనం అనుకున్నదే. మధ్యలో మనం కొంతకాలం దూరమైనా మన మనసుల్లో ఆ భావాలు మాసిపోలేదు. అందుకు నిదర్శనంగా నా అదృష్టం కలిసొచ్చి సాగర్ మాదగ్గరికి చేరాడు. నా తప్పుల్ని క్షమించి ఈ పెళ్ళికి సరేనను జగన్! నామీద కోపం ఏమాత్రం మిగిలినా అది నామీదే చూపించు. నీ ఇష్టమొచ్చిన రీతిలో నన్ను శిక్షించు. కానీ సంధ్యా సాగర్‌ల వివాహానికిమట్టుకు అడ్డు చెప్పకు" అని తన చేతులు పట్టుకున్న సురేంద్ర వైపు సంతోషంగా చూశాడు జగన్నాథం.

"ఛా... ఏమిటిది సురేన్! మనలో మనకు క్షమార్పణలేమిటి? పైగా సాగర్ సంధ్యల వివాహానికి నాకు అభ్యంతరమా? నా పార్వతి చివరికోరిక ఎలా తీరుతుంది? 'సురేన్‌ను ఎలా అడగాలి?' అని ఇన్నాళ్ళూ నేనెంత బాధపడ్డానో నీకేంతెలుసు? సాగర్ చేరిన ఫాక్టరీ కొత్తది కావడంవల్ల అది నీదై వుంటుందని వూహించలేకపోయాను. తమ ప్రొప్రైటర్ పేరు సురేంద్రని సాగర్ చెప్పినా, ఫాక్టరీ పేరుచూసి ఆ పేరుగల మరెవరో అనుకున్నాను. సాగర్‌కు నీ అడ్రస్ చెప్పాలని ఎంతో ప్రయత్నిం చాను. కానీ మళ్ళీ చెప్పలేకపోయాను. వాడిని నువ్వు అవమానిస్తావేమో, వాడి లేతమనసు బాధపడుతుందేమోనని భయ పడ్డాను సురేన్! అందుకే వాడికి నిన్ను



గురించిన వివరాలుగానీ, పాత జీవితం గురించిగానీ తెలిసీయలేదు. ఒకప్పుడు బొంబాయిలో వుండేవాళ్ళమన్న సంగతి కూడా వాళ్ళకు తెలియదు" అంటున్న జగన్ వైపు పరీక్షగా చూస్తున్న సురేంద్ర కళ్ళలో నీళ్ళూరాయి మళ్ళీ.

"ఎంతపని జరిగిందిజగన్! ఒకరిమీద ఒకరం అభిమానాలు వుంచుకొనే అందని దూరాన వుండి ఆవేదన అనుభవించాము. ఇప్పటికి సమస్యలన్నీ తీరాయి. మళ్ళీ మనమంతా ఒక్కటిగా వుండే రోజులు వచ్చాయి. అన్నట్లు సంపత్ ఎక్కడా? వాడిని గురించిన వివరాలేవీ చెప్పలేదేం?"

"సంపతన్నయ్యకు పెళ్ళైపోయింది మావయ్యా! ప్రస్తుతం హైదరాబాద్‌లో మంచి పొజిషన్‌లో వున్నాడు" అంది రాధ. ఆరోజు మావయ్య కోసం రాధ ప్రత్యేకంగా చేసిన వంటలు, ఫలహారాలు తింటూ ఎప్పటెప్పటివో కబుర్లు చెప్పుకుంటూ ఎంతో ఆనందంగా గడిపారు జగన్, సురేంద్రలిద్దరూ.

ఆరాత్రి ఆరుబయట పక్కపక్కనే మంచాలు వేసుకొని పడుకున్న ఇద్దరి మధ్యా చాపవేసుకుని మోకాళ్ళమీద కూర్చొని, కాసేపు మామయ్య మంచంమీద చేతులు ఆన్చి కూర్చుని, మరికాసేపు తండ్రి మంచంమీద చేతులు ఆన్చి కబుర్లుచెప్పింది రాధ.

"సురేన్! రాధ బాగా పాడుతుంది. పాడమ్మా .... మావయ్య వింటారు" అన్నారు జగన్నాథం.

మావయ్య కోరిక ప్రకారం ఓ పాట పాడింది రాధ. ఆ పాట వింటూనే చిన్న పిల్లవాడిలా ఏడ్చేశాడు సురేంద్ర.

ఎన్నో సంవత్సరాల క్రితం చెల్లెలి నోట విన్న ఆ పాట మళ్ళీ రాధ నోట వింటుంటే ఆ అనుభూతి ఓరకంగా ఆనందాన్ని, మరోవిధంగా ఆవేదననూ కలిగించింది. "జగన్! పార్వతి నోట ఎంతో ప్రియంగా విన్న ఈ పాట మళ్ళీ పార్వతే పాడుతున్న అనుభూతి కలుగుతోంది" అన్నాడు సురేంద్ర.

ఆ రాత్రి అందరూ కలత నిద్రే పోయారు. ఏవేవో ఆలోచనలతో గడిపేశారు. మర్నాడు సురేంద్ర జగన్‌నూ, రాధనూ ప్రయాణానికి సిద్ధం కమ్మన్నాడు.

"నేనిప్పుడు రావడానికి వీలవదు సురేన్. నాలుగు రోజులు అయిన తర్వాత సెలవులు ఇస్తారు...అప్పుడు బయలుదేరి వస్తాను. నీతో కావాలంటే రాధను తీసుకెళ్లు" అంటున్న జగన్ మాటలకు సురేంద్ర—

"జగన్! ఇంకా నువ్వు నన్ను క్షమించలేదన్నమాట. ఇంకా మళ్ళీ తిరిగి వచ్చి ఈ ఉద్యోగం చేయాలనా? ఏమిటి నీ ఉద్దేశం? అక్కడ నీకోసం వెయ్యి కళ్లతో ఎదురుచూస్తుంటారు పిల్లలూ, మాలా. నిన్ను తీసుకెళ్ళకుండా నేను వెళ్లను. మళ్ళీ ఎప్పటిలా ఆ ఫాక్టరీ మేనేజిమెంట్ చూసుకుంటూ ఉండాలి నువ్వు అక్కడే. అప్పుడే పార్వతి ఆత్మ శాంతిస్తుంది. నా మాట కాదనకు జగన్" అన్నాడు ప్రాధేయపూర్వకంగా.

"అవును నాన్నా! నువ్వు ఇక్కడికి వచ్చేస్తానంటే సాగరన్నయ్య ఊరుకోడు. మళ్ళీ అంతా కలవాలి. ఒక్కచోట ఉండాలనే ఇన్నాళ్ళూ సాగరన్నయ్య మావయ్యతో నిజం చెప్పకుండా నాటక మాడింది" అంది రాధ తండ్రి వైపు ఆవేదనగా చూస్తూ.

ఆ మధ్యాహ్నం భోజనాలు కాగానే




"నేనలా శోభా వాళ్ళింటికి వెళ్ళి వస్తాను నాన్నా! చాలారోజులైంది శోభను చూసి. రేపు మనం ఊరు వెళతాంకదా! మళ్ళీ ఎప్పుడు తిరిగి వస్తామో" అంది రాధ.

"మళ్ళీ తిరిగి వచ్చే సమస్యలేదమ్మా! ఇక్కడ సమస్యలేమైనా వుంటే తర్వాత సాగర్, రాకేష్ వచ్చి సెటిల్ చేస్తారు. మనం రేపు ఉదయమే బొంబాయి బయలు దేరుతున్నాం. నీ స్నేహితులందరికీ చెప్పిరా!" అంటున్న సురేంద్ర వైపు చూసి చిన్నగా నవ్వుతూ బయటికి వెళ్ళిపోయింది రాధ.

తను వెళ్ళేసరికి రాజారావుగారు ఇంట్లో లేకపోవడంతో తేలిగ్గా గాలి పీల్చి గబగబా నడవా దాటి శోభ గదిలో అడుగుపెట్టింది రాధ. మంచంపై పడుకొని పైకప్పుకేసి చూస్తూ ఏదో దీర్ఘాలోచనలో వున్న శోభ రాధ పిలుపుతో వులిక్కిపడి రాధను చూసి చిన్నగా నవ్వడానికి ప్రయత్నిస్తూ లేచి కూర్చుంది

"రా రాధా!చాన్నాళ్ళకు కనిపించావు. అంతా కులాసాయేనా? మామయ్యగారు బావున్నారా? మీ అన్నయ్య దగ్గర్నుంచి ఉత్తరాలొస్తున్నాయా?" ఒక్కసారిగా ప్రశ్నల వర్షం కురిపిస్తున్న శోభ వైపు చూడగానే రాధ కళ్ళనిండా నీళ్ళు తిరిగాయి.

తనకు వూహ తెలిసిన దగ్గర్నుంచీ శోభతో స్నేహం. ఈరోజు ఆ స్నేహమయిని వదిలి వెళ్ళిపోబోతోంది. ఆమాట తలచుకోగానే కన్నీరాగలేదు. తనడిగిన వాటికి సమాధానం చెప్పకుండా కన్నీరు కారుస్తున్న రాధను చూసి మరింత గాభరాపడింది శోభ.

"ఏమైంది రాధీ? ఎందుకేడుస్తున్నావ్? అంతా కులాసాయే కదూ! నాకేదో భయంగా వుంది... చెప్పు రాధీ'' అని తన రెండు భుజాలూ పట్టుకొని కుదుపుతూ కలవరపడుతున్న శోభ భుజం మీద తల వాల్చిన రాధ శోభకు జరిగినదంతా వివరించింది.

తన మేనమామ వచ్చిన విషయం, తనూ, తండ్రీ శాశ్వతంగా ఆ వూరొదిలి వెళ్ళిపోతున్న విషయం అన్నీ వివరంగా చెప్పింది. తమ రెండు కుటుంబాల్ని మళ్ళీ ఏకం చేయాలనే పట్టుదలతో సాగర్ తీసుకున్న నిర్ణయం వల్ల శోభ జీవితంలో ఎలాంటి చెడు పరిణామాలూ రాకూడదనీ, ఏ విపరీత పరిస్థితుల్లోనూ తమ స్నేహానికి ఆటంకం రాకూడదనీ పదే పదే ప్రాధేయపడింది.

అన్నీ విన్న శోభ కళ్ళలో నీళ్ళూరాయి. అయినా నవ్వుతూ తన కన్నీరు తుడుచుకుంటూ–

"చాలా సంతోషం రాధా! మళ్ళీ మీరంతా ఒక్కటి కాగలిగారు. మీకు మంచి రోజులు వస్తున్నాయంటే అంతకంటే సంతోషించదగ్గ విషయం మరేముంది?

"మీ అన్నయ్య నిర్ణయం నాకు బాధ కలిగించినంత మాత్రాన అదే తలుచుకుంటూ జీవితాన్ని వ్యర్థంచేసుకోడం అవివేకమని అర్థంచేసుకున్నాను. మన మీద ఎన్నో ఆశలు పెంచుకున్న మన తల్లిదండ్రుల పట్ల మనకు కొన్ని బాధ్యతలు వుంటాయి కదా! కేవలం మన బాధ ఒక్కటే ఆలోచిస్తే వారిని గురించి మరిచిపోయి అందర్నీ బాధపెట్టే అవివేకమైన నిర్ణయాలు తీసుకొనే ప్రమాదముంది. అందుకే నేను బాగా ఆలోచించి మా నాన్నగారు నిర్ణయించిన

సంబంధం ఒప్పుకున్నాను. అతను హైదరాబాద్‌లో ఇంజనీర్‌గా పనిచేస్తున్నారట. తొందరలో ముహూర్తాలు పెట్టుకోవాలనే నాన్న ఈ రోజు హైదరాబాద్ వెళ్ళారు'' అంటున్న శోభ రెండు చేతులూ పట్టుకొని ఊపింది రాధ.

"అయితే త్వరలో మాకు పప్పన్నం పెడతావన్న మాట. నీ పెళ్ళికి మమ్మల్ని పిలవడం మరిచేవు సుమా! బొంబాయి అడ్రస్ ఇచ్చివెడతాను తప్పకుండా శుభలేఖ పంపుతావు కదూ!" అంటున్న రాధవైపు చూసి చిన్నగా నవ్వుతూ-

"నీకాభయం అక్ఖర్లేదు. నేను మర్చిపోయినా నాన్న మర్చిపోరులే... మీకు శుభలేఖ పంపడం" అంది నవ్వుతూ.

"శోభా! రేపే మా ప్రయాణం. మరి నే వెళ్ళిరానా? అత్తయ్య ఎక్కడా? తను కూడా వెళ్ళిందా హైదరాబాద్" అంటున్న రాధ మాటలకు బదులుగా అప్పుడే లోపలికివచ్చిన తల్లిని చూపించింది శోభ.

మరోసారి తమ ప్రయాణం విషయం, వివరాలన్నీ శోభ తల్లితో కూడా చెప్పి, పెళ్ళికి తప్పక వస్తామని శోభకు మాటిచ్చి తిరిగి తమ ఇంటికి బయలుదేరింది రాధ.

బొంబాయి స్టేషన్‌లో బండి ఆగగానే ఆతృతగా తమ ముందుకు పరుగెత్తుకు వస్తున్న రెండు జంటల్ని, వాళ్ళ వెనకే కళ్ళనిండా నీళ్ళతో నిలబడివున్న మాలతిని చూశాడు జగన్నాథ్.

"అరే...అంతా వచ్చారే స్టేషన్‌కు. రాధా...నువ్వు దిగమ్మా! ఆ సామాన్ల విషయం మీ అన్నయ్యలు చూసుకుంటార్లే" అంటూ దిగుతున్న సురేంద్ర రాధ చేయి పట్టుకొని కిందకు దింపారు.

ఎదురుగా నిలబడివున్న ఇద్దరమ్మాయిల్నీ పరీక్షగా చూస్తోంది రాధ.

అంతలో వెనక నుంచున్న మాలతి మీదకు దృష్టి మళ్లింది రాధకు. గబగబా అడుగులు ముందుకు వేసింది. కళ్ళు మసకలు బారుతుంటే నవ్వడానికి విశ్వ ప్రయత్నం చేస్తూ-

"రామ్మా... రాధా!" అంటూ చేయి సాచిన మాలతి భుజం మీద ఒరిగిన రాధ కళ్ళనుంచీ రెండు కన్నీటిబొట్లు జారాయి. ఎన్నాళ్ళుగానో దూరమైన ఓ దివ్యానుభూతికి లోనై అనుకోకుండా అప్రయత్నంగా "అమ్మా!" అన్న రాధ పిలుపుతో మాలతి ఒళ్ళంతా పులకరించి నట్టైంది.

ఎదురుగా నిలుచున్న జగన్ వైపు చూసిన మాల కళ్ళలో నీళ్ళు. ఆత్మీయంగా దగ్గరకు చేరిన రాధను అక్కున చేర్చుకున్న మాలను చూసిన జగన్నాథ్ కళ్ళలో నీళ్ళు. ఆ ఆప్యాయతా, అనుభూతీ వాళ్లకు లేకుండా, దూరంగా వాళ్లను తీసుకెళ్లినందుకు మొట్టమొదటిసారిగా తనని తాను తిట్టుకున్నాడు.

మూగగా చూస్తూ ముఖంలో ఎన్నో భావాలు ప్రతిఫలిస్తుండగా తనవైపు తదేకంగా చూస్తూ కళ్లు ఓ వైపున వర్షిస్తుంటే చిరునవ్వు పెదాల మీదకు తెచ్చుకుంటూ, అదురుతున్న అధరాలను కదిలించి ఏదో మాట్లాడాలని విశ్వప్రయత్నం చేస్తున్న మాలతికి భావావేశంతో మాటలు పొరకడంలేదు. ఆమె పరిస్థితిని గమనించిన జగన్నాథ్ జీవితంలో మొట్టమొదటిసారిగా మాలతి భుజంమీద చేయి వేసి ఆప్యాయంగా పలకరించాడు. "బాగున్నావా మాలా!" ఎన్నాళ్ళకో వినిపించిన ఆ ప్రియమైన కంఠస్వరం మాలతిలో అణిగివున్న అనురాగాన్ని తట్టిలేపింది. మౌనంగా తలవూపిన మాలతిలో ఎన్నో




ప్రశ్నలు వువ్వెత్తునలేచాయి.

"ఊ...పదండి! ఇంటికెళ్లి తీరిగ్గా మాట్లాడుకోవచ్చు" అంటూ ముందుకు నడిచిన సురేంద్రను అనుసరించారు అందరూ.

కార్లో సంధ్యా, సుభలతో కబుర్లలో పడ్డ జగన్నాథ్‌ను చూసి తృప్తిగా నవ్వుకున్న మాలతి, రాధ తన పక్కనే చేరి అడుగుతున్న ప్రశ్నలకు ఓపిగ్గా సమాధానాలు చెప్తూంది.

"అంకుల్...ఇది అన్యాయం. మీరు రాగానే ఈ ఆడవాళ్ళంతా మమ్మల్ని పూర్తిగా వెలివేశారు. కనీసం మా వైపు కన్నెత్తి చూడటం లేదు" అంటున్న రాకేష్ మాటలకు అంతా నవ్వేశారు.

సరదాగా, సంతోషంగా అలా అంతా వెళుతుంటే మళ్ళీ వెనకటిరోజులు ఒక్కసారిగా కళ్లముందు కదలాడాయి.

ఆ మధ్యాహ్నం భోజనాల దగ్గర అందరికీ వడ్డిస్తున్న మాలతి వైపు ప్రేమగా చూస్తూ కూర్చున్న సాగర్ ఒక్కసారిగా తను లేచి మాలతి చేయి పట్టుకొని కూర్చోబెడుతూ అన్నాడు - "అమ్మా! ఇంక నువ్వు శ్రమపడటమేమిటి? ఇంక మీరు పూర్తిగా విశ్రాంతి తీసుకోవాల్సిన సమయం. ఇక మిమ్మల్ని కూర్చోబెట్టి సుఖపెట్టాల్సిన బాధ్యత మాది" అన్నాడు.

ఓ కంట కన్నీరు, మరో కంట ఆనంద బాష్పాలూ రాలుతుంటే ఆనందంగా చూసింది మాల.

"అన్నయా! వాట్ దే ఆర్ గోయింగ్ టూ డూ, గెటింగ్ రెడీ ఫర్ ఎ ఫైట్" అంటూ జగన్ వైపుచూసి నవ్విన మార్గరెట్ మాటలకు మళ్ళీ డైనింగ్‌హాలు నవ్వులతో మారుమోగింది.

"ఇక ఫర్వాలేదు జగన్! మాగీ కూడా తెలుగు ప్రాక్టీస్ చేస్తోంది కొద్ది కొద్దిగా. నిన్ను 'అన్నయా' అని పిలవడంతో ప్రారంభోత్సవం చేసింద'న్నమాట" అంటూ మార్గరెట్ వైపుచూసి నవ్వడంతో మార్గరెట్ ముఖాన కొత్తకాంతులు విరిశాయి.

సురేన్ క్షమించాడు. ఎన్నేళ్ళకు మళ్ళీ మాగీ అని ప్రేమగా పిలిచాడు. మార్గరెట్ కళ్లు తళుక్కున మెరిశాయి ఆనందంతో.

ఆరోజు సాయంత్రం తీరిగ్గా ఇంటి ముందు లాన్‌లో కూర్చుని సాగర్ సంధ్యల వివాహం గురించి ప్లాన్ చేస్తున్నారు జగన్నాథ్, సురేంద్రలు. తెల్లవారే పండితుని పిలిచి ముహూర్తాలు పెట్టుకోవాలనుకున్నారు. అప్పుడే అక్కడకు వచ్చారు సాగర్, సంధ్యా.

"ఏమ్మా సంధ్యా! మీ డాడీని హడావుడి పెట్టేశావట. అంతా బావమీది ప్రేమేనా? లేక మీరాడిన నాటకంలో భాగమా అదీ?" అంటూ నవ్వుతున్న జగన్ పక్కన కుర్చీలో కూర్చుంటూ-

"ముఖ్యంగా మిమ్మల్నిక్కడికి రప్పించాలనే కోరిక మావయ్యా....ఆ తర్వాత బావ మీద ప్రేమ" అంటూ పక్కనేవున్న సాగర్ వైపు చూస్తూ అంతలోనే సిగ్గు ముంచుకురాగా తల వంచుకుంది సంధ్య.

"మీరు నమ్మకండి నాన్నా...అన్నీ అబద్ధాలే! చెప్పవలసినదాన్ని తిప్పి చెప్పింది - మీరేమైనా అనుకుంటారని" అంటూ పకపకా నవ్వుతున్న సాగర్ నవ్వుతో శృతికలిపిన తండ్రినీ, మావయ్యనూ చూసి సాగర్ వైపుచూసి వెక్కిరించి ఇంట్లోకి పారిపోయింది సంధ్య. ★

# రూపాయి కథలు

## తెలివి

డిటెక్టివ్ చంద్రం ఎవరో వస్తున్న అలికిడి విని, చాలా బిజీగా వున్నట్టు నటించడం మొదలు పెట్టాడు.

వచ్చిన పెద్దమనిషి చాలా పొడుగ్గా వున్నాడు. అమాయకమైన అతని కళ్ళు చాలా బాధగా వున్నాయి.

"చెప్పండి..." అన్నాడు చంద్రం.

"నా పేరు చలపతి. మాది రాజమండ్రి. నిన్ననే వచ్చి హోటల్లో దిగాను. నా దగ్గర అయిదువేల రూపాయలున్నాయి. అన్నీ వందరూపాయలనోట్లే. అవి కాస్తా ఈ ఉదయం పోయాయి. ఏం చెయ్యాలో తోచలేదు. కాళ్ళూ చేతులూ ఆడటం లేదు. వున్న కాస్త మడిచెక్కా అమ్మేసి మా అమ్మ ఇచ్చింది ఆ డబ్బు. దాంతో ఏదన్నా చిన్న వ్యాపారమో, దొరికితే ఉద్యోగమో చేద్దామని అనుకున్నాను. కానీ ఇప్పుడంతా అధ్వాన్నం అయిపోయింది. ఏం చెయ్యను?' అన్నాడు దీనంగా.

"పోలీసు కంప్లెయింట్ ఇవ్వలేకపోయారా? వెంటనే దొరికిపోను కదా?!"



అన్నాడు చంద్రం.

"నిజమే...కానీ, ఆ సొమ్ము ఎవరు తీశారో నాకు తెలుసు. అతను జైలుకి వెళ్ళడం నాకు ఇష్టం లేదు. నా సొమ్ము నాకు దొరికితే చాలు"

"తెలుసా? ఎవరతను?!"

"నా రూము పక్కనే ఒకాయన వున్నాడు. అతను కూడా పాపం నాలాగే ఉద్యోగాన్వేషణకే వచ్చినట్లున్నాడు. అతను ఈ ఉదయం నా రూంకి వచ్చాడు. అప్పుడు నేను బాత్‌రూంకి వెళుతున్నాను. కూచోమన్నాను. నేను వచ్చేలోగా అతనాడబ్బు తస్కరించి వుండాలి. ఏదో

 

పొరపాటు చేశాడు. దారిద్ర్యం బాధ అలాంటిది. మీరు మంచి డిటెక్టివ్‌లు కదా! అంచేత ఏ రభసా జరక్కుండా నా సొమ్ము నాకు చేరే ఏర్పాటు చేస్తారని ఇలా వచ్చాను. మీరెలా చెప్తే అలా చేస్తాను" అన్నాడు చలపతి వినమ్రంగా.

చంద్రం చాలా దీర్ఘంగా ఆలోచించి—"అతన్ని తన రూంలో ఓ రెండు గంటల పాటు వుండకుండా చూడండి. ఏ సినిమాకో, షికారుకో తీసుకు వెళ్ళండి. మీ సొమ్ము మీకు అందే ఏర్పాటు చేస్తాను'' అన్నాడు.

రాత్రి ఏడుగంటలకు డిటెక్టివ్ చంద్రం చలపతి చెప్పిన రూంతలుపులు మారుతాళాలతో తెరిచి,గదంతాగాలించాడు. గుప్తంగా వున్న అనేక వస్తువులు వెతికాడు. చివరికి టేబిల్ సొరుగులో ఓ రుమాలులో చుట్టివున్న అయిదువేల రూపాయల కట్ట చూసి, తృప్తిగా నిట్టూర్చాడు. మళ్ళీ అన్నీ సర్దేసి చక్కగా గది తాళాలు వేసి ఇంటి ముఖం పట్టేడు.

* * *

అందజేసిన అయిదువేల రూపాయల్ని ఎంతో కృతజ్ఞతతో అందుకుంటూ ''మీరు ఎంతో గొప్ప డిటెక్టివ్‌లని విన్నాను.... ఇప్పుడు చూస్తున్నాను. చాలా కృతజ్ఞతలు. మీ ఫీజు..." అడిగాడు చలపతి.

తన కృషి ఫలించినందుకు చంద్రం ఎంతో ఆనందించి ''450 రూపాయలు" అన్నాడు.

చలపతి నాలుగు వంద రూపాయల నోట్లు ఇస్తూ "చిల్లర యాభై రూపాయలు సాయంత్రం ఇస్తాను. మీరింత సహాయం చేసినందుకు మీకు మంచి పార్టీ కూడా ఇవ్వాలనుంది. సాయంత్రం రెడీగా ఉండండేం" అంటూ ఆహ్వానించాడు.

* * *

సాయంత్రం డిటెక్టివ్ చంద్రం హోటల్లోని చలపతి గదికి వెళ్లాడు. తాళం వేసి వుంది. కౌంటర్ దగ్గరకు వెళ్ళి అడిగాడు.

"మధ్యాహ్నమే రూం ఖాళీచేసి వెళ్లిపోయారు...." అని జవాబు వచ్చింది.

అక్కడే ఉన్న ఇంకొకతను చంద్రం వేపు చూస్తూ "చలపతిగారా! చాలా మంచివాడండీ! పాపం బీదవాడు. నా గదిలో అయిదువేల రూపాయలు పోతే తనే తీసుకు వెళ్ళి పోలీసు రిపోర్టు ఇప్పించారు కూడాను. పాపం ఎంతో బాధ పడ్డాడు. వాళ్ళ తండ్రికి బాగులేదని కబురొస్తే, గ్రామం బయలుదేరాడు. పోలీసువారు వస్తున్నారు లెండి... ఈ హోటల్ బాయిస్ ఎవరో కొట్టేసి వుండాలి" అన్నాడు.

చంద్రం గొంతులో వెలక్కాయ పడింది.

—దేవరాజు రవి

## మంగళవాద్యం

''ఈ ఫొటో ఎవరిదండీ? ఈ కుర్రాడు సినిమా టికెట్లని బ్లాకులో అమ్ముతుంటే చూశాను. మూడు నాలుగుసార్లు ఇతని దగ్గర నేను టికెట్లు కొన్నట్టు జ్ఞాపకం! ఇతను మీ అబ్బాయేనాండీ?"

మా అమ్మాయి పెళ్ళి చూపులకొచ్చి నతను మా అబ్బాయి ఫొటో చూసి అన్న మాటలివి. అవును - వాడు మావాడే. నాకున్నది ఒక కొడుకు, ఒక కూతురు. వాడు అతి గారాబంగా పెరగటం వల్ల చెడు సహవాసాలు చేసి, రౌడీలా ఊరిమీద పడి నానా అల్లరీ చేస్తూ

ఉంటాడు.

ఇహ కూతురేమో పెళ్ళికి ఎదిగి కూచుంది. ఆ అమ్మాయిని ఎన్నిరోజులని ఇలా ఇంట్లో వుంచనూ? నేను ఎన్ని సంబంధాలు తెచ్చినా, వచ్చిన ప్రతి సంబంధం మావాడి నిర్వాకం చూసి వెనుదిరిగి వెళ్ళిపోతున్నారాయె!

ఈ సంబంధం కూడా తప్పుతుందనే భయంతోనే ముందు జాగ్రత్తగా "అరే రవీ! మనమ్మాయిని చూడటానికి సాయంత్రం పెళ్ళివారొస్తున్నారు. వాళ్ళు వచ్చినపుడు నువ్వీఛాయల్లో కనిపించ కూడదు. తెలిసిందా? కనీసం ఈ సంబంధమైనా స్థిరపడనీ" అని మావాణ్ణి ఇంటి నుంచి తరిమేశా! కాని ఆ కాబోయే పెళ్ళి కొడుకు ఎంత ఘటికుడో గాని గోడనున్న ఫొటోను చూసే మావాణ్ని గుర్తు పట్టేశాడు.

"అవునండీ... వాడు మావాడే" తల కిందికేసుకుని ఒప్పేసుకున్నా.

సరే పెళ్ళిచూపుల తతంగం మామూలు గానే ముగిసింది. ఆ వచ్చినవారు వెళ్ళిపోతూ "పెళ్ళం తర్వాత ఏ సంగతీ ఆలోచించి ఉత్తరం రాస్తామండీ" అన్న మామూలు పాటేపాడి వెళ్ళిపొయ్యారు.

ఇహ ఈ సంబంధమూ తప్పినట్టే. విసుగేసింది నాకు. ఎన్ని సంబంధాలని వెతకనూ? తెచ్చిన ప్రతి సంబంధం మావాడి మూలంగా చెడిపోతోంది. ఏం చేయనూ? మావాడి మీద బహు కోపం వచ్చింది నాకు.

ఇలా ఆలోచిస్తూ పడుకున్నా. చీకటి పడి వాడింటికొస్తూనే నా నడుముకున్న బెల్టు విప్పి వాడిని తెగబాదేను. నానా మాటలూ అని "నీ మొహం నాకు చూపకు పో" అని కసురుకున్నా. ఉక్రోషంతో వాడు ఎటో బయటికెళ్ళిపోయాడు.

పడుకున్నానన్న మాటేగాని అర్థ రాత్రయినా నాకు నిద్ర రావటంలా! వెధవ ఎక్కడికెళ్ళాడో? ఇలా ఆలోచిస్తోంటే మెల్లిగా తలుపు తెరుచుకుని పిల్లిలా లోపలికి నడిచాడు. గుర్తులిప్పకుండా పడుకుంటూంటే వాడి చెల్లెలు వాణ్ని ఆప్యాయంగా వంటింట్లోకి పిలుచుకుపోయి అన్నం తినిపించింది. చీకట్లో పడుకుని ఇదంతా చూస్తూన్న నాకు కొంత మనశ్శాంతి కలిగింది.

రోజులు గడుస్తున్నాయి.

ఒకరోజున అనుకోకుండా పెళ్ళిళ్ళ పేరయ్య మా ఇంట్లోకడుగు పెట్టాడు. ఇంకేమయినా సంబంధం తెచ్చాడను కున్నా. కాని అదేం కాదు. మొన్న వచ్చిన అబ్బాయే మా అమ్మాయిని చేసుకుంటా డుట! నాకాశ్చర్యమేసింది. కాని శాస్త్రిగారు చెప్పిందేమంటే–

ప్రతి కొత్త సినిమానీ మొదటిరోజు, మొదటిఆట చూడటం ఆ అబ్బాయి కలవాటు. 'అలవాటు' అనేకన్న అదొక పిచ్చి అంటే సరిపోతుంది. టికెట్లు బ్లాకులో అయినాసరే కాని ఆ సినిమాలు చూస్తూ వుంటాడీ అబ్బాయి. మావాడు ఎన్నో సార్లు టికెట్లను బ్లాకులో అమ్మాడట అతనికి. మా అమ్మాయిని చేసుకుంటే తన ఈ 'మొదటిరోజు మొదటి ఆట' కార్యక్రమం మావాడి సాయంతో నిర్విఘ్నంగా సాగుతుందని ఆ అబ్బాయి మా సంబంధానికి ఒప్పుకున్నాడట.

పెళ్ళి ముహూర్తం ఎప్పుడు పెట్టేదీ మా రవిగాడికే వదిలేశా!

—రామ్





Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly
Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd. No. H/HD

# ప్రకృతి చెప్పే పాఠాలు...



ప్రకృతి నుంచి మనం నేర్చుకోదగ్గవి ఎన్నో ఉన్నాయి. కొద్ది కొద్దిగా కూడబెట్టి దాన్నే పెద్ద మొత్తంగా చేసే నేర్పు కూడా అందులో ఒకటి. ఈ సూత్రాన్ని ఆచరణలో పెట్టడానికి మార్గదర్శి మీకు తోడ్పడుతుంది. చిన్న చిన్న మొత్తాలలో పొదుపుచేసి పెద్ద మొత్తం పొందే అవకాశాలు మీ అందుబాటులో ఉంచుతుంది.

అంతేకాదు, రెండు దశాబ్దాల వ్యాపారానుభవం ఉన్న మార్గదర్శి మీరు పొదుపుచేసే మొత్తాలకు పూర్తి భద్రత సమకూరుస్తుంది. లాభసాటి డివిడెండ్లు కూడా వరుసగా ఆ మొత్తాలకు తోడవుతూ ఉంటాయి. మార్గదర్శిలో పొదుపు భవిష్యత్తుకు మదుపు అని లక్ష మందికి పైగా ఇప్పటికే గ్రహించారు. మరి, మీ మాటేమిటి?

**డబ్బు కోసమేనా మీ చింత - మార్గదర్శి వున్నది మీ చెంత!**



## మార్గదర్శి

చిట్ ఫండ్ ప్రైవేటు లిమిటెడ్

మార్గదర్శి హౌస్, అబిద్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

**శాఖలు:** ● అబిడ్ సెంటర్, హైదరాబాద్ ● లక్డీకాపూల్, హైదరాబాద్ ● చిక్కడపల్లి, హైదరాబాద్ ● అమీర్‌పేట, హైదరాబాద్ ● కాబ్రా కాంప్లెక్స్, ఎమ్.జి.రోడ్, సికిందరాబాద్ ● బిసెంట్ రోడ్, విజయవాడ ● బందరు రోడ్, విజయవాడ ● మెయిన్ రోడ్, గుంటూరు ● మెయిన్ రోడ్, కాకినాడ ● ఇన్నీసుపేట, రాజమండ్రి ● నెహ్రూ రోడ్, కర్నూలు ● మెయిన్ రోడ్, విశాఖపట్నం ● జె. పి. ఎన్. రోడ్, వరంగల్, ● వైరారోడ్, ఖమ్మం

KIRON/MLF/81/